భారతీయ భౌతికవాదం

# చార్వాక దర్శనం





లోకాయత ప్రచురణలు

లోకాయత ప్రచురణ - 19
ముద్రణ :-1991 అక్టోబర్

భారతీయ భౌతికవాదం

# చార్వాక దర్శనం



రచయిత : శ్రీ కత్తి పద్మారావు

ముఖచిత్రం : ప్రభు (ఉదయం దినపత్రిక)



**వెల రూ. 15-00**

కాపీలకు :

కె. చార్వాకుడు
లోకాయత ప్రచురణలు
పొన్నూరు, 522 124
గుంటూరు, జిల్లా

# అంకితం

భౌతికవాద ఉద్యమంకోసం జీవితాన్ని అర్పించిన

మా ఉపాధ్యాయులు

శ్రీ బి. రామకృష్ణగారికి

మా అక్క గృహలక్ష్మి గారికి.

# ప్రచురణకర్తల మాట

"చార్వాక దర్శనం" పరిశోధనాత్మకమైన తాత్త్విక గ్రంథం. ఈ గ్రంథాన్ని చరిత్రను, తత్వశాస్త్రాన్ని పోరాటజీవితంతో ఉన్న అనుభవ సారంతో శ్రీ కత్తి పద్మారావుగారు మేళవించి రూపొందించి భారతీయ భౌతికవాదాన్ని శాస్త్రీయ దృక్పథంనుండి పరిశీలించి బహు గ్రంథ పరిశీలనతో మూలగ్రంథాలు సంస్కృతంలో అధ్యయనం చేసి, చారిత్రక అవగాహనతో ఆధునికయుగంలో ఒక పోరాటవీరుడిగా, మేధావిగా, నాయకునిగా ముందుకువచ్చిన శ్రీ కత్తి పద్మారావుగారు వ్రాసిన ఈ పరిశోధన గ్రంథం పీడితజాతుల విముక్తికి సిద్ధాంత భూమికను పోరాట రూపాన్ని అందిస్తుందని ఆశిస్తున్నాము.

హిందూ వ్యవస్థను, దానికి మూలమైన వైదికతత్వాన్ని, అగ్ర వర్ణరాజ్యాధికారాన్ని కూలదోసే ప్రయత్నంలో భాగంగా పీడిత వర్గానికి సంబంధించిన ప్రతిఒక్కరిచేతిలో ఈ గ్రంథం ఒక ఆయుధంగా ఉండ గలదని ఆశిస్తున్నాము.

డా॥యస్. చంద్రదస్
చైర్మన్
లోకాయత ప్రచురణలు

గుంటూరు,
19-10-91

# ఒక మాట

చార్వాక దర్శనం రచనకు కారంచేడు పోరాటకాలంలో ఆలోచన కలిగింది. ఆ తరువాత ఆరు సంవత్సరాలు నిరంతర అధ్యయనం తరువాత ఈ రచన పూర్తయింది. చుండూరు సంఘటన జరిగేనాటికి పుస్తకం ముద్రణకూడా పూర్తయింది. ఈ కాలంలో దళిత ఉద్యమంతో, పోరాటం చార్వాకదర్శన రచన యేకమై సాగింది. భారతదేశంలోని దళిత బల హీన మైనారిటీ వర్గాల విముక్తి పోరాటానికి ఈ గ్రంథం సిద్ధాంత ఆయుధం అవుతుందని విశ్వాసం ఉంది. ఈనా ప్రయత్నం ఎంతవరకు ఫలిస్తుందనేదానికి చరిత్రే సమాధానం చెప్పాలి.

ఈ గ్రంథ రచనకు నాతో సహకరించిన నా సహచరిణి స్వర్ణకు అభినందనలు. ఈ గ్రంథ రచనకు సహకరించిన, తాత్వికులు, గ్రంథాలయాధిపతులు, సహచరులందరికి కృతజ్ఞతలు.

చుండూరు పోరాట శిబిరం,
అనిల్ కుమార్ నగర్.

కత్తి పద్మారావు

## ఈ రచయిత యితరు గ్రంధములు

| | | |
|---|---|---|
| 1) | జనగీతం (కాపీలు లేవు) | 3-00 |
| 2) | కులం పునాదులు | 13-00 |
| 3) | సాంఘిక విప్లవ రచయితలు(కాపీలు లేవు) | 10-00 |
| 4) | కులసంఘర్షణలు | 2-00 |
| 5) | జైలుగంటలు | 4-00 |
| 6) | దేశం డైరీ | 10-00 |
| 7) | విముక్తి గీతం | 1-00 |
| 8) | సాంఘిక విప్లవమూర్తి అంబేద్కర్ | 12-00 |
| 9) | చార్వాకదర్శనం | 15-00 |
| 10) | రక్తక్షేత్రం | 5-00 |
| 11) | భారతీయ సంస్కృతిలో స్త్రీ (అముద్రితం) | |
| 12) | సోషల్ ఫిలాసిఫికల్ మూమెంట్ ఇన్ఇండియా | 2-00 |
| 13) | దళిత ఉమెన్ | 3-00 |

# విషయ సూచిక

# పీఠిక

భారతదేశంలో తత్త్వశాస్త్రమంటే[1] ఆధ్యాత్మిక వాదంగా ప్రచారం చేశారు. తత్త్వశాస్త్రమనగానే ఆత్మగురించో, పరలోకంగురించో చెప్పేదనే భావన ఏర్పడింది. నిజానికి భౌతికాంశాల నుండి రూపొందిన దాన్నే తత్త్వశాస్త్రం అని అంటారు. భారత దేశంలో అతిప్రాచీన జాతులు ఈ తాత్త్వికాంశాల మీద సుదీర్ఘమైన చర్చచేశారు. శరీరానికి, చైతన్యానికి ఉన్న సంబంధాన్ని, మానవునికీ, ప్రకృతికీ ఉన్న సంబంధాన్ని విశ్వపరిణామాన్ని, మానవ పరిణామాన్ని భౌతిక దృక్పథంతోవారు వివేచించారు. మానవునికి తన చుట్టువున్న ప్రకృతి సమాజం పట్ల ఉదయించిన అనేక ప్రశ్నలకు వారు భౌతికదృక్పథంతో సమాధానం వెతికారు

---

1. తత్త్వశాస్త్రమంటే ఏమిటి అన్న ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానం ఇవ్వగలిగే స్థితిలో మనం ఇప్పుడు ఉన్నాం. తత్త్వశాస్త్రమంటే ప్రపంచ దృక్పథం. ఇది ప్రపంచానికీ, ప్రకృతికీ, సమాజానికీ, సమాజంలో మనిషి స్థానానికి సంబంధించిన దృక్పథం; ప్రపంచాన్ని అవగాహన చేసుకోవడానికీ, మార్చడానికీ, గల అవకాశాల తాలూకు విశ్లేషణ అది. అంతేకాదు తత్త్వశాస్త్రం అంటే సంపాదించిన జ్ఞానం ఆధారంగా కార్యాచరణ సాగించాల్సిన ఆవశ్యకతలో విశ్వాసమూ, నమ్మకమూను. అది జ్ఞానం, అంచనాల సమ్మేళనం; జ్ఞానం విశ్వాసాల సమ్మేళనం; ఉద్వేగాల తార్కికాలోచనల సమ్మేళనం; అందుచేత తత్త్వశాస్త్రమంటే సైద్ధాంతిక జ్ఞానం యొక్క ప్రత్యేక రూపం; ఈ జ్ఞానరూపంలో సమస్త మానవజాతి అనుభవం తాలూకు వస్తుగత సాధారణీకరణే కాక ఆ అనుభవంలోని ముఖ్యమైన అంశాల గుర్తింపు కూడా ఉంటుంది. ఆ అంశాలు మనిషి దృష్టిలో చాలా ప్రాముఖ్యం గలవి. (తత్త్వశాస్త్రమంటే ఏమిటి? గలినా కిరిలెంకో లిదియా కోర్చనోవా)

మానవుడు భౌతిక ప్రపంచం నుండి ప్రభవించడంవల్ల అతని ఆలోచనలు, భావాలు, ఊహలు భౌతికవాస్తవికత వైపే మొదట్లో పయనించాయి. నిప్పునీ, నీటినీ, గాలినీ, భూమినీ వాటిభౌతిక రూపాలను తెలుసు కోవడమే మానవుని అభివృద్ధి సోపానం. నిప్పుని మానవుడు గుర్తించక ముందు, దాని భౌతిక శక్తిని అర్థం చేసు కోకముందు. విడివడిముందుకు నడవలేక పోయాడు.

నిప్పు మానవ సామాజిక పరిణామంలో కీలకపాత్ర వహించింది. నిప్పుని ఆరాధించిన జాతులకంటే, నిప్పుని భౌతికశక్తిగా గుర్తించినజాతులు శక్తివంతంగా ముందుకు నడిచాయి. నిప్పు మానవ జీవితాన్ని ఒక భౌతిక శక్తిగా ప్రభావితం చేసింది. భారత దేశంలో చార్వాకులు నిప్పుకి, "భౌతికశాస్త్రీతత్త్వాన్ని" రూపొందించారు. నిప్పునారాధించే జాతులకీ, నిప్పుని అధీనం చేసుకున్న జాతులకీ, భారతదేశంలో సమరం జరిగింది. తనకు చుట్టూ ఉన్న భౌతిక ప్రపంచాన్ని సమన్వయించుకోవడంలో విఫలమైనవారు భావవాదులుగా రూపొందారు. వీరు భౌతిక సామాజిక వాస్తవికతకు భిన్నమైన భావవాదంతో భౌతిక వాదుల కెదురు నిలుస్తూ వచ్చారు. నిప్పుని పదార్థంగా కనుగొన్న చార్వాకుల వారసులు భారతీయ ఆదిమజాతులే. అడవులంతగలబెట్టి పోడువ్యవసాయం చేస్తున్న గిరిజనులు నిప్పుని సామాజిక పరిణామానికి ఉపయుక్తం చేసి, అటవిక సమూహాల పరిణామం నుండి వ్యవసాయ సంస్కృతిని రూపొందించి నిప్పుని భౌతిక శక్తిగా వాడుకున్నారు.

అంతేగాక అసలు వానరుడి నుంచి నరుడిగా పరిణామం చెందిన ప్రతి కీలక దశలో మానవుని భౌతిక దృక్పథమే అతనికి నిర్ణయాత్మక మెట్టుగా ఉపకరించింది. లక్షలాది సంవత్సరాలకుపూర్వం ఉష్ణమండలంలో ఎక్కడో ఒక చోట నరవానరుడిగా ఉన్న మానవుడు మానవుడిగా రూపొందినపరిణామంలో చేతుల్నిరూపొందించుకున్న తీరుని ఏంగెల్స్ ఇలాఅభివర్ణించాడు. "రోమశకితులైన మన పూర్వీకులు మొదట ఒక నియమంగానూ తరువాత అవసరంగానూ, నిలబడినడవటానికి కారణం అనాటికి చేతులకు వివిధ రకాలైనటువంటి ఇతరపనులు ఏర్పడి వుంటాయని అనుకోవాలి. వాళ్ళడి కోతుల్లో కూడా అప్పటికే కాలుచేతులకు వేర్వేరు పనుల విభాగం

పేర్పడేవుంది. చెట్లెక్కుటలో కాళ్ళకంటే చేతులు విభిన్నములైన ధర్మములు నిర్వర్తించేవని ఇదివరకే చెప్పబడింది కదా ఈ వానరములన్నీ ఆహారాన్ని స్వీకరించడానికి ఆహారమును పట్టుకోడానికి చేతులనుపయోగిస్తాయి. కొన్ని రకాల క్రింది తరగతి స్తన్యజంతువులలో కూడా ముందు పంజాల నుపయోగించడం మనం చూస్తాం. చాల రకాల కోతులు తాము చెట్ల మీద నివసించుటకై గూళ్లను నిర్మించుటకు చేతులనుపయోగిస్తాయి. చింపాంజీలు తమ చేతులతో చెట్ల కొమ్మల మధ్య కప్పులు వేసుకొని ఎండవానల నుండి కాపాడు కొంటాయి. శత్రువుల నుండి తమ ఆత్మ రక్షణకై ఇవి చేతులతో కర్రలను, కొమ్మలను పట్టుకొని కొట్టుటకు లేక రాళ్లతో, కాయలతో కొట్టుటకు పూనుకుంటాయి. బోనుల్లో వుంచబడిన కోతులు మానవులను చూచి నేర్చుకున్న అనేక చిన్న చిన్న పనులను తమ చేతులతో చేయగలవు. కాని మానవునికెంతో సన్నిహితమైన దశకు చేరుకున్న వానరుని యొక్క చేతినీ, అనేక లక్షల సంవత్సరముల కర్మలచే పరిష్కృతమై అభివృద్ధి నొందిన చేతిని చూస్తే ఎంతో భేదం ఇక్కడనే కనబడుతుంది. కోతుల యొక్క, మానవుల యొక్క హస్తంలోని ఎముకల సంఖ్య, కండరముల సంఖ్య ఒక్కటే, నిర్మాణము కూడ ఒక్కటే. అయినా ఎంతటి నికృష్టస్థితిలోని ఆటవికుడైన మానవుని హస్తము కూడ ఎంతో అభివృద్ధి చెందిన వానర హస్తము చేయజాలని పనులను వందలాదిగా చేస్తుంది. వానర హస్తము ఏ చిన్న రాతి పనిముట్టును, ఎంత బండగానయినా చేసి ఎరుగదు.

అందుచేత మొట్టమొదటి వానరుని నుండి నరుడిగా వృద్ధి చెందుతున్న లక్షలాది సంవత్సరముల కాలంలోను మన పూర్వీకులు తమ చేతులతో అతి సామాన్యమైన కర్మలను, చిన్న చిన్న వాటిని చేస్తూ అలవరుచుకుంటూ ఉత్తీర్ణం చేసుకుంటూ వచ్చారని తెలుస్తుంది. నేటి ఆటవికులు ఎంత నికృష్టదశలో ఉన్నవాళ్లయినాసరే, పశుతుల్యులుగా ఉన్నవాళ్లయినా సరే శారీరికంగా హీనదశకు దిగజారినవాళ్లయినా సరే పైపరిణామదశలోని వారికంటే అత్యున్నతులని చెప్పాల్సి ఉంటుంది. మానవ హస్తాలతో మొట్టమొదటగా రాతిని వాడియైన పనిముట్టుగా చేసినప్పటి నుండి ఇప్పటివరకు గడచిన చారిత్రిక యుగంతో పోల్చిచూస్తే ఈ రాతి పనిముట్టును చేయుటకు పూర్వమున్న కాలమే బహుదీర్ఘమైనదికాని, అప్పుడే నిర్ణయాత్మకమైనటువంటి అడుగువేయబడింది. చేతికి స్వేచ్ఛ

కలిగింది. దానికంతకంతకూ అధికమైన నేర్పు, నైపుణ్యమూ కలుగుతూ వచ్చింది. ఈ రీతిగా అలవడిన నేర్పు, నైపుణ్యమూ తరువాత తరాల వారికి సంక్రమించబడుతూ అంతకంతకూ అభివృద్ధి నొందించ బడుతు వచ్చాయి,''[2]

కావున మానవుని భౌతికదృక్పథం, ప్రకృతితో అతని సమన్వయం మానవ అభివృద్ధికి మూలమయ్యాయి. దీనికి భిన్నంగా ప్రకృతికి అధీనులైవవారు భావవాదులయ్యారు. ఈ విషయాన్ని రాహుల్ సాంకృత్యాయన్ తన ''దర్శన్‌దిగ్దర్శన్'' లో ఇలా వివరించారు.

''అనాటి మానవుడు దాదాపుగా ప్రకృతిననుసరించి జీవించేవాడు ప్రకృతి మీద ఆధారపడి బతుకుతున్న అలనాటి మానవుడి అజ్ఞానమూ, భయమూ-దేవుడికీ, మతానికీ కారణమయ్యాయి. కాలాంతరంలో మానవుడిలో బుద్ధివికాసం జరిగింది. వెనుక కల్పించుకున్న (సాధారణమైన) దేవతా కల్పన, మతానికి సంబంధించిన ఆచార వ్యవహారాలు వికసించిన అతడి బుద్ధిని సంతృప్తి పరచలేక పోయాయి. అస్థితిలో మానవుడి బుర్ర నేలవిడిచి సాముచేయటం ప్రారంభించింది. ఇంక అతడు ఊహలలోకాల్లోకి రెక్కలు విచ్చుకొని ఎగరసాగాడు. దార్శనికచింతన చేయసాగాడు''[3]

భారతదేశంలో భౌతిక వాద చింతన అన్ని కీలక పరిణామాలన్నీ ప్రధాన శక్తిగా నిలిచింది. మనుష్యజాతి ప్రతి పరిణామంలో తన ఆలోచనను ప్రకృతికీ, పశుప్రవృత్తికీ ముడి వేసి రాబర్ట్ బ్రిఫాల్ట్ శాస్త్రీయంగా ఇలా వివరించారు.

" The human mind has a twofold origin. It derives' on the one hand, from the evolution of organic life through the long line of man's animal ancestry; it is also the product of a develop-

2. నరుడు వానరుడిగా రూపొందిన పరిణామ క్రమంలో శ్రమ నిర్వహించినపాత్ర - ఫ్రెడరిక్ ఏంగెల్స్ తెలుగుఅనువాదం సంధూరు ప్రసాదరావు పేజీ 4-5. మార్క్సిస్టు ప్రచురణలు 1976.

3. భారతీయ దర్శనం రాహుల్‌సాంకృత్యాయన్ తెలుగు అనువాదం ఆలూరిభుజంగరావు పేజీ 1-2 1986.

ment which has taken place in the course of the career of humanity itself and under social conditions. Those two portions of our mental inheritance differ profoundly in many respects."

(The Mothers – Robert Briffault Page 1)

మానవునిలో ఉన్న పశు ప్రవృత్తికీ, మానవ ప్రవృత్తికీ జరుగుతున్న అంతః సంఘర్షణలో మానవత్వాన్ని ప్రతిష్ఠించుకోవడంలో మానవుడు విజయం పొందుతూ ముందుకు నడుస్తున్నాడు. ఈ అభివృద్ధికి కారణం మానవుని భౌతిక దృక్పథమే. మానవునిలోని అంతః సంఘర్షణే కాక ప్రకృతితో అతడు పోరాడుతూ ప్రకృతితో తన పోరాటం నుండి తన అభివృద్ధిని, పరిణామాన్ని కొనసాగిస్తున్నాడు. ఈ విషయాన్ని ధృవీకరిస్తూ మోర్గాన్ తన ప్రసిద్ధమైన 'Ancient Society' పీఠికలో ఇలా వర్ణించాడు.

"Inventions and discoveries stand in serial relations along the lines of human progress, and register its successive stages; while social and civil institutions, in virtue of their connection with perpetual human wants, have been developed from a few primary germs of thought. They exhibit a similar register of progress. These institutions, inventions and discoveries have embodied and preserved the principal facts now remaining illustrative ot this experience. When collated and compared they tend to show the unity of origin of mankind, the similarity of human wants in the same stage of advancement and the uniformity of the operations of the human mind in similar conditions of society."[4]

మానవ ప్రగతి మార్గంలో ఆతని ఆవిష్కరణలూ, కనుగొన్న సత్యాలూ పరస్పర సంబంధాలు కలిగి ఉండి, ఆ ప్రగతిని క్రమాంతర దశలలో క్రోడీకరిస్తాయి. విరామమెరుగని మానవావసరాల దృష్ట్యా సామాజిక, పౌర సంస్థలన్నీ, కొన్ని ప్రాథమిక ఆలోచనల నుండి అభివృద్ధి చెందుతాయి. అవి అదేవిధమైన ప్రగతి యొక్క క్రోడీకరణను

---

4 Ancient Society – LEWIS HENRY MORGAN.
First published 1877 Indian Edition 1982 (preface, page xxxiv

ప్రదర్శిస్తాయి. ఈ సంస్థలు, ఆవిష్కరణలూ, కనుగొన్న విషయాలూ ప్రాథమిక సత్యాలను పరిరక్షించి మానవుని అనుభవాలకు నిదర్శనంగా నిలచి ఉన్నాయి. వాటన్నింటినీ సరిపోల్చి చూపినప్పుడు, మానవజాతి ఒకటేనని. ఒకే అభివృద్ధి దశలలో వారి కోరికలన్నీ ఒక్కలాగే ఉన్నాయనీ, సమాజంలో పరిస్థితులు ఒకే విధంగా ఉన్నప్పుడు 'మానవ మేధస్సు' కూడా ఒకే విధంగా పనిచేస్తుందనీ సూచిస్తాయి.

మానవ జాతి ప్రతి అడుగులో తన అస్థిత్వాన్ని వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ ముందుకునడిచింది. దీనంతటికి భౌతిక దృక్పథమే మూలం. ఈ భౌతిక దృక్పథంతో కూడినమానవ ప్రయాణానికి భావవాదం ఒక పెద్ద అవరోధంగా నిలిచింది. మానవ ప్రగతిలో అసమానతలను సృష్టించింది.

చరిత్ర పరిణామ క్రమంలో మానవ సమాజాన్ని పరిశీలించడాన్ని సమన్వయించడాన్ని మార్క్స్ గతితార్కిక చారిత్రిక భౌతికవాద దృక్పథమన్నాడు[5]. ఈ క్రమంలో భారత సమాజాన్ని తత్త్వశాస్త్రాన్ని పరిశీలిస్తే చార్వాకులు భారత ఉత్తఖండంలో భౌతిక సిద్ధాంతకర్తలుగా మన ముందు నిలుస్తారు. వారికి ఎదురు నిలిచిన వైదికులు భావవాదానికి కొమ్ముకాసిన ప్రతినిధులు అయ్యారు. ఆ క్రమాన్ని మనం పరిశీలిస్తే భారతీయ తాత్త్విక దృక్పథం సుస్పష్టమౌతుంది. భారతీయ సమాజ పరిణామంలో దాని పాత్ర మనకు తెలుస్తుంది.

## వేదాలు - భావవాదం

వేదాలు భారతదేశానికి వలసవచ్చిన రాజకీయ తెగలైన ఆర్యులు రూపొందించుకున్న భావజాలం. ఈ వేదాలు క్రీ॥పూ 2000-750 సం॥ల మధ్యలో రచించబడినాయని వింటర్నిట్జ్ (Winternitz) పేర్కొన్నాడు. కీత్ (Keith) క్రీ॥పూ 1200-350 సం॥ల మధ్యలోవని తెలిపాడు. సాధార

---

5. డార్విన్ ఎలా సజీవ ప్రకృతి యొక్క అభివృద్ధి నియమాన్ని ఆవిష్కరించినాడో, అలాగే మార్క్స్ మానవ చరిత్రయొక్క అభివృద్ధి నియమాన్ని ఆవిష్కరించాడు- ఫ్రెడరిక్ ఏంగెల్స్ (కార్ల్ మార్క్స్ సమాధి వద్ద ఉపన్యాసం)

జంగా వేదరచన క్రీ॥పూ 1400 ప్రాంతంలో ప్రారంభమై క్రీ॥పూ 600సం॥ వరకు జరిగిందని చరిత్రకారులు భావిస్తున్నారు. వేదశబ్దమునకు 'జ్ఞానమని' అర్థం ఇవ్వబడింది.

జైమిని అభిప్రాయం ప్రకారం వేదాలు రెండు భాగాలు 1. మంత్రాలు 2. బ్రాహ్మణాలు. మంత్రాల సంకలనాన్ని సంహితులని అంటారు. ఋగ్వేదానికీ, యజుర్వేదానికీ, సామవేదానికీ, అధర్వణ వేదానికీ, సంహితలున్నాయి. ఇవి ఒకరి నోటినుండి ఒకరు కంఠస్తం చేశారు. అందుకే వీటిని శృతులు అన్నారు. వేదాలు సంహితలుగానే కాక బ్రాహ్మణాలుగా, ఆరణ్యకాలుగా కూడా విభజించారు. నాలుగు వేదాల్లో అతిపురాతనమైంది ఋగ్వేదం. ఋగ్వేద మంత్రకర్తలలో విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, భరద్వాజుడు, గౌతముడు ముఖ్యులు. వీరు క్రీ॥పూ 1500 సం॥ ప్రాంతం వారిగా గుర్తింప బడ్డారు. ఋగ్వేదం క్రీ॥పూ 1520 సం॥ ప్రాంతం నుండి క్రీ॥పూ 1420 సం॥ దాకా వివిధ ఋషులచేత వ్రాయబడుతూనేఉంది. ఋగ్వేదంలో అగ్ని[6], వరుణుడు, సూర్యుడు, ఇంద్రుడు మొదలైన దేవతలను కొనియాడారు.

---

౬. ఋగ్వేదము, అనువాకము౧, సూక్తము ౪౪
(ఋషి-కణ్వపుత్రుడగు ప్రస్కణ్వుడు; దేవత అగ్ని; చందస్సు-బృహతి)
౪౧౯ అగ్నే వివస్వ దుషగు శ్చిత్రం రాధో అమర్త్యః
ఆదాశుషే జాతవేదో వహ త్వమద్యా దేవా ఉషర్బుధః॥
దం॥ 'ఓ యగ్నీ ఉషస్సునుండి నానావిధమయిన నివాస యోగ్యమయిన యన్నమును యజమానునకుఁ దెచ్చియిమ్ము. మరణము లేనివాఁడా। జంతువులన్నింటిని దెలిసినవాఁడా। తెల్లవాఱు వఱకు మేల్కొని యున్న దేవతలను ఈ దినమందుఁ దీసికొనిరమ్ము.
౪౨౯ నిత్యా యజ్ఞస్య సాధన యగ్నే హోతార మృత్విజమ్।
మనుష్వ ద్దేవ ధీమహిప్ర చేతసం జీరం దూతమమర్త్యమ్॥
దం॥ ఓయగ్నిదేవా ! యజ్ఞమును గలిగించునట్టి, ఋత్విజుఁడవగునట్టి, అధికజ్ఞానము గలిగినట్టి, శత్రుపుల వయసునకు హాని కలిగించునటి, మరణములేనట్టి, దేవదూత వగునిన్ను మనువు నిలిపినట్లు మేము (వేదిపై) నిలుపుచున్నాము.
(ఆంధ్రవేదములు, ఋగ్వేదము. పేజీ ౧౧౩ - ౧౧౪)

ఋగ్వేదంలో సృష్టిక్రమం గూర్చి ఇలా వర్ణింపబడంది. ''ఋగ్వేదము ననుసరించి ఆదిలో సత్, అసత్తులు రెండును లేవు - (సదసద భావమే); వాయువు గాని అంతరాళము గాని లేవు. ఆచ్ఛాదము విశ్రాంతి జలము అఖాతము (అగాధము) మృత్యువు చావు లేమి రాత్రిం దినములు ఏవియును లేవు. నిర్వాత ప్రదేశమున ఒక వ్యక్తి స్వీయశక్తి వలన- స్వధా- నిశ్వసించునాతడుకలడు. అన్యమేదియును లేదు. శూన్యము అంధకారము శూన్యావృతము- అంధకారావృతము కాగా సర్వము జలమయము. (సలిల) అతడు తన తపోమహిమ వలన అంత శ్శక్తి వలన వ్యక్తము కాగలయది (ఆభూ) శూన్య (తుచ్య) గర్భమున నున్నది వ్యక్తమయినది- అవ్యక్తము నుండి వ్యక్తము ప్రకటితమయి నది. ఆ వ్యక్తికి ఆ జలమయస్థితిలో ఇచ్ఛ గలిగినది. అదియే మొదటి మనోబీజము. మనీషులు హృదయకుహరమనే సత్తు యొక్క మూల కార ణమను అసత్తునందే కనుగొనిరి. వారి కొలత్రాడు (మనోరజ్జువు) భూమ్యం తరాళములకు ప్రసరించి (రేతోధాః) బీజము నుంచిన వారు (అఘామంత రుప్తం బీజం- బ్రహ్మ) మహిమానాః మహిమగలవారు అంతరుద్బోధ (స్వధా) ఇహమున అంతరాళమున- అందరాని తనము (ప్రాయతి ఈ శక్తులు శక్తిమంతులు కలరని కనుగొనిరి.)[7]

ఈ సృష్టిక్రమం మనకు ఋగ్వేదంలోని భావవాదాన్ని స్పష్టం చేస్తుంది. ఈ సృష్టిక్రమాన్ని మరింత గజిబిజిచేస్తూ ఋగ్వేదం ఇలా వివరించింది.

"ఋగ్వేదమున జడాజడ ప్రకృతిని గూర్చి ఇంకను ఇట్లున్నది దివ్యుల అనాది కాలమున అవ్యక్తమునుండి వ్యక్తము, సత్తు అసత్తునుండి జనించినది. క్రమ వ్యక్తమున, సత్తు తర్వాత దిక్కులు వ్యక్తమయినవి. సత్తు ఉత్తాన పదము నుండి వచ్చినది. ఉత్తాన పదమునుండి విశ్వమా విర్భవించింది. విశ్వమున దిక్కులు స్థానముద్భూతమయినది. దక్షప్రజా పతి అదితికి పుట్టెను. అదితి దక్షునకు పుట్టెను. ఎందుచేతననగా నీ కుమా_రై

7. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర- ప్రథమసంపుటము- ప్రాగ్విభా గము. అనువాదము పరిపెల్ల విశ్వనాథశాస్త్రి- 1961, పేజి - 39.

అయినఅతిది పుట్టినపుడు ఆమెకుదివ్యులుద్భవించిరి. వారు ఉపకారశీలురు అమర్త్యులు - మృతిలేనివారు ఇటసత్తు అనగా దేశకాలములచే నిర్దేశించ దగినమొదట వ్యక్తమయిన విశ్వము. అసత్తు అనగా సత్తుకు పూర్వము న్నది; దేశకాలములచే నిర్దేశించనలవి కానిది. వుత్తానపదమనగా జలార్ణవమే అనంతము అగోచరము అనగా అది ఇది అని నిర్దేశించరానిది_ జలములు. ఉత్తానపదమే అదితి అనంతములేక అనాది- ఆద్యంతరహితము- అసత్తు- దక్షుడనగా గ్రహణశక్తి- అంతరాత్మ- ఆత్మీయతాతత్వము నకది సంబంధించినది. అదితి నుండి దక్షుని జననము చరక సంహితలో నుదహరించిన సాంఖ్యదర్శనముతో సమన్వయించును. అట అవ్యక్తమనగా ప్రకృతి పురుష విభాగమునకు పూర్వావస్థ. దక్షుని వలన అదితి జన్మించుట అనగా ప్రధానము- చిన్మాత్ర - ప్రకృతిదాని స్వభావము"[8]

శాస్త్రంతో ఏ మాత్రం పరిచయం ఉన్నవారెవరైనా సృష్టిక్రమంపైన ఋగ్వేదం ఎంత అశాస్త్రీయంగా భాషించిందో అర్థంచేసుకో గలుగుతారు. ఋగ్వేదఆర్యులు ఆకాశం అద్భుతమైనదని సూర్యచంద్ర నక్షత్రాలు మారునుగాని ఆకాశం మారదనీ నుడివారు. వారు సృష్టించుకొని కొలిచిన దేవతల గురించి సర్వేపల్లి రాధాకృష్ణన్ ఇలా వర్ణిస్తున్నారు.

"ద్యౌస్సు (దివ్ ప్రకాశించు) ఇండో ఇరేనియన్ దేవతయేకాక, ఇండో యూరోపియన్ దేవతయునై యున్నది, గ్రీసుదేశమున 'జ్యూస్' దేవతగాను, ఇటలీలో జ్యూపెటర్ దేవతగాను, ట్యూటానిక్ జాతులందు, "టైరీ" లేక టై దేవతగాను నేటికి ఉన్నది. మొదట "దేవ" శబ్ధము "కాంతి"కిని తరువాత కాంతిగల సూర్యనక్షత్రములకును, నుషస్సునకును, పగటికిని గూడ నుపయోగింపబడినది. ప్రకాశించు సర్వవస్తువులనీ నామము సామాన్యముగా వాడబడినది. భూమి కూడ శ్రీఘ్రముగా దేవతయైనది. భూమ్యాకాశములు మొదలు, వైశాల్యము, విశేషవ్యాప్తి కలిగి ఫలవంతములైనవిగా గ్రహింపబడినవి. భూమికిగల లక్షణములు "తేనెనిచ్చునది" 'క్షీరసమృద్ధి, గలదియని వర్ణింపబడినది. మరియు అచిరకాలములో భూమ్యాకాశములకు మనుష్యలక్షణము లారోపించి

---

8 ibid పేజీ_49

“అజరుడనీయు, మాతయనీయు, బీతయనీయు” సంబోధించిరి. ఔదార్యము సర్వజ్ఞత్వము, ధర్మగుణము మున్నగు నైతికలక్షణములన్వయించిరి. ఈ గుణారోపణ విధానము, మొదట భౌతికము, తరువాత వ్యక్తిగతము, వెనుక దైవికముపై వెలసినది. అన్నిదేశము లందును భూమ్యాకాశములు ప్రత్యేకముగా పూజింపబడినను తరువాత వానికి వివాహము చేసిరి. ఆకాశము బీజప్రదాతయై, భూదేవత వివిధ ఫలక్షేత్రమై గర్భవతియైనది. హుమరుకవి గీతములలో భూమినిట్లు సంభోధించెను ‘దేవతలకు జనని నక్షత్రమయాకాశమునగు భార్య. ఈభూమ్యాకాశములు సర్వజీవరాశికి మాతా పితలే. ఏలన నవియే ప్రాణకోటికి పోషణసామగ్రి నిచ్చి రక్షించుచున్నవి. ఋగ్వేదమందు వీనినేకవచనార్థకమగుబహువచన శబ్దముతో వాడిరి. ఉషస్సు, సూర్యుడు, అగ్ని, వాయువు, వర్షము వానిసంతతి మనుష్యులకు దేవతలకును వారుతల్లితండ్రులు. దేవతలసంఖ్య పెరగడంతో భూమ్యాకాశముల కర్తలెవరను ప్రశ్న బయలుదేరినది. సర్వ జీవముల కానందమిచ్చు, తేజోమయములైన భూమ్యాకాశములు దేవతలలో ఎవడుచేసెనో అతడు వారిలోకెల్ల అత్యధిక శేముషీమంతుడు. ఈ తేజోమయభూతములను తనప్రజ్ఞచే నియమించి శాశ్వతాధారములపై నిలిపినాడు. ఈ సృజించుశక్తి అగ్నికి ఇంద్రునికి, సోమునికి ఇవ్వబడినది. ఈ గౌరవమితర దేవతలకు ఇచ్చినారు.[9]

ప్రకృతి శక్తులని దేవతలుగా ఆరాధించిన వైదిక ఋషులు మానవ పరిణామంలో అభివృద్ధి చెందిన భౌతికవాద దృక్పథాన్ని శిథిలం చేయుడానికి ప్రయత్నించారు. సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆర్యుల భావవాదాన్ని అనేక చోట్ల నుతించాడు. భౌతిక వాద దృక్పథంతో ఈ ప్రకృతి పైన చార్వాకులు ఏనాడో సరియైన వివరణ ఇచ్చారు. వైదిక కాలంలో ఆర్య ఋషులు ఒక్కొక్క కాలంలో ఒక్కొక్కదేవతను ప్రధానం చేసి కొనియాడుతు వచ్చారు. ఈ పరిణామాన్ని మనం భౌతిక దృక్పథంతో పరిశీలించాల్సి ఉంటుంది. స్వామి శర్వానంద “ది వేదాస్ అండ్ ది రెలిజియస్ టీచింగ్స్” అనే వ్యాసంలో ఈ పరిణామాన్ని గూర్చి ఇలా పేర్కొన్నాడు.

---

9. భారతీయ తత్త్వశాస్త్రము (సర్వేపల్లి రాధాకృష్ణన్ ఇండియన్ ఫిలాసఫీకి ఆంధ్రానువాదము ఋలుసు వెంకటేశ్వర్లు). 1981, పేజీ 5-501

"మంచు రాలుతున్న హిమాలయాల సొగసు, విశాలమైన పచ్చిక బీళ్లు, నదులు సముద్రాలు మూడు ప్రక్కలా ఉండటంతో ఋతు సౌంద ర్యాన్ని ఆస్వాదించే అవకాశంకలిగిన ఇండో- ఆర్యులువాటిచే ప్రభావి తమై మొదటినుండి కవితాత్మకమైన ఆధ్యాత్మికమైన ఆవేశానికి గురయ్యా రనీ, తత్ఫలితంగా సంకుచితమైన మేధస్సుతో మిగిలిన ప్రపంచానికి దూరమయ్యారని, వేద కాలపు ముందు దశలో మహోన్నతమైన ప్రకృ తిచే కవితాత్మక ప్రభావానికిలోనైన ఇండో ఆర్యుడు, తన పసితనపు మన స్తత్వంతో ఈ ప్రకృతిని "ఆధ్యాత్మిక రూపాలుగా" భావించి ప్రకృతిని అత్యంత భక్తితో ఆరాధించడం మొదలు పెట్టాడని, ఆర్యచరిత్ర యొక్క ప్రాచీన దినాలనుండీ- మిత్ర, సూర్యుడు; వరుణ,[10] రాత్రిదేవుడు లేక నీలాకాశ దేవుడు; ద్యు మరియు పృథ్వి భూమ్యాకాశాలు; అగ్ని లేకమంట మొదలైన ప్రాకృతిక అంశాలన్నింటినీ వేదకాలం ముందునుంచీ అతి తేలికైన, క్లిష్టమైన కర్మకాండ ద్వారా ఇండో ఆర్యులచే ఆధ్యాత్మిక రూపాలుగా పూజించబడేవనీ ఆయన వ్యాఖ్యానించారు. ఈ ఊహల పోహలే తరువాత కాలంలో వేదాలుగా క్రోడీకరింపబడ్డాయి. వేదాల్లో కావితా దృక్పథం కన్పిస్తుంది కానీ తాత్త్విక దృక్పథం కనిపించదు.

వేదకాల పూర్వంఅస్పష్టంగా ఉన్న ఈ దేవతారూపాలకు ఋగ్వే దంలో పరిపూర్ణరూపం ఇచ్చారు. ద్యు (ఆకాశము), పృథ్వి (భూమి) లగూర్చి చర్చించినపుడు అనంతమైన శక్తి అదితి గా ఋగ్వేదంలో తెల్పారు. దేవతలందరికీ ఈమెను తల్లిగా కీర్తించారు.

ఋగ్వేద ఋషులు ఈ విశ్వాన్ని 3 భాగాలుగా విభజించారు. 1. ద్యులోకం 2. అంతరిక్షలోకం 3. భూలోకం. సవిత్రి లేక సూర్యుడు

---

10 (Translation of Athrvana veda, Book iV, 16 Muir - orginal Sanskrit texts, vol V; page 64, fn)
Whate'er exists in heaven and earth, whate'er beyond the skies,
Before the eyes of Varuna, the king, unfolded iies
The ceaseless winkings all he counts of every mortal's eyes;
He wields this universal frame, as gamester throws his dice,
Those knotted nooses which thou fling'st, o god, the bad to snare,
All liars let them overtake, but all the truthful spare,
(Ancient India, R.C Majumdar, 1977, page- 62)

ద్యులోక దేవుడు. ఇంద్రుడు[11] లేక వాయుదేవుడు అంతరిక్ష లోకాధిపతి, అగ్ని భూలోక దేవుడు. మళ్ళీ ఈ దేవుళ్ళు ఒక్కొక్కలోకానికి పదకొండుమంది చొప్పున ముప్పైమూడు మంది దేవుళ్ళున్నారు. ఋగ్వేదంలోనూ, ఇతరవేదాలలోనూ ఈ ముప్పైముగ్గురు దేవుళ్ళ ప్రస్తావన కన్పిస్తుంది.

శతపథబ్రాహ్మణంలో, ''ఎనిమిదిమంది వసువులు, పన్నెండు మంది ఆదిత్యులు, పదకొండు మంది రుద్రులు, ద్యు(ఆకాశం), పృథ్వి (భూమి)'' లను పేర్కొన్నారు. ధర,ధ్రువ, సోమ, అప, అనిల, అనల, ప్రత్యూష, ప్రభాసలు, ఎనిమిది మంది వసువులు 'ధాత్రి, మిత్ర, అర్యమన్, రుద్ర, వరుణ, సూర్య, భగ, వైవస్వత, పూషన్, సవిత్రి, త్వష్ట్రి విష్ణు' వులు 12మంది ఆదిత్యులు, సంవత్సరంలోని 12 నెలలలో సూర్యునికిగల పేర్లే ఈ ఆదిత్యుల పేర్లని శతపథ బ్రాహ్మణం( xi 6.3.8) పేర్కొంటుంది. 11మందిరుద్రుల పేర్లు వేదాలలో పేర్కొనలేదు; కాని రామాయణం లోనూ తైత్తిరీయ అరణ్యకంలోనూ కొంతమంది రుద్రులపేర్లు ఉన్నాయి. ఋగ్వేదం (iii 9.9)కి వచ్చేసరికి ఈ ముప్పై ముగ్గురు దేవుళ్ళు మూడు వేల మూడువందల ముప్పైతొమ్మిది మంది దేవుళ్ళయ్యారు.

---

11 (Muir original Sanskrit text, vol V, page 135, From India's greatness)

Thou Indra, art without a peer,
On earth, or yonder heavenly sphere,
Thee, god, such matchless powers adorn,
That thou without a foe wast born,
Thou art the universal lord,
By gods revered, by men adored,
Should all the other gods conspire,
They could not frustrate they desire,
The circling years, which wear away,
All else, to thee bring no decay,
Thou bloomest on in youthful force,
While countless ages run their course,
Unvexed by cares, or fears, or strife,
In bliss serene flows on they life ( ibid- page-54 )



శాస్త్రీయ దృక్పథం

ఈ సందర్భంగా వ్యాఖ్యానం రాస్తూ భాష్యకారుడైన శాయనుడు మొదట్లోదేవుళ్ళు ముగ్గురేననీ, తరువాతి కాలంలో ముప్పై ముగ్గురి అద్భుతాల నుండి ఈ 3,339మంది దేవుళ్ళు ఉద్భవించారనీ సమర్థించచూశాడు. ఆ తరువాతి కాలంలో ఈ దేవతలు 33కోట్లమంది అయ్యారు. జీవితంలోనూ ప్రకృతిలోనూ ఎదురైన సమస్యలను భౌతిక, హేతువాద దృక్పథాలతో సమన్వయించుకోలేక ఎదురైన ప్రతిసమస్యకూ దేవుడనీ, దేవతనీ పేరు పెట్టి 33 కోట్ల దేవుళ్లను అభివృద్ధి చేసినఘనత వైదికులకే దక్కింది.[12]

వేదాలు వైదిక ధర్మాన్ని నిర్దేశించడమే కాక పితృస్వామిక వ్యవస్థను ప్రతిపాదించి వర్ణవ్యవస్థను రూపొందించాయి. ఋగ్వేదం పురుషసూక్తంలో వర్ణవ్యవస్థపునాదులు బలంగా వేశారు.

బ్రాహ్మణో అస్య ముఖమాసీద్. బాహూరాజన్యకృత:
ఊరూతదస్యయద్ వైశ: శూద్రో అజాయత ::

(విరాట్ పురుషుని ముఖము బ్రాహ్మణులాయెను. బాహువులు క్షత్రియులాయెను. ఊరువులు వైశ్యులాయెను. పాదములు శూద్రులాయెను.)

వైదిక సంస్కృతికి సంబంధించిన భావవాద పునాదులన్నీ వేదాల్లోనే ఉన్నాయి. వైదికార్యులు పాలకవర్గాలుగా రూపొంది భారతీయుల చార్వాకుల భౌతికవాద ఉద్యమాన్ని నిర్దాక్షిణ్యంగా, కర్కశంగా అణచి వేశారు.

## భౌతికవాద పునాదులు

వేదాలలో అస్పష్టంగా కొన్నిచోట్ల భౌతికవాద దృక్పథం కూడా గోచరించింది. ఋగ్వేదంలో నాసదీయ సూక్తంలో ఒక మంత్రంలో ఈ భావం కనిపిస్తుంది.

అప్పుడు భవమూ లేదు అభవమూలేదు. అంతరిక్షమూ లేదు దానికి అవతల ఆకాశములేదు దీనిసంతటినీ (ఆకాశాన్ని) ఎవరిలా కప్పారు?

---

12. ఆర్యులు, ఈదేశవాసులైన ద్రావిడులను ఎలానాశనం చేశారో ఈ రచయిత ఇతర రచనలు దళితుల చరిత్ర-1లో కులం పునాదులు చూడండి.

ఎక్కడినుండి వచ్చింది? ఎవరు దీన్ని రక్షిస్తున్నారు? మొదట్లో అందులో జలముండేదా? అప్పుడు మృత్యువులేదు, అమరత్వమూ లేదు ఏకాకియైన ఒకానొక స్వయంశక్తి మాత్రమే అప్పుడుంది. అది ఒక్కటే ఉంది. దానికి పైన ఇంకేమీ లేదు! అంతా అంధకారం, విశ్వమంతా నీటి ఆ నీటిలోని శూన్యప్రదేశంలో ఆ శక్తి దాగుకొని ఉంది. ఆ కోర్కె మనసుకు బీజం, మొదటగా కోర్కె జనించింది. అప్పుడు ఋషులు తమ హృదయాల్లో వెతుక్కున్నారు. అభవానికీ భవానికీ సంబంధాన్ని వెతుకుతున్నారు."

అప్పటికే వైదిక ఋషులు కొందరి మీద చార్వాకుల ప్రభావం పడుతూ ఉందనటానికి ఈ మంత్రం నిదర్శనం. చార్వాకుల ప్రభావం ఆర్యుల్లో కూడా కొందరిని ఆకర్షించడం ప్రారంభించాక చార్వాకసిద్ధాంతాన్ని ఖండించడమేకాక, భౌతికంగా వారిని హింసించి వధించడం కూడా చేశారు దీన్ని బట్టి చార్వాకుల ప్రభావాన్ని మనం అంచనా వేయవచ్చు.

పూర్వమీమాంసకుల మీద కూడా చార్వాకుల ప్రభావం ఉంది. వారు కూడా దేవుణ్ణిప్రశ్నించారు. దైవభావనని భావవాద దృక్పథంలోంచే అనేక కోణాల్లో నిలదీశారు. మానవుడు తన్నుతాను తెలుసుకునే క్రమంలో ప్రకృతిని పరిశీలిస్తూ తనకనుకూలంగా మలచుకుంటూ వచ్చాడు, ఈభౌతిక భావనని భావవాదం ఏ కాలంలోనూ జయించ లేక పోతూనే ఉంది

" Independent of philosophy, the nature exists by itself. It is the ground on which man, himself a product of nature, grows. Outside nature and man, there does not exist anything. The higher beings are the creation of our fantasy. They are merely the fantastic reflections of our own deing. "

లుడ్విక ఫ్యూయెర్ బాఖ్ సిద్ధాంతాన్ని వ్యాఖ్యానిస్తూ యమ్. యన్. రాయ్ భౌతికవాద తత్త్వశాస్త్ర భావనతో పాటి విజ్ఞానశాస్త్రం (Suence) అభివృద్ధి చెందిందని భౌతిక తాత్త్వికదృక్పథం లేని జాతులు చరిత్రలో వెనుకబడి ఉన్నాయని వాఖ్యానించాడు.

---

Ludnrig " The outcome of classical philosophy " Quoted in M.N.-Roy's "Materiaolism" page- 95 Penaissance publication, Dehara - Dun, U.P 1940

భారత దేశంలో భౌతిక తత్త్వశాస్త్ర నిర్మాతలైన చార్వాకుల ప్రభావం అన్ని భావవాదశాఖల మీద కూడా ప్రసరించింది.

భారత విజ్ఞానశాస్త్ర ప్రగతికి మూలమయ్యింది.

## ఉపనిషత్తులు

ఉపనిషత్తులు క్రీ॥పూ 700 సం॥ నుండి క్రీ॥పూ 100 సం॥ల వరకూ రచించబడ్డాయి. ఉపనిషత్ అంటే యోగ్యుడైన శిష్యుణ్ణి దగ్గర కూర్చుండబెట్టుకొని గురువు బోధించే రహస్యమైన జ్ఞానం అని అర్థం చెప్పారు. ఉపనిషత్తులు బ్రాహ్మణముల చివరి భాగములు, ఉత్తరభాగములుకూడా. ఐతరేయ, తైత్తిరీయోపనిషత్తులు ఐతరేయ తైత్తిరీయ బ్రాహ్మణముల అంతిమభాగములు. బృహదారణ్యకోపనిషత్తు కూడా శుక్ల యజుర్వేదమునకు చెందిన శతపథబ్రాహ్మణమునకు శేషము. బ్రాహ్మణములకు, ఉపనిషత్తులకు మధ్య ఆరణ్యకములు కొన్ని అధ్యాయములుగా ఉన్నాయి. తైత్తిరీయ, ఐతరేయ ఆరణ్యకములు ఈ కోవకు చెందినవే. వానప్రస్థాశ్రమమునకుచెందిన శిక్షణలు ఆరణ్యకములలో ఉన్నవి. ఉపనిషత్తులు 200 వరకుఉన్నట్లు చెపుతున్నారు. వాటిలో 108 మాత్రం ప్రసిద్ధంగా ఉన్నాయి.

అవి 1. ఈశావాస్యోపనిషత్తు 2. ఛాందోగ్యం 3. బృహదారణ్యకం 4. ఐతరేయం 5. తైత్తిరీయం 6. ప్రశ్న 7. కేన 8. కఠ 9. ముండక 10. మాండూక 11. కౌషీతకి 12. మైత్రి 13, శ్వేతాశ్వతర 14. బ్రహ్మ 15. కైవల్య 16. జాబాల 17. హంస 18. ఆరుణి 19 గర్భ 20. నారాయణ 21. (పరమ) హంస 22. (అమృత) బిందు 23. (అమృత) నాద 24. (అథర్వ) శిరాస్ 25. (అథర్వ) శిఖ 26. మైత్రాయణి 27. బృహజ్జాబాల 28. (నృసింహ) తాపనీ 29. కాలాగ్నిరుద్ర 30. మైత్రేయి 31. సుబాల 32. క్షురి(కా) 33. యంత్రికా 34. సర్వసార 35. నిరాలంబ 36. (శుక) రహస్య 37. వజ్రసూచికా 38. తేజో (బిందు) 39. నాద (బిందు) 40 ధ్యాన (బిందు) 41 (బ్రహ్మ)విద్యా 42 యోగతత్త్వ 43 ఆత్మప్రబోధ 44 (నారద) పరివ్రాజక 45 త్రిశిఖీ (బ్రాహ్మణ) 46 సీతా 47 (యోగ) చూడా (మణి) 48 నిర్వాణ 49 మండల (బ్రాహ్మణ) 50 దక్షిణా (మూర్తి) 51 శరభ 52 స్కంద 53 మహానారాయణ 54 అద్వయ(తారక) 55 (రామ)

రహస్య 56 రామతాపనీ 57 వాసుదేవ 58 ముద్గల 59 శాండిల్య 60 పైఙ్గల 61 భిక్షు 62 మహత్ 63 శారీరక 64 (యోగ)శిఖా 65 తురీయాతీత 66 సన్యాస 66 (పరమహంస) పరివ్రాజక 67 అక్షమాలికా 68 అవ్యక్త (వజ్ర) 69 ఏకాక్షర 70 (అన్న)పూర్ణ 71 సూర్య 72 అక్షి 73 అధ్యాత్మ 74 కుణ్డికా 75. సావిత్రి 76. ఆత్మ 77. పాశుపత 78. పరబ్రహ్మ 79. అవధూత 80. త్రిపురాతపన 81. దేవీ 82. త్రిపురా 83. కఠా (రుద్ర) 84. భావనా 85. హృదయ 86. (యోగ) కుణ్డలి (నీ) 87. భస్మ (జాబాల) 88. రుద్రాక్ష 89. గణ (పతి) 90. దర్శన 91. తారసార 92. మహావాక్య 93. పంచబ్రహ్మ 94. (ప్రాణ) అగ్నిహోత్ర 95. గోపాలతపన 96. కృష్ణ 97. యాజ్ఞవల్క్య 98. వరాహ 99. శాత్యాయనీ 100. హయగ్రీవ 101. దత్తాత్రేయ 102. గరుడ 103. కలి (సంతరణ) 104. జాబాలి 105. సౌభాగ్య 106. (సరస్వతి)రహస్య 107. (బహ్) వృచ 108. ముక్తికా. వీటిలో మొదటి 13 ఉపనిషత్తులు ప్రసిద్ధమైనవి.

ఉపనిషత్తుల్లో ఉన్న భావవాదాన్ని డా॥ బి. ఆర్. అంబేద్కర్ "ఫిలాసఫీ ఆఫ్ హిందూయిజం" లో వివరిస్తూ లాల్‌హరదయాళ్ అభిప్రాయాన్ని ఇలా తెలిపాడు,

"The upanishads claim to expound 'that, by knowing which evevything is known. This quest for 'the absolute' is the basis of all the spurious metaphysics of India. The treatises are full of absurred conceits, quaint fancies, and chaotic speculations. And we have not learned that they are worthless." 14

"ఉపనిషత్తులను తెలుసుకుంటే అన్ని తెలిసినట్లే అన్న భావాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. ద్వారానే భారతదేశంలో అది భౌతికవాదానికి పునాదిపడిందని ఆయన అన్నాడు. ఈ ఉపనిషత్తులనిండా అబద్దాలతో కూడిన తమఆధిక్యత, ఆకర్షించే ఊహలు, క్రమబద్ధంగాలేని ఊహాత్మక అంచనాలు ఉన్నాయని హరిదయాళ్ భావించాడు. ఈ ఉపనిషత్తులు 'ఉపయోగంలేనివి' అని మనం ఇంకా తెలిసుకోలేక పోతున్నాం 'అని హరిదయాళ్ అంటాడు

14 Philosodhy of Hinduism (vol-3) - Dr. B.R. Ambedkar writings and speeches, page-85
Published by Education department, Government of Maharastra"

వేదాంత తత్త్వబోధకు పట్టుకొమ్మలయిన ఈ ఉపనిషత్తులలో భౌతికవాదం కూడా కొన్ని చోట్ల కన్పిస్తుంది. వేదమత సిద్ధాంతాల తృప్తి చెందక ప్రకృతిని తెలుకోవడానికి చేసే ప్రయత్నంలో భాగంగా ఉపనిషత్ కర్తలు భౌతికవాద దృక్పథంతో కొన్ని ప్రశ్నలు వేశారు. భావ వాదంలో ఆ ప్రశ్నలకు సమాధానాలు దొరక్కపోవడం వల్ల వారు భౌతిక వాదాన్ని పూర్తిగా తిరస్కరించలేక పోయారు. ఒక ప్రక్క భౌతికవాదాన్ని ఒప్పుకుంటూనే మరో ప్రక్క భావవాదాన్ని ప్రచారం చేశారు.

ఛాందోగ్యోపనిషత్తులో "ప్రకృతికి అది ఏది? ఆకాశం అన్ని వస్తువులు అక్కడనుంచే బయలుదేరి తిరిగి అక్కడకే చేరుకుంటున్నవి. కాబట్టి వాటన్నింటికి స్థావరం ఆకాశం" "దేనినుంచైతే వివిధ నామాలు, స్వరూపాలు ఉద్భవిస్తున్నయో అదే ఆకాశం" అని ఉంది. ఈ సిద్ధాంతాన్ని బట్టి ఛాందోగ్యోపనిషత్తు శూన్యవాదాన్ని అంగీకరిస్తుంది. అదే ఉపనిషత్తు మరొక చోట పరమాత్మ ప్రతీ వస్తువుకీ మూలాధారం అని చెపుతుంది. అంటే జనిస్తున్న భౌతికవాద దృక్పథాన్ని భావవాదంతో కప్పివేయాలని ఉపనిషత్కారులు ప్రయత్నించి నట్లు తెలుస్తుంది.

శ్వేతాశ్వతరోపనిషత్తులో అగ (అగ్ని) ఒక్కటే అనాదివస్తువు తక్కిన వన్ని అందులోనించి ఉద్భవించినవే అనిచెప్పబడింది. ఈ అగ్నిని పరమాత్మమూలమని ఈ ఉపనిషత్తులో చెప్పబడలేదు. కాబట్టి పరమాత్మ కంటే మరొక మూలకారణముందని భావించబడింది. ఈ ప్రపంచానికి జడపదార్థమే కారణభూతంగా చూపబడింది. ఏదేమైనా ఉపనిషత్తుల్లో ప్రతి పాదింపబడిన భౌతికవాదానికి భావవాదాన్వయాన్ని చేయకలిగారు. భావవాద-భౌతికవాద చర్చ కొంతజరిగినా దీన్ని తత్త్వశాస్త్రంగా భావించడానికి వీలులేదు.

ఈ విషయాన్ని స్పష్టం చేస్తూ యమ్. యన్. రాయ్ తన సుప్రసిద్ధ గ్రంథం మెటీరియలిజం (Materialism) లో ఇలా వ్యాఖ్యానించాడు. "హిందూ తత్త్వశాస్త్రంలో వేదాంత తత్త్వవిచారం ప్రధాన భాగంగా ఎంచబడుతూ ఉంది, వేదసారమంతా ఇందులోనే వున్నట్లుగా భావించబడుతూఉంది. కాని వేద ప్రమాణంతో బయలుదేరిన ఈ తత్త్వవిచారాన్ని తత్త్వశాస్త్రంగా పరిగణించడానికి వీల్లేదు. యదార్థంగా ఆలోచిస్తే

ఇది ఆధ్యాత్మికవాదంలో ఉన్న తదశ అని చెప్పవచ్చు అందువల్ల ఇది మతసంబంధమైన పరిహద్దులను దాటి భౌతిక పొలిమేరలలో తిరుగుతుంది కాని యదార్థంగా ఇది భౌతిక వాదం కాదు. '[15]

ఈ ఉపనిషత్తుల్లో ఉన్న భౌతికవాద దృక్పథం ఆ తరువాత వచ్చిన దర్శనాల్లో మరింత పదును తేలింది.

## సాంఖ్య దర్శనము

సాంఖ్యం భారతీయ దర్శనాల్లో ప్రసిద్ధమైనది. ప్రాచీనమైనది. సాంఖ్యదర్శన నిర్మాత కపిలుడు. సాంఖ్యమును గురించి ఇప్పుడు మనకు లభ్యమవుతున్నవాటిలో ముఖ్యమైనవి ఈశ్వర కృష్ణవిరచిత సాంఖ్య కారికా భాష్యము. వాచస్పతి రచించిన తత్త్వకౌముది, విజ్ఞానభిక్షువు రాసిన సాంఖ్య ప్రవచన భాష్యము సాంఖ్యసారము ముఖ్యమైనవి.

## సాంఖ్యుల కాలం

గౌడపాదుడు 7వశతాబ్దివాడని, వాచస్పతి మిశ్రుడు 9వశతాబ్దివాడని తత్త్వశాస్త్ర పరిశీలకులు చెబుతున్నారు. క్రీ॥ శ॥ రెండవ శతాబ్దివాడైన అశ్వఘోషుడు తన బుద్ధచరిత్రలో సాంఖ్యంగూర్చి ప్రస్తావించాడు. కనిష్కుడి ఆస్థానంలోని మాధ్రాచార్యుడు తన శరినస్థానం అనేగ్రంథం లో ఈశ్వర కృష్ణగురించి 12 సార్లకుపైగా ప్రస్తావించారు. దీనిని బట్టి క్రీ॥ శ ఒకటవ శతాబ్దానికి ముందువాడిగా ఈశ్వర కృష్ణుణ్ణి పేర్కొనవచ్చు.

ఈ సాంఖ్యశాస్త్రానికి మూల పురుషులు కపిలుడు-అసురి, పంచశిఖ అని ఈశ్వర కృష్ణుడు తన కారికల్లో పేర్కొన్నాడు. ఈశ్వరకృష్ణునికి 26మంది గురుతరాలనుండి ఈ సాంఖ్యం బోధింపబడినట్లు చెప్పబడింది. ఒక్కొక్క గురువునుండి మరొకగురువు తరానికి ముప్పై సం॥లు అంతరంగా మనం పేర్కొంటే 780 సం॥ల అంతరం కపిలుడికి ఈశ్వరకృష్ణుడికి వుంది. దీనినిబట్టి కపిలుడు క్రీ॥ పూ 7, 8 శతాబ్దాలవాడై వుండవచ్చునేది చరిత్రకారుల అంచనా.

---

15. Materialism - M. N. Roy. page - 129.
Renaissance publication - 1840.

బుద్ధుడి మీద కూడా సాంఖ్య ప్రభావం ఉందనేది స్పష్టమైనది కాపున బుద్ధుడు క్రీ॥ పూ 6వ శతాబ్ది వాడనుకుంటే సాంఖ్య సిద్ధాంతం అప్పటికే ప్రాచుర్యం పొందివుంది కాబట్టి కనీసం రెండుశతాబ్దాల కాలమైనా వ్యత్యాసం వుంటుందనేది చరిత్రకారులు నిర్ధారిస్తున్నారు. దీనిని బట్టి కపిలుని సాంఖ్యశాస్త్రం క్రీ॥పూ 8వ శతాబ్దిదని మనం నిర్ధారణచేయవచ్చు

## సాంఖ్యుల భౌతిక సిద్ధాంతం

ఉపనిషత్తుల్లో వలెనే సాంఖ్యదర్శనంలో కూడా ప్రపంచానికి ఆది కారణాన్ని తెలిసికోవడానికి అన్వేషణ జరిగింది. ఆ అన్వేషణలో సాంఖ్యులు భౌతికసిద్ధాంతాలను కనుగొనగలిగారు. తద్వారా దేవుణ్ణి, ఆత్మవాదాన్ని బ్రహ్మవాదాన్ని తిరస్కరించారు. ప్రపంచానికి కారణం ప్రకృతినుండే గ్రహించగలమని సాంఖ్యులు వాదించి నిర్ధారణ చేయగలిగారు.

ఈశ్వర కృష్ణుని సాంఖ్యకారికల్లో ఈ విధంగా సిద్ధాంతీకరించివుంది.

శ్లో॥ సామన్యత స్తు దృష్టాత్ దతీంద్రియాణాం
ప్రతీతిరనుమానాత్
తస్మాదతి బాసిద్ధం పరోక్షమాప్తాగమాత్ సిద్ధం
(సాంఖ్యకారిక 6వ శ్లోకం)

సామాన్యంగా ప్రత్యక్ష ప్రమాణం ద్వారానే విషయములు తెలియును. ఇంద్రియములచే తెలియుబడని విషయము అనుమాన ప్రమాణం ద్వారా తెలియును. మిగిలిన విషయములు వివేచన ద్వారా తెలియును.

శ్లో॥ అతి దూరాత్ సామీప్యాత్, ఇంద్రియఘాతాత్
మనోనవస్తానాత్, సౌక్ష్మ్యత్ వ్యవధానాత్
అభిభవాత్ సమానాభిహారశ్చ (సాంఖ్యకారిక 7వ శ్లోకం)

ప్రకృతిని మనం తెలిసికొనలేకపోవడానికి కారణం

అతిదూరాత్ = అతిదూరంగా ఉన్న వలన
అతిసమీపాత్ = అతిదగ్గర ఉన్నను

ఇంద్రియఘాతాత్=ఇంద్రియములేక పోవుట వలన
మనోనవస్థానాత్=మనస్సు ఏకాగ్రంగా ఉండక పోవుటవలన
అతి సూక్ష్మాత్=అతి చిన్నదిగా ఉండటం వలన
వ్యవధానాత్=అంతరం ఉండటం వలన
అభిభవాత్=ఇంకొక దానిచే తిరస్కరింపబడుట చేతను
సమానాభిహారశ్చ=సమానములైన అనేకముల మధ్యలో
ఉండుట వలనను

తాత్పర్యము: అతి దూరంగా ఉండుటవలన, ఇంద్రియము లేక పోవుట వలన, మనస్సు నిలకడగా ఉండకపోవటం వలన, అతిసూక్ష్మం అవుట వలనను, అంతరం ఉండుటవలన, ఇంకొకదానిచే తిరస్కరింపబడుట వలన - సమానములైన అనేకములలో వుండుటవలన ప్రకృతిని మనము గుర్తింపలేకున్నాము.

శ్లో॥ సౌక్ష్మ్యాత్ తదనుపలబ్ధిః, నాభావాత్ కార్యతః తదుపలబ్ధిః
మహదాది తచ్చ కార్యం, ప్రకృతి సరూపం విరూపంచ
(సాంఖ్యకారిక 8వ శ్లోకం)

తాత్పర్యము: ప్రకృతి అనునది అతి సూక్ష్మమగుట వలన తెలియబడుటలేదు. ప్రకృతి అనునది కలది. అది లేకపోవుటలేదు. మహదాదులైన కార్యముల వలన ప్రకృతి ఉన్నదని తెలియుచున్నది.

శ్లో॥ అసద కరణాత్ ఉపాదాన, గ్రహణాత్ సర్వ సంభవాభావాత్
శక్తస్య శక్యకరణాత్, కారణభావాశ్చ సత్కార్యం
(సాంఖ్యకారిక 9వ శ్లోకం)

తాత్పర్యము: ప్రకృతి మహదాదులు అసత్ నుండి వచ్చినవని కొందరంటున్నారు. అది ఉచితం కాదు ఉన్నదాని వల్లనే ఏదైన వస్తుంది. లేనిదాని వలన ఏదీ రాదు. అట్లా గనుక వస్తుందని ఒప్పుకుంటే దేని నుండి ఏదైనా రావచ్చు. ఇదే రావాలని ఎక్కడఉంది. మట్టిని ఘటాన్ని సృష్టించే శక్తే ఉంటుంది కాని వస్త్రాన్ని సృష్టించే శక్తి ఎక్కడిది? కాబట్టి ప్రకృతి ఉన్నదాని నుంచే వచ్చింది కాని లేనిదాన్నుండి రాలేదు. అని సాంఖ్యులు భౌతిక సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

# శూన్యవాదాన్ని ఎదుర్కొన్న సాంఖ్యులు

సాంఖ్యులు భావవాదానికి సంబంధించిన అన్ని అశాస్త్రీయ ధోరణులకూ సమాధానం చెప్పారు. ప్రకృతికి భాష్యం చెప్పాలని ప్రయత్నించిన కొన్ని ఉపనిషత్తులు శూన్యవాదంలోనికి జారిపోయి నపుడు "భావం స్థిరమైతే భావానికి కారణభూతమైన భౌతిక ప్రపంచం కూడా స్థిరమని కపిలుడు వాదించాడు." ఈ విషయాన్ని ఎమ్.ఎన్.రాయ్ ఈ విధంగా విశ్లేషించారు.



"In their fight aganist the nihilists, the Sankhyas were driven very close to out and out materialism. In order to prove the reality of some existence, Kapila had to fall back upon the material world. The existence of thought by itself, or that of disembodied spirits, could not be proved to the satisfaction of the sceptics who expounded their nihilist doctrines as the logical deductions from the early spiritualist cult which was being set up in order to drug the victims of social chaos, so that thay might ignore the miseries of this world as bad dreams. Therefore, more tangible evidence for the reality of existence had to be produced. The rebels and revolutionaries of ancient India thus made the rise of a philosophy possible. In order to prove the existence of thought, Kapila, for example, had to refer the reality of thought to the reality of the external world. His highly materialistic theory of cognition was also developed under the powerful impact of nihilism."[16]



"శూన్యవాదాన్ని ఎదుర్కొవడానికి సాంఖ్య శాస్త్రజ్ఞులు పూర్తిగా భౌతికవాదాన్ని చేపట్టారు" అని విశ్లేషిస్తూ అంతకు ముందు సంఘంలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మిక వాదంలోని భావవాదాన్ని ఆధారంగా చేసుకొని తర్కబద్ధంగా అభివృద్ధి చెందిన శూన్యవాదాన్ని ఖండించడానికి సరైన ప్రమాణం చూపించాలి కాబట్టి భావం స్థిరమైతే భావానికి కారణ భూతమైన భౌతిక ప్రపంచం కూడా స్థిరమని కపిలుడు వాదించాడు. ఈ విధంగా శూన్యవాదం నుండి భౌతికవాదం బయలుదేరిందని ఎమ్.ఎన్. రాయ్ వ్యాఖ్యానించాడు.

16 Materialism– M. N. Roy. page-126-127

అని మనం చెప్పవచ్చు 'కపిల' అనే స్త్రీ నామం పురుషస్వామ్య వ్యవస్థ యొక్క ప్రభావం వలన కపిలుడిగా మారి వుండవచ్చును.

మాతృస్వామ్య వ్యవస్థ సరివ్యాప్తమై ఉన్న ప్రాంతాల్లోను, తాంత్రికవాదం ప్రచారంలో ఉన్న ప్రాంతాల్లో సాంఖ్యవాదం కూడా ప్రచారంలో వుండటం ఈ విషయాన్ని ఋజువు చేస్తుంది. ఈ అంశంపై వ్యాఖ్యానిస్తూ దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ తన లోకాయత గ్రంథంలో

"The suggestion will not appear wild if we remember that too little is positively known about Kapila to reject the possibility outright and; further, the original home of the Samkhya was presumably those areas of the country which were from a very remote antiquity, under strong influence of mother-right and the.Tantrika ideology The Samkhya could have been only a development of Tantrism and Tantrism originally knew only female preceptors[17]

దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ తంత్రవాదం గురువులు కూడా స్త్రీలే కాబట్టి సాంఖ్యానికి కూడా ఆద్యులు స్త్రీలేనని విశ్లేషించాడు.

చార్వాకుల దగ్గరనుండి సాంఖ్యుల వరకు భౌతికవాదాన్ని ప్రాచీన భారతీయ జాతుల వారే రూపొందించినట్లు మనకు అవగతమవుతుంది. ప్రాచీన భారతీయ తెగలు ఈనాటికీ ఆర్యేతరమైన సిద్ధాంతాలనే ఆహ్వానిస్తూవచ్చారు. ప్రాచీన భారతీయ తెగలకు మూలశక్తులైన 'కపిల' వంటి స్త్రీమాతలద్వారా ఈ సాంఖ్య సిద్ధాంతం తల్లిపాలలా శిష్యులకు ఆస్వాదనమై ఉండవచ్చు.

ఆ తరువాత ఆర్యులు దీని మూలసిద్ధాంతాన్ని దెబ్బకొట్టడానికి సాంఖ్యం వెనుకకు ఈశ్వరుణ్ణి తీసుకువచ్చి నిలబెట్టారు. చార్వాకుల్ని వారు నిందించి పూడుకున్నారు. కాని మిగిలిన భౌతికవాద సిద్ధాంతాలన్నింటిని భావవాదంలోనికి దిగజార్చడానికి తమశక్తిమేరకు ప్రయత్నించి కొన్నింటిలో సఫలీకృతులయ్యారు. ఉపనిషత్తుల్లో కొందరు ఆర్య ఋషులు భౌతికవాదానికి ప్రభావితమై చివరకు తమ వైదిక సిద్ధాంత పునాదులు కదిలిపోతాయని భావవాదంలోకి జారిపోయారు.

---

17 Lokayata–Deviprasad Chattopadhya Page-382 people's pubiishing house, 1968.

సాంఖ్యంలో చోటు చేసుకున్న 'పురుషుడు' కూడా పితృస్వామ్య వ్యవస్థ ప్రభావం వలన వచ్చి చేరినవాడే అనేది మనకు స్పష్టమౌతుంది. సాంఖ్యంలో ప్రవేశపెట్టిన పురుష వాదాన్ని ఆసరా చేసుకొని శంకరుడు దాన్ని భావవాదంలోకి అన్వయించాడు.

అయితే తంత్రవాదంలో ఉన్న 'పురుషుడు' ప్రకృతి ప్రభావం సాంఖ్యం మీద ప్రవర్తిల్లిందని దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ చెబుతున్నారు. వ్యవసాయ సంస్కృతి, మాతృస్వామ్య సంస్కృతి పునాదిగల్గిన తంత్ర వాదంలో ప్రకృతే పధానం. పురుషుడు ద్వితీయం చరక సంహితలో "సృష్టిలయలు లేవు చావుపుట్టుకలే" ఉన్నాయని వ్యాఖ్యానించబడింది. గౌడపాదుడు 'సాంఖ్యకారిక' వ్యాఖ్యానంలో ఏవిధంగానైతే స్త్రీ పురుష సంయోగం వలన శిశుజననం జరుగుతుందో అదేవిధంగా ప్రకృతి పురుష సంయోగం వలన విశ్వపరిణామం జరుగుతుందని వివరించారు.

ఈ విధంగా సాంఖ్యం ఏడువందల సంవత్సరాలు భారత సమాజాన్ని తన సిద్ధాంతాలతో ప్రభావం చేసింది. ఆర్యులు తమ రాజ్యాన్ని విస్తరణ చేసుకోవడం కోసం అనార్య జాతుల మీద దాడులు చేస్తున్న కాలం. అనార్య జాతుల సిద్ధాంతాలను కూడా మరొకప్రక్క నిర్వీర్యం చేయాలని భావవాదంతో కలుషితం చేయాలని ప్రయత్నించిన కాలం. ఈ దాడులను తట్టుకొని అవైదిక సిద్ధాంతాల కొనసాగింపుగా లోకాయుతుల తాంత్రికుల తరువాత సాంఖ్యులు ప్రకృతివాదాన్ని ముందుకు తీసుకు వెళ్లారు.

ఈ విధంగా సాంఖ్యుల భౌతికవాదం తత్త్వశాస్త్రంలో ఒక పెద్ద సంచలనం సృష్టించింది. సాంఖ్యుల తరువాత వచ్చిన భావవాద భౌతిక వాద ఉద్యమాల మీద సాంఖ్యుల సిద్ధాంత ప్రభావం స్పష్టంగా పడింది.

## బౌద్ధం-భౌతికదృక్పథం

రెండు సహస్రాబ్దాలు ఆసియా ఖండాన్ని తన బోధనలతో ముంచెత్తిన బుద్ధుని బోధనలపై సాంఖ్యుల భౌతికవాద ప్రభావం వుంది. బుద్ధుని చరిత్ర వ్రాసిన అశ్వఘోషుడు బుద్ధుడి మీద సాంఖ్యుల ప్రభావం

వుందని తెలిపాడు, బుద్ధుడు భౌతికవాదాన్ని సామాజికవాదంగా పరివర్తన చేయడానికి ప్రయత్నించాడు. విశ్వానికి కారణాన్ని వెదకడం నుండి జీవితానికి కారణాన్ని వెదకడం మీద దృష్టిని సారించాడు. దేవుడు, స్వర్గం, నరకం, ఆత్మ ఇవేమీలేవని చెప్పాడు. పుట్టుక, చావు, అనారోగ్యం. వృద్ధాప్యం మొదలగునవి దుఃఖాన్ని కలిగిస్తున్నాయి. ఒక వ్యక్తి ప్రేమకు దూరంగా వుండటం వలన కూడా దుఃఖం జనిస్తుందని బుద్ధుడు చెప్పాడు.

"తండ్రి. తల్లి, తమ్ముడు, కుమారుడు అందరి మరణాలు దుఃఖాన్ని కలిగిస్తున్నాయి. ఆస్తిని కోల్పోయినపుడు బంధువులను కోల్పోయినపుడు అనేక సందర్భాల్లో మీరు కార్చిన కన్నీరు నాలుగు సముద్రాల నీటి కంటే ఎక్కువని" బుద్ధుడు నుడివాడు.

ఈ దుఃఖ నివారణకు అన్వేషించమని బుద్ధుడు బోధించాడు. సంయుక్త నికాయంలో ఈ బోధనలు పేర్కొనబడ్డాయి.[17]

బుద్ధుడు నిరాకరించిన అంశాలను మనం పరిశీలిస్తే బుద్ధుడు భౌతికవాది అని ఋజువౌతుంది. డా॥ బి.ఆర్. అంబేద్కర్ తన పరిశోధనాత్మకమైన "Buddha and his Damma"లో బుద్ధుడు నిరాకరించిన అంశాలను ఇలా క్రోడీకరించాడు.

1. నేనెవ్వరు? ఎక్కడ నుండి వచ్చాను? ఏమౌతాననే మీమాంసలపై గల నమ్మకాలనన్నింటినీ త్రోసిపుచ్చాడు.
2. ఆత్మ అనే దానికొక రూపంకాని, స్పర్శా స్వభావం గాని లేనపుడది ఉన్నదనే వాదంపై గల నమ్మకాలన్నింటినీ నిరాకరించాడు.
3. అదిలేదు, ఇదిలేదు, ఏదీలేదనే నిరాశావాదాన్ని సైతం ఖండించాడు.
4. ఈ విశ్వసృష్టికేది మొదలన్న మీమాంసపై గల వాదాలన్నింటినీ విడనాడాడు.

---

17 Samyukta - Nikaya - quoted in Indian Athiesm by Debiprasad Chattopadhyaya — Page 96, 97.
People's publishing house - New Delhi - 1980.

5. సన్యాసులు వూహించి చెప్పిన వాదాలన్నింటినీ త్రోసిపుచ్చాడు.
6. దేవుడే మానవుణ్ణి సృష్టించాడనీ, బ్రహ్మశరీరం నుండే మానవుడు ద్భవించాడన్న దాన్ని ఖండించాడు.
7. ఆత్మ అనేది ఉన్నదని చెప్పలేదు. దానికెలాంటి ప్రాధాన్యతను ఇవ్వలేదు.[18]

దీనిలో ఆయన భౌతికవాద దృక్పథం మనకు స్పష్టమౌతుంది.

బుద్ధుడు మెదడుకు (బుద్ధికి) ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. ఆ విషయాన్ని అంబేద్కర్ ఇలా సూత్రీకరించాడు.

Mind precedes things, dominates them, creates them. If mind is comprehended all things are comprehended.

Mind is the leader of all its faculties. Mind is the chief of all its faculties. The very mind is made up of those faculties.

The first thing to attend to is the culture of the mind.[19]

మనం చేయబోయే ప్రతిచర్య మొదట మెదడుకు తెలుస్తుంది. అదే శాసిస్తుంది, అదే సృజిస్తుంది. మన పరిజ్ఞానం మెదడు యొక్క గ్రహణ శక్తిపై ఆధారపడి ఉంటుంది.

బుద్ధియొక్క నేతృత్వంలోనే మానవుడు సకల విద్యలు నేర్చుకొనగలుగుతున్నాడు. ఆ కారణంగా సకల జిజ్ఞాసలకు బుద్ధే అధినేత. ఈ జిజ్ఞాసల ద్వారానే బుద్ధి తయారవుతుంది.

బుద్ధిని పరిపక్వం చెయ్యటమే మొట్టమొదటగా మనం చేయవలసిన పని.

---

18 బుద్ధుడు - బౌద్ధధర్మము — రచన డా॥ బి.ఆర్. అంబేద్కర్ అనువాదం - యెండ్లూరి, పేజి 89,90.

19 The Buddha and his Dhamma - Dr. B.R. Ambedkar. Page 73 Bombay Siddarth Publication, 1974.

బుద్ధుని భౌతికవాద దృక్పథానికి పునాది ఇక్కడే ఉంది. బుద్ధుడు మానవుణ్ణి, అతని ఆలోచనని ప్రధానం చేశాడు. దాంతో అతీత శక్తులు మానవుణ్ణి నడిపిస్తున్నాయనే భావవాదాన్ని కార్యకారణ సంబంధంతో ఖండించాడు. బుద్ధుని హేతువాద దృక్పథం అతని తాత్త్విక విజయానికి తోడ్పడింది. అందుకే బౌద్ధం వైదిక మతం మీద ఒక తిరుగుబాటు ఉద్యమంగా ముందుకొచ్చింది.

" The spiritual revolt represented by the Indian materialists eventually culminated in the rise of Buddhism which all but liquidated the Vedic natural religion and freed India from Brahmanical domination for several hundered years. "[20]

వేదమతం మీద తిరుగుబాటు చివరకు బౌద్ధమతంగా పరిణమించి ఆ మతాన్ని నాశనం చేసి కొన్ని వందల సంవత్సరాల వరకూ భారత దేశాన్ని బ్రాహ్మణాధికారంనుంచి విముక్తి కలిగించిందని యం. యన్. రాయ్ చేసిన వ్యాఖ్యసముచితమైనది.

బుద్ధుడు దుఃఖాన్ని నివారించడానికి అష్టాంగమార్గాన్ని కనుగొన్నాడు. ఈ అష్టాంగమార్గాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చు

| | |
|---|---|
| 1. జ్ఞానం<br>ప్రజ్ఞ | సరైనదృష్టి-(దర్శనం)<br>సరైన సంకల్పం |
| 2. శీలం<br>సదాచారం | సరైన మాట<br>సరైన పని<br>సరైన జీవిక |
| 3. యోగం<br>సమాధి | సరైన ప్రయత్నం<br>సరైన స్మృతి<br>సరైన సమాధి |

బుద్ధుని సౌశీల్యమార్గము 10 విధానాలు :- 1. శీల 2. దాన 3. వుపేక్ష 4. నిష్కామ 5. వీర్య 6. కాంతి 7. సుఖ 8. అధితాన 9. కరుణ 10. మైత్రి

20 Moterialism– M. N. Roy page- 130.

శీలం అనగా నైతిక ప్రవర్తనని, నిష్కామ మనగా ప్రాప
చిక సుఖాల పట్ల వైముఖ్యం చూపటమని, వీర్య మనగా కృతనిశ్చ
తని నిర్వర్తించ దలచుకున్న సత్కార్యాన్ని ఎలాంటి పరిస్థితుల్లోన
వెనుకాడకుండా చేయడమే వీర్యమని; సహన ప్రవర్తనమే క్షాంతి అని
సుఛ అనగా సత్యవర్తనమని, అధితాన మనగా నీ ధ్యేయసాధన పట
స్థిర సంకల్పంతో కృషిచేయుటమని, మానవాళి పట్ల దయార్ద్రదృష్టితో
మెలగటం కరుణని, సాటి వారిపట్ల సౌహార్ద్రదృష్టితో మెలగడమే మైత్రి
అని ఈ సౌశీల్య విధానాలు ప్రతి ఒక్కరు శక్తి వంచన లేకుండా పాటి
చాలని బుద్ధుడు ప్రబోధించాడు.

బుద్ధుడు వ్యక్తి నిర్మలత్వానికి కూడా ప్రాధాన్యం ఇచ్చాడు
ఒక వ్యక్తినిర్మలత్వానికి దురాశ, వ్యామోహం, అజ్ఞానం, ప్రాణహాని
దొంగతనం వ్యభిచారం, అబద్ధమాడటం వంటి అవలక్షణాలు హానికరము
ఆయన ఉద్బోధించాడు.

బుద్ధుని సిద్ధాంతాలు అప్పటి వరకు వైదిక సంస్కృతి ఆచర
లోకి తీసుకు వచ్చిన మూఢనమ్మకాలను, యజ్ఞ యాగాదులను, వ్యక్తి
స్వార్థాన్ని, దుష్టవర్తనను ఖండించి నూతన సామాజిక దృక్పథాన్ని
ప్రబోధించాయి. బుద్ధుడు తన హేతువాద దృక్పథంతో మానవ మేధో సం
పత్తి కనుగుణంగా ఎలా నూతన సిద్ధాంతాన్ని రూపొందించాడో చెపుతూ
జస్టిస్ ఆర్. ఆర్. భోలె (Bhole) ఈ విధంగా వ్యాఖ్యానించాడు.

" What Buddha called the Dhamma differed fundamentally from what was called religion at that time. Buddha's Dhamma was based on doctorines which were rationally possible. in no other religion are the values of knowledge and evil of ignorance so much insisted upon as they are in Buddhism. His religion had the glory of having rightly judged the intrinsic greatness of man's capacity to work out his salvation without any extraneous aid, and of having perceived that far more of the world's misery is caused by stupidity and blind faith without any stress on knowledge. If the worth of a truly great man consists in his raising the worth of all mankind, who is better entitled to be called truly greater than the Blessed one?. "[21]

21 Justice R. R. Bhole's preface to Buddha and his Dhamma page-vi



చార్వాక దర్శనం

భౌతిక దృక్పథంతోపాటు నైతిక ప్రవర్తన, సంఘదృష్టిని మేళవించి బుద్ధుడు ప్రబోధించిన మహత్తరమైన సామాజిక బోధనలు పెక్కుమందిని చైతన్యవంతం చేశాయి. బుద్ధుడు క్రీ॥పూ 563 సం॥లో జన్మించి క్రీ॥పూ 485 లో నిర్యాణం చెందాడు. బుద్ధుని తరువాత బౌద్ధం శాఖోపశాఖలుగా చీలిపోయింది. బౌద్ధ నిర్యాణం తరువాత వంద సంవత్సరాలకు బౌద్ధ ధర్మం రెండు శాఖలుగా-స్థవిరవాదం, మహాసాంఘికంగా విడిపోయింది. ఆ తరువాత నూటపాతిక సంవత్సరాల్లోనూ మహాసాంఘికం ఆరు శాఖలుగానూ, స్థవిరవాదం 12 శాఖలుగా చీలిపోయింది. మొత్తం 18 నికాయాలయ్యాయి.•

ఆ తరువాత బౌద్ధంలో అనేక వాదాలు చోటుచేసుకున్నాయి. బౌద్ధం శక్తివంతంగా ఉన్నపుడు బ్రాహ్మణ, వైదికమతాలు కలుగుల్లో ఉన్న పాముల్లా దాక్కున్నాయి. బౌద్ధం శాఖోపశాఖలుగా విడిపోయి భావవాద ఛాయలు అనేకం దానిలో జారబడి శూన్యవాదం, పునర్జన్మవాదం కర్మవాదం అన్నీ దానిలోని వ్యాపించి దాని శక్తి నిర్వీర్యమయ్యాకే మళ్లీ బ్రాహ్మణ ఆధ్యాత్మికవాదం పడగ విప్పినాట్యం చేసింది.

చారిత్రికంగా పరిశీలించినట్లయితే బ్రాహ్మణ వ్యవస్థకు వ్యతిరేకంగా క్షత్రియులు బౌద్ధాన్నాశ్రయించారు. ఆ తరువాత శూద్ర అస్పృశ్యజాతులుగా నెట్టివేయబడిన ప్రాచీన భారతీయ ప్రజలు ఈ బౌద్ధాన్ని స్వీకరించారు. ఈ బౌద్ధాన్ని స్వీకరించినందుకు బ్రాహ్మణవాదులు వీరిపై మరింత కసితీర్చుకున్నారు అనేది చారిత్రక సత్యం. బ్రాహ్మణ రాజ్యాలు మళ్లీ పునరుద్భవించిన తరువాత కరుణమూర్తులు, అహింసా సిద్ధాంత పరులైన బౌద్ధుల్ని వారు 'కరకు కరవాలాలకు' ఎర చేశారు.

మౌర్యుల కాలంలో బౌద్ధ శిల్పం, సంస్కృతి, భారతదేశంలోనే కాక సింహళం, బర్మా, ఆగ్నేయాసియా దేశాలన్నింటికీ విస్తరించింది. భౌతికవాదంతో పాటు మానవతా వాదాన్ని ప్రబోధించిన బౌద్ధం భారతదేశంలో సామాజిక విప్లవం తేగలిగింది, నాగార్జునుని శూన్యవాదాన్ని ఆధారం చేసుకొని 'శంకరాచార్యుని' వంటి కుట్రదారులు 'ప్రచ్ఛన్న బౌద్ధులు'గా రూపొందిబౌద్ధాన్ని నిర్వీర్యం చేయడానికి ప్రయత్నించారు.

ఎవరెన్ని కుట్రలు చేసినా ఆసియాలో బౌద్ధఉద్యమం తీసుకు వచ్చిన సామాజిక విప్లవ ప్రభావం ఈనాటికీ అన్ని ఉద్యమాలమీద, వ్యవస్థల మీద ప్రగాఢంగా ఉందనడంలో అతిశయోక్తిలేదు.

## జైనం - నిరీశ్వరవాదం

వైదిక మత సంస్కృతిని ఎదిరించి నిలబడిన సిద్ధాంతాల్లో బౌద్ధం, జైనం ప్రసిద్ధమైనవి. జైనుల చివరి ప్రవక్త మహావీరుడు. ఇతడు బుద్ధుని సమకాలికుడు. ఈయన జైనాన్ని అభివృద్ధిచేసిన చివరి తీర్థంకరుడు. దీనినిబట్టి బౌద్ధం కంటే జైనం పురాతనమైంది.

జైనతత్త్వ సూత్రాలు :

జైన తత్త్వశాస్త్రం ఈ విశ్వంలోవున్న మొత్తాన్ని రెండుగా విభజించింది. ఒకటి జీవులు, రెండు నిర్జీవులు నిర్జీవుల్ని 5 రకాలుగా విభజించారు. కాలం, ఆకాశం (శూన్యం), పదార్థం, ధర్మము, అధర్మము. ఇవిగాక ఏడు రకాల తత్త్వాలను జైనం వ్యాఖ్యానించింది. 1. జీవం 2. నిర్జీవం 3. అస్రవం 4. బంధం 5. సంవరం 6. నిర్జీవం 7. మోక్షం వీటికి పుణ్యం-అపుణ్యం చేర్చి మరలా 9 చెప్పారు. మొదటి రెండు, ఇందులో దార్శనిక పదార్థాల్ని చెప్పారు. మిగిలిన ఏడు, తొమ్మిదిలలో ఆచార, వ్యవహారాలకు సంబంధించిన వాటినికూడా చేర్చారు.

జైనుల తర్కం :

జైనులు తమ తర్కం ద్వారా దేవుడు లేడని నిరూపించి భారతీయ తత్త్వశాస్త్ర ప్రమాణాల్ని పెంచారు. 'తర్కరహస్యదీపిక' వ్రాసిన గుణరత్నుడు 'షడ్దర్శన సముచ్ఛయం' వ్రాసిన హరిభద్రుడు ఈ విషయాన్ని స్పష్టంగా నిరూపించారు. హరిభద్రుడు క్రీ॥శ 8వ శతాబ్దానికి గుణరత్నుడు క్రీ॥శ 15వ శతాబ్దానికి చెందిన వారు. గుణరత్నుడు దైవ భావాన్ని ఖండిస్తూ వాదిస్తూ దైవభావాన్ని సమర్థించిన న్యాయ వైశేషిక దర్శనాలను తీవ్రంగా ఖండించాడు. భారతీయ ఆధ్యాత్మిక వాదానికి పట్టుకొమ్మలు రెండేరెండు ఒకటి వేదాంతవాదం రెండున్యాయ వైశేషిక దర్శనాలు తమ తర్కం ద్వారా దేవుడున్నాడని నిరూపించ

డానికి ప్రయత్నించాయి. వాటి తర్కాన్నె దుర్కొని దేవుడులేడని నిరూపించిన జైనులు భారత నాస్తికవాదానికి పట్టు కొమ్మలుగా నిలిచారు.

జైనుల 'వీతరాగస్తుతి'లో వారి సిద్ధాంతానికి సంబంధించిన ఒక వాదాన్ని మాధవాచార్యుడు సర్వదర్శన సంగ్రహంలో ఇలా వ్యాఖ్యానించారు.

" There is here no maker acting by his own free will, else his inufluence would extend to the making of a mat. What would be the use of yourself or all the artisans, if Iswara fabricates the three worlds? "[22]

'ఈశ్వరుడు త్రిలోకనిర్మాత' అనేవాదాన్ని, అభూత కల్పనను జైనులు తమ తర్కంతో ఎద్దేవాచేశారు.

జైనులు పదార్థవాదం :

బౌద్ధ దర్శనంలో "పుద్గల్" అనే పదానికి ఒక విశిష్టత ఉంది. రాహుల్ సాంకృత్యాయన్ 'పుద్గల్'పై పత్యేక వివరణ ఇచ్చాడు.

"బౌద్ధ దర్శనంలో జీవాన్ని పుద్గల్ అంటారు. దీనికి పూర్తి వ్యతిరేకమైన భౌతికతత్వాన్ని పుద్గల్ అంటారు జైనదర్శనంలో! పుద్గల్ కు స్పర్శ, రసం, వర్ణం - మూడు గుణాలు ఉంటాయి. ఈ పుద్గల్ రెండు రకాలు. ఒకటి సూక్ష్మ అణురూపం! ఇది యవన దార్శనికుడు డెమాక్రటస్ చెప్పిన పరమాణు సిద్ధాంతంనుంచి తీసుకున్నదే! కణాదుడు మొదలైన భారతీయ దార్శనికులు కనీస కృతజ్ఞతనైనా తెలుపకుండా డెమాక్రటస్ పరమాణు సిద్ధాంతాన్ని కొట్టేశారు - జైనదార్శనికుడూ అలాగే కొట్టేశాడు. రెండవది స్కంధ పుద్గల్. ఇది అనేకమైన పరమాణువు సంయోగంవల్ల ఏర్పడుతుంది. దీన్ని స్థూల భౌతికపదార్థం అనవచ్చును."[23]

---

22 Sarva- Darsana- Samgraha- Madhavacharya translated by E. B. Cowell M.A; and A. E. Gough pages Chowkamba Sanskrit Series office Varanasi–1978.

23 భారతీయ దర్శనం - రాహుల్ సాంకృత్యాయన్ పేజి 227
అనువాదం. ఆలూరి భుజంగరావు, గుడివాడ 1986.

వస్తులక్షణ వివేచనం :

వస్తులక్షణాన్ని గురించి బౌద్ధులు 'తత్వార్థ సూత్రములు' అనే గ్రంథంలో ఇలా వివరిచారు.

ఒక వస్తువును గూర్చి కాని, వస్తులక్షణమును గూర్చి కాని నిర్వహించు విధానములు ఏడు కలవు. వస్తువు కాని, వస్తుగుణము కాని యొక దృక్పథము నుండి (౧) ఉన్నది (౨) లేదు (౩) ఉండను నున్నది లేనులేదు (౪) అనిర్వచనీయము (౫) ఉన్నది కాని యనిర్వచనీయము (౬) నిర్వచనీయము ననిర్వచనీయము (౭) ఉన్నది, నిర్వచనీయము అనిర్వచనీయము.

౧ స్యాదస్తి : దాని యందలి పదార్థము, స్థలము, కాలము, స్వభావము. వీని దృక్పథములో వస్తువున్నది, స్వస్థితిలో నున్నది. ఒక పాత్రము మృణ్మయము నాగదిలో నిప్పుడొక రూపము కొలత గలిగియున్నది.

౨ స్యాత్‌నాస్తి : ఇంకొక వస్తు పదార్థ దేశకాల స్వభావ దృక్పథము నుండి ఒక వస్తువులేదు, అనగా నది లేని వస్తువు కాదు. నా గదిలోని పాత్ర లోహమయము కాదు, వేఱొకచోట లేదు, మరొక కాలమున లేదు, ఇంకొక రూపము కొలతను కలిగి యుండలేదు.

౩ స్యాదస్తి నాస్తి : పై చతుర్విధ లక్షణ దృక్పథము నుండి, ఇంకొక వస్తు దృక్పథము నుండియు ఒక వస్తువున్నదనియు లేదనియుఁ గూడఁ జెప్పవచ్చును. ఒక విధముగా ఒక దృష్టిలోఁ బాత్రమున్నది, మఱొక దృష్టిలో లేదు. ఒక వస్తువేదియో యేది కాదో చెప్పఁబడినది.

౪ స్యాదవక్తవ్యా : మూఁడవ దానిలో మనమొక వస్తువు తనకుఁదా నున్నదనియు నింకొక రీతిలో లేదనియుఁ జెప్పియున్నాము. కాని ఈ విధముగా నేక కాలమునే చెప్పుట సాధ్యము కాదు. అనగా నవక్తవ్యము. పాత్రమునందు, తన స్వభావము, తన స్వభావ విరుద్ధాభావము నొకే కాలమునందున్నను, నట్లు చెప్పుట సాధ్యముకాదు.

౫ స్యాదస్త అవక్తవ్యా : ఒక వస్తువుయొక్క చతుర్విధ లక్షణ దృక్పథము నుండియు, నాకాలముననే, ఆ వస్తువు యొక్కయు, ఆ వస్తువు కాని దాని యొక్కయు సమ్మిళిత దృక్పథముల నుండియు, ఒక

అవక్తవ్యము. ఇచట వస్తువు యొక్క స్థితి, అనిర్వచనీయత్వము రెండు నున్నవి.

౬ స్యాన్నాస్త్యవక్తవ్యః: తానుగాని వస్తు చతుర్విధ లక్షణ దృక్పథము నుండియు, నా కాలముననే, తనయుక్కయుఁ దానుగాని దాని యొక్కయు నుభయ దృక్పథములనుండియు నొక వస్తువు లేదు, అవక్తవ్యము. ఇచట వస్తువుయొక్క అభావము, తదవక్తవ్యము చెప్పఁబడినది.

౭ స్యాదస్తి నాస్తి అవక్తవ్యః: ఒక వస్తువు చతుర్విధ గుణదృక్పథము నుండియు, నది కాని దాని దృక్పథము నుండియు, నొకే క్షణమందు, ఉభయ దృక్పథములనుండియు నొకే వస్తువున్నదనియు, లేదనియు, నవక్తవ్యమనియుఁ జెప్పఁబడినది. ఇచట నొక వస్తుస్వరూప మవక్తవ్యమనియుఁ దాని స్వరూపము, అది. కానిది (తత్త్వార్థ సూత్రములు ౧౫, ౧౬) చెప్పబడెను.[24]

జైనుల వస్తు తత్వంలో భౌతిక దృక్పథమే కనిపించుచున్నది. జైనులతర్కం, వివేచన, ఆచరణ వైదిక భావజాలం మీద తీవ్రమైన తిరుగుబాటును తీసుకొచ్చాయి. అందుకే వైదికులు వీరిని అనాగరికులని పాషండులని నిందించారు.

జైనులు దిగంబరులుగా, శ్వేతాంబరులుగా రెండు శాఖలుగా ప్రవర్తిల్లారు. అహింస, నిరీశ్వరవాదం, తర్కంతో వీరు వైదిక సంస్కృతీ పునాదుల్ని కుదిపివేశారు. జైనులు నాలుగు వర్గాలుగా ముందు కొచ్చారు. సన్యాసులుగా, సన్యాసినులుగా, గృహస్థులుగా గృహిణులుగా వారు జీవించారు. వ్యాపారకులాలవారు ఈ మతాన్ని స్వీకరించారు. 'బ్రాహ్మణాధికారాన్ని వీరు నిర్ద్వంధంగా వ్యతిరేకించ కానికే జైనాన్ని' స్వీకరించారు.

---

24 భారతీయ తత్త్వశాస్త్రము - సర్వేపల్లి రాధాకృష్ణన్ (పేజి 37-38)
(ద్వితీయ భాగము)
అనువాదం - బులుసు వేంకటేశ్వర్లు
టి.టి.డి. పబ్లికేషన్స్, తిరుపతి 1985.

జైనులు ఈనాటికీ భారతదేశంలో తమ ఉనికిని నిలుపుకో గలుగుతున్నారు. బ్రాహ్మణరాజుల కరకు కరవాలం బౌద్ధులను తుదముట్టించినంతగా, జైనులను తుదముట్టించలేకపోయింది.

నాస్తిక దర్శనాల్లో ప్రధానమైన జైనం అవైదిక సిద్ధాంతాలకు ఆలోచనలకు ఈనాటికీ పట్టుగొమ్మగానే ఉంది.

## ఎందరో భౌతికవాద దార్శనికులు

క్రీ॥ పూ॥ 8వ శతాబ్దం నుండి క్రీ॥పూ॥ 1వ శతాబ్దం వరకు ఎందరో భౌతికవాద దార్శనికులు భారతదేశంలో ఉద్భవించారు. అయితే వారి సమగ్ర సమాచారం మనకందడంలేదు. వైదికులే వారి సిద్ధాంతాలను ధ్వంసం చేసివుండవచ్చు. ఈ యుగం ప్రపంచం మొత్తంలోనూ తాత్త్వికయుగంగా ముందుకొచ్చింది. భారతదేశంలోకూడా క్రీ॥ పూ॥ 1500 నుండి 1300 వరకు భరద్వాజుడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు ఋగ్వేదంలో తమ కవితలందించారు. ఆ తరువాత సుమారు 500 సం॥ల యజ్ఞయాగాదులు, కర్మకాండలతో తాత్త్విక ఆలోచన స్తంభించి పోయింది. ఉపనిషత్ ఋషులలో జైవలి, అరుణి, యాజ్ఞవల్క్యుడు వంటి వారు కొంత ఆలోచనను లేవనెత్తారు. భారత దేశానికి నిజమైన తత్త్వశాస్త్రాన్ని చార్వాకులు అందించారు. వారి సిద్ధాంతప్రభావం అనేక మంది తత్త్వవేత్తలపై పడింది. తాంత్రికులు, జైనులు, బౌద్ధులు, సాంఖ్యులు మొదలైన వారిపైనే గాక స్వతంత్ర్యమైన ఎందరో భౌతికవాద తత్త్వవేత్తలు వీరికాలంలో ముందుకొచ్చారు.

వీరిలో అసితకేశ కంబళ్, మక్కలి గోశాల్ మొదలైనవారు ప్రసిద్ధులు.

అసితకేశ కంబళి :

అసితకేశ కంబళ్ అనడంతో "నల్లని వెంట్రుకలతో నేసిన కంబళి కప్పుకున్నవాడైన" ఇతడు అవైదికుడే కాక దళితుడై ఉండ వచ్చు. అప్పటికే ఇతని పేరు ప్రఖ్యాతులు జనావాసాలుదాటి రాజ

ప్రసాదాల్లోకి పాకాయి. ఇతడు బుద్ధునికంటే కూడా పూర్వుడు అనడానికి మనకొక ఆధారం ఉంది. కోసల రాజైన ప్రసేన జిత్తుడు బుద్ధుడితో ఒక సారి ఇలా అన్నాడు. "ప్రజలచేత సన్మానితులైన ధార్మికులు పూర్ణకాశ్యపుడు, మక్కలి గోశాలుడు. నిగంఠ నాతపుత్త, ప్రకృధ కాత్యాయన్ అసితకేశ కంబళి వంటి వారినిమీరు అసత్యమైన పరమజ్ఞానాన్ని పొందారా అని అడిగితే లేదు అని సమాధానం చెప్తున్నారు. మరింత చిన్నవాడివి నీవు. సంపూర్ణ జ్ఞానాన్ని పొందడం ఎలాసాధ్యం.' దీన్ని బట్టి అప్పటికే ఈ భౌతికవాద తత్త్వవేత్తలు ప్రచారంలో ఉన్నారు. ఇతడు క్రీ॥ పూ 523 సం'' లలో జీవించియుండవచ్చునని ఒక అంచనా అజిత కేశకంబళుడు మానవుడు నాలుగు భూతాలతో రూపొందుతాడని చెప్పాడు పరలోకం కోసం చేసే దానం, పుణ్యం వ్యర్థం అన్నాడు. ఆస్తికవాదం అబద్దం అని చెప్పాడు. అసితకేశకంబళుడు 'తలితండ్రులే లేరన్నాడని' ఆస్తికవాదులు దుష్ప్రచారం చేశారు. బౌద్ధుల త్రిపిటకాల్లో ఈయన ప్రస్తావన చాలా సార్లు వచ్చింది ఈయన బోధనలు చాలా చోట్ల ఉటంకించబడ్డాయి. అసితకేశకంబళుడు ఆర్యుల చేత అణగద్రొక్కబడిన జాతుల నుండి వచ్చి, ఆర్యుల నెదిరించి వారి సిద్ధాంతాలను ఖండించి భౌతిక వాదాన్ని ప్రబోధించాడు.

## మక్కలి గోశాలుడు

మక్కలి గోశాలుడు కూడు అనార్య జాతులకు సంబధించినవాడే' మక్కలి గోశాలుడంటే 'పాళి' భాషలో 'పశువుల కొట్టంలో పుట్టినవాడని. అర్థం. కాబట్టి ఇతడు గ్రామిక జాతుల నుండి వచ్చినవాడని తెలుస్తుంది. వైదిక సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడిన తాత్త్వికుడితడు. బౌద్ధ.జైన పిటకాల్లో అనేకసందర్భాల్లో మక్కలిగోశాలను ప్రస్తావించడం ఇతని ప్రాశస్త్యాన్ని తెలుపుతుంది. మీ పుణ్యపాపకర్మలవల్ల, పూజాపునస్కారాల వల్ల మార్పేమీజరగదని ఆర్యుల కర్మకాండను నిరసించాడు. మక్కలి గోశాల మీద ఆర్యులు చేసిన దుష్ప్రచారం వల్ల ఆరోజుల్లో ఈ తాత్త్వికుడు చేసిన తిరుగుబాటును గుర్తెరగవచ్చు. బ్రాహ్మణ దేవతల విగ్రహాలమీద మూత్రించిపోసేవాడని, అతనిమీద దుష్ప్రచారంచేశారు. దీన్ని బట్టి ఆయన విగ్రహారాధనను వ్యతిరేకించాడని అర్థం చేసుకోవచ్చు. జైనులు కూడా

మక్కలిగోశాలుడు 'జైన తీర్థంకరుడైన మహావీరుణ్ణి చంపాలనీ ప్రయత్నించాడని' దుష్ప్రచారం చేశారు. జైనులు గోశాలుణ్ణి నీచుడనీ, ఈర్ష్యాళుడనీ దర్మాంధుడనీ వ్యాఖ్యానించారు.

ఈయన బోధించిన భౌతిక వాద సూత్రాలు స్పష్టంగా మనకు లభించడంలేదు. భౌతికవాద సిద్ధాంతాల్ని కలుషితం చేయడంలో వారిమీద బురద చల్లడంలో అద్వితీయులైన వైదికులు వారి మూలగ్రంథాలను నాశనం చేసి వాస్తవ రూపాన్ని కనిపించనీయకుండా గజిబిజి చేశారు. మక్కలిగోశాలుడి గురించి బుద్ధఘోషుడు ఒక వృత్తాంతాన్ని చెప్పాడు, 'మక్కలి గోశాలుడు ఒక బానిసని, నూనెతో నిండిన బానను తలమీద పెట్టుకొని మోస్తుండగా యజమాని గదమాయింపుతో తొట్రుపడి దాన్ని కింద పడేశాడని, అందుకు ప్రతిఫలంగా యజమానివిధించే శిక్షకు భయపడి పారిపోయాడనీ, అతన్ని పట్టుకొనే ప్రయత్నంలో యజమానికి మక్కలిగోశాలుడి బట్టలు మాత్రమే దొరికాయని, అదే పరుగున తప్పించుకు పోయిన మక్కలిగోశాలుడు నగ్నంగానే అప్పటినుంచి సంచరించాడని "ఈ వృత్తాంతంలో ఉంది. మక్కలిగోశాలుడు బానిస యజమానిపై తిరుగుబాటుచేసిన బానిస వీరుడని ఈ కథ ద్వారా అర్థమవుతుంది.

మక్కలిగోశాలుని నియతి వాదం :

మక్కలిగోశాలుని సిద్ధాంతాన్ని "నియతివాదం" అని అంటారు. దీని ప్రకారం ఏది జరగాలనుంటే అదే జరుగుతుంది. అదే విధంగా జరగకూడనిది జరగదు కాబట్టి మానవప్రయత్నం అనేది నిష్ఫలమైనది. అంటే మానవుడి ప్రమేయం లేకుండానే ప్రాపంచిక ఘటనలు సంభవించడమో, సంభవించకపోవడమో జరుగుతుందన్నమాట.

భౌతిక ప్రపంచాన్ని పరస్పరవిరుద్ధమైన శాశ్వతమైన ఆరుతత్త్వాకులుగా మక్కలిగోశాలుడు వర్గీకరించాడు. ఇవి 1)లాభం 2)నష్టం 3)సంతోషం 4) భావం 5) ప్రాణం 6) మరణం.

ప్రాణం గల ప్రతిజీవి, నియతి సూత్రానికి లోబడి పైన వివరించబడ్డ ఆరు అస్థిత్వ రూపాల్లో, సుఖదుఃఖాల అనుభవాన్ని పొందుతుందని మక్కలిగోశాల వివరించాడు ఈ విధంగా బలవంతుడు, బలహీనుడు,

వివేకి, మూర్ఖుడు. సాహసి 'భీరువుతో సహఅందరి అస్తిత్వం వారివారిస్వభావ' సామర్థ్యాల మీద కాక "నియతి" మీద మాత్రమే ఆధారపడి ఉంటుందని మక్కలిగోశాల ప్రకటించిన సిద్ధాంతసారం.

ఈ విధంగా మక్కలి గోశాలుడు బానిస వ్యవస్థకు వ్యతిరేకంగా ఆర్యుల ఆధ్యాత్మిక వ్యవస్థకు వ్యతిరేకంగా భౌతిక వాదాన్ని ముందుకు తీసుకువెళ్ళటంలో అద్వితీయమైన పాత్రవహించాడు. ప్రత్యర్థుల నిందాపూర్వకమైన అంశాల నుండే వీరిచరిత్రను మనం క్రోడీకరించుకోవాల్సిన ఆవశ్యకత ఏర్పడ్డంతో వారి తిరుగుబాటు రూపాలు మసకమసగ్గానే కాని స్పష్టంగా గోచరమవ్వడంలేదు. మక్కలి గోశాలుడి కాలం క్రీ॥పూ 523సం॥ గాచరిత్ర కారులు భావిస్తున్నారు.

## పూర్ణకాశ్యపుడు

ఇతడు కూడా బుద్ధుని సమకాలీన తత్త్వవేత్త అక్రియతావాదిగా ఇతన్ని పేర్కొన్నారు. పూర్ణకాశ్యపుడు కూడా బానిస తిరుగుబాటుదారుడే. పూర్ణకాశ్యపుడు మొదట బానిసని, అతని యజమాని ఆధీనంలో ఉన్న బానిసల సంఖ్య అతనితో నూరయ్యిందనీ, అందుకే అతనికి పూర్ణ అనేపేరు సంక్రమించిందని బౌద్ధ తత్త్వవేత్త బుద్ధఘోషుడు చెప్పాడు. ఇతన్ని కూడా దిగంబరుడనే అన్నారు. ఆనాటికి బానిసవ్యవస్థను ఆర్యులు నెలకొల్పుతున్నారని. ఆనాటి బానిసవ్యవస్థ మీద తిరుగుబాటు చేసిన నాయకులు అనాది భారతీయ తెగలవారని, వీరు బానిసయుజమానులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసేక్రమంలో భౌతిక సిద్ధాంతాలను ప్రబోధించారని మనకర్థం అవుతుంది. పూర్ణకాశ్యపుడు యజ్ఞాలు యాగాలు కర్మకాండలు అసంబద్ధమైనవని చెప్పాడు. పూర్ణకాశ్యపుడి అక్రియవాదం ద్వారా 'దోపిడీ,వ్యభిచారం, ఖూనీలు, చెయ్యటం నేరం కాదని ప్రచారం చేశాడని' ఈయన ప్రత్యర్థులు ఈయన మీద బురద జల్లారు. పూర్ణకాశ్యపుడు దుఃఖంతో నిరాశతో చివరికి ఒక చెరువులో దూకి ఆత్మహత్య చేసుకున్నాడని ఆయన మీద కథలల్లిప్రచారం చేశారు.

వేదాంత తత్త్వానికి పునాది అయిన తపస్సును, యజ్ఞాలను పాపపుణ్యాలను కర్మసిద్ధాంతాలను పైన పూర్ణ కాశ్యపుడు ఎదిరించి బానిస యజమానుల తిరుగుబాటు చేసి చరిత్రను సృష్టించుకున్నాడు.

## ప్రకృధ కాత్యాయనుడు

ప్రకృధ కాత్యాయనుడు నిత్యపదార్థవాదిగా ప్రసిద్ధికెక్కాడు. ఈతడుకూడా బుద్ధుని సమకాలికుడే. ఇతడు ప్రకృతి అచంచలమైనదనీ, నిత్యమనీ అంటాడు. ప్రకృతినెవరూ సృజించలేదనీ, ఎవరిచేతా నిర్మింపబడింది కాదనీ, ప్రకృతి స్వయంసిద్ధం అని చెప్పాడు. ప్రకృతి 7 తత్వాలుగా ఉందని, అవి పృధ్వీతత్వం. జలతత్వం. అగ్నితత్వం. వాయుతత్వం, సుఖం, దుఃఖం, జీవితం అనే ఈ ఏడుతత్వాలూ ఒకదానికొకటి హాని చేసుకోవు, ఒకదాని కొకటి కారణంకావు అని బోధించాడు.

ఇతడొక కొత్తఅంశాన్ని కూడా ప్రతిపాదించాడు. లోకాయతులు చెప్పిన పృధ్వీ, జలం, అగ్ని, వాయువుతో పాటు జీవితం, సుఖం, దుఃఖం. ఈమూడింటిని కూడా ప్రత్యేకమైనతత్వాలుగా చెప్పాడు. ఈ తత్వాలకు మధ్య ఖాళీప్రదేశం ఎక్కువగా ఉంటుందనీ అందువల్ల మనం ఎంతగట్టి దెబ్బకొట్టినా అది ఖాళీప్రదేశంలోనే తగులుతుందని మూలతత్వానికితగలదని ఇతడు చెపుతున్నాడు.

పరమాణువాదానికి ప్రాధమికమైన ఆలోచన ఇది. మనంచూస్తున్న భౌతికాంశాలలో సూక్ష్మాతిసూక్ష్మ అంశాలు ఉన్నవనీ, ఆ సూక్ష్మమే ఆకాశంగా మనకు భాసిస్తుందని పదార్ధవాదుల ఒకవాదం. అయితే ఇతడు ఆకాశాన్ని ప్రత్యేక పదార్ధంగా భావించడంలేదు. సుఖదుఃఖాలను ప్రత్యేక పదార్ధలుగా భావిస్తున్నాడు. ప్రకృధకాత్యాయనుడు వేదాంతుల కర్మవాదాన్ని ఖండిస్తూ తనవాదాన్ని బలపరచుకోవడానికి ఒక ఉదాహరణ చెప్పాడు. ఎవరైనా తన ప్రత్యర్థితలను వాడిగల కత్తితో ఒక్కవేటుతో నరికాడంటే అతనిని హత్యచేసినట్లు లెక్కింవబడదు. నిజానికి కత్తి అవ్యక్తి భౌతిక శరీరానికి, మూలాధారమైన ఏడు మూలధాతువులు మధ్యనుంచి దూసుకుపోయిందన్నమాట. కాబట్టి చంపేవాడు, చచ్చేవాడు, చెప్పేవాడు వినేవాడు, బోధించేవాడు, గ్రహించేవాడు అనేవాళ్ళెవరూ లేరు. ప్రకృధ కాత్యాయనుడి ఈ వివరణను బట్టి అతడు కర్మవాదాన్ని బలంగా వ్యతిరేకించాడని అర్థం అవుతుంది.

భౌతికవాద మూలకాలనుసరిగానే గుర్తించిన ప్రకృధకాత్యాయనుడు దాని చలనాన్ని గుర్తించక పోవడంవల్లయాంత్రిక భౌతికవాదాన్నే

ప్రవచించగలిగాడనేది మనకు సుబోధం అవుతుంది. బుద్ధఘోషుడి సుమంగళ విలాసినిలోనే కాక మరో బౌద్ధగ్రంధమైన "మధ్యమనికాయ"లో కూడా ఈతాత్త్వికుని ప్రస్తావన ఉండటం ఈదార్శనికుని చారిత్రక ప్రశస్తి మనకు తెలుపుతుంది.

## సంజయుంవేలట్టి పుత్ర

సంజయ వేలట్టిపుత్రుడు తీర్థంకరుడని అగ్నేయవాడియని వర్ణింపబడింది. సంజయుడు 'వేలట్టి' అనే గణానికి చెందినవాడని తెలుస్తుంది. అతని ముఖ్యశిష్యులలో సుప్రియుడు కోడా ఒకడు. గ్రీకుదేశ సంశయవాదియగు ''పిర్రో'' ఇతని దగ్గర భారతీయ దర్శనాన్ని అధ్యయనం చేసినట్లు తెలుస్తుంది.

సంజయుని సిద్ధాంతం దర్శనాల్లో ఇలా వివరించబడింది. 'ఉన్నది ఉన్నట్లు కుశలమేమో, అకుశలమేమో ఎరుగము. కాబట్టి ఇదమిత్థముగా వీటిని గూర్చి చెప్పుట గర్వము చేతనో, అహంకారము చేతనో (చందో వారాగోవా అని మూలము). లేదా దుర్బుద్ధివలననో, ఓర్మిలేకనో (దొసో వా పతిఘో వా) అగును. అటు చేసినచో చెప్పినది మృషావాదన మని తేలిన దుఃఖకోపములో, లేదా తప్పైననూ చెప్పిన దానినే అంటిపెట్టుకొని యుండుటో (ఉపాదానము) జరిగి శాంతి ఉండదు. కొందరు తెలివిగలవారు, సమర్థులు తార్కికులు ఇతరుల దృష్టులను (విశ్వాసములను, సిద్ధాంతములను) ఖండిచుచుందురుమాకంత తెలివి లేదుగాన కుశలాకుశలములను గూర్చి మేము నిశ్చితముగఏదైనా చెప్పినచో వారు దానికి కారణములు అడుగవచ్చును. మా దోషములు చూపవచ్చును. దాని వలన మాకు దుఃఖఅశాంతులు కలుగవచ్చును.

మాచే చెప్పబడిన అభిప్రాయము తప్పని రుజువగుట. ఉపాదానము కలిగివుండుట వాదనచేయుట అనినమాకు భయము, అనిష్టము. కాబట్టి దేనిని కూడ మేము మంచి అనము. చెడు అనము. ఎవరైన మమ్ములను ప్రశ్నించినచో ఇట్లు అనికాని అట్లు అనికాని అన్యథాగాని కాదు అందుము. ఇది కాదనియు అనము. ఇదియుకాదు అదియుకాదనియు అనము. ఇదియును అవును అదియును అవును అనికూడ అనము

వరలోకమును గూర్చిగాని. దేవతలను గూర్చి గాని కర్మను గూర్చిగాని తథాగతులు మరణానంతరము ఏ మగుదురు? "అనుదానిని గూర్చిగాని ఎటులను చెప్పము". సంజయుని సందేహవాదము పై విధముగ బౌద్ధ గ్రంథములందు వర్ణించబడింది. 25

అవైదిక దర్శనకారుల్లో 'సంజయవేలట్టిపుత్త' కూడా ప్రసిద్ధుడే వీరిపై చార్వాకుల ప్రభావం ఉంది. భావవాదుల కర్మవాదం మీద వీరు తిరుగులేని యుద్ధం చేశారు. వైదిక ఋషుల ఆత్మవాదం మీద యుద్ధం చేసి గజగజలాడించారు.

## పాయసి

బుద్ధుని కాలంలో రాజుల్లో చాలామంది భౌతికవాదాన్ని ప్రవచించే వాళ్లుఉండేవారు- సాలవికానగరంలో లౌహిత్యుడను బ్రాహ్మణ సామంత రాజు వుండేవాడు. అతడు ఇలా ప్రవచించాడు. 'సరియైన మంచి ధర్మ మును తెలిసికొని ఇతరులకు చెప్పు శ్రవణుడు కాని, బ్రాహ్మణుడుకాని ఈ జగత్తులో లేడు. ఒకడు ఇంకొకనికేమి ఉపకారంచేయును. ప్రతి కొత్త ధర్మము, పాతబంధనమును త్రెంపి క్రొత్త బంధమును కట్టుటయే. ప్రతిది పాపలోభముల మూలుమే. దిఘనికాయంలో చెప్పబడిన ఈ సూత్రాల వలన కొందరు బ్రాహ్మణ రాజులు కూడా బుద్ధుని సూత్రాల కు ప్రభావితులయ్యారని తెలుస్తుంది.

ఆ కాలంలోనే పాయసి అనే రాజు "ఇహములేదు, పరములేదు జీవు లు చచ్చిన తిరిగి పుట్టరు. మంచి చెడుకర్మలకు ఫలముండదు'' అని బోధించాడు. దానికి పాయసి చెప్పిన కారణాలివి.

1) చచ్చిన వాడెవడు తిరిగి వచ్చి పరలోకమున్నదని చెప్పలేదు.

2) ధర్మాత్ములు ఆస్థికులు చావంటే భయపడుతున్నారు. నిజంగా మోక్షం ఉన్నదని నమ్మితే వారెందుకు భయపడుతున్నారు.

3 చనిపోయిన శరీరముల నుండి జీవం వెళ్ళినట్లు గుర్తేది.

దేహము జీవము వేరుకాదని పాయసి సిద్ధాంతీకరించాడు.

బుద్ధుని సమకాలంలో భౌతికదృక్పథంతో ఎంతో తాత్విక చర్చ జరిగింది.

---

25 విజ్ఞాన సర్వస్వము - పేజీ 84, 85

కూనీసలు, బానిసయజమానులకు వ్యతిరేకంగా భౌతిక ఉద్యమాన్ని నడిపారు. పాలకవర్గాలుగా రూపొందుతున్న బ్రాహ్మణ రాజ్యాధికారానికి వ్యతిరేకంగా కూడా ఈ తిరుగుబాటు జరిగింది. ప్రాచీన భారతీయతెగలు ఆర్య వైదిక భావాలకు వ్యతిరేకంగా తమ తాత్విక ఉద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్ళారు. పరలోకం, పునర్జన్మ, కర్మ, భగవంతుడు మొదలైన అధి భౌతికవాదం మీద వీరు తిరుగులేని పోరాటం గావించారు.

బౌద్ధజైన పిటకాలలో ఈ భౌతికవాదుల సమాచారం కొంతలో కొంత మనకు లభ్యమైంది. అయితే వీరి చరిత్ర, వీరి సిద్ధాంతాలు ఎన్నో చరిత్ర గర్భంలో దాగున్నాయి. అయితే బౌద్ధం కాలంలో కూడా భౌతికవాద ఉద్యమానికి నాయకత్వం వహించినది ఆర్యేతరమైన ప్రాచీన భారతీయ జాతులైన దళితులే అన్నది మనకు చరిత్ర చెబుతున్న సత్యం.

సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఆర్య బ్రాహ్మణ వ్యవస్థ మీద దళిత జాతులు చేస్తున్న పోరాటం సజీవమైనది.

## న్యాయ వైశేషికదర్శనాలు

న్యాయ దర్శనం కర్త గౌతముడు. ఇతడు భారతీయ సుప్రసిద్ధ దార్శనికుల్లోఒకడు. న్యాయదర్శనం. తర్కం పునాదిగా జ్ఞానసముపార్జన కుపయుక్తమైనది. వైశేషిక భౌతిక విజ్ఞాన శాస్త్రమును కణాదుడు అత్యంత ప్రతిభావంతంగా తీర్చిదిద్దాడు. రెండు వందల సంవత్సరాలపైగా వీరి తార్కిక భౌతిక సమాలోచనల-ప్రభావం సమాజం మీద బలంగాపడింది. క్రీ॥ పూ॥ 300 సంవత్సరాలనాడు ప్రారంభమైన ఈ దార్శనిక చింతన క్రీ॥ శ॥ 1200 సంవత్సరం వరకు కొనసాగుతూనేవుంది.

న్యాయ దర్శనానికి క్రీ॥ శ॥ 400 సంవత్సరాలలో వాత్స్యాయనుడు సుప్రసిద్ధమైన వ్యాఖ్యానం వ్రాశాడు. ఆ తరువాత క్రీ॥ పూ॥ 600లలో ఉద్యోతనుడు వ్రాసిన న్యాయ తార్కికం కూడా ప్రశస్తమైనదే. క్రీ॥ శ॥ 900ల్లో వాచస్పతి మిశ్రుడు న్యాయవార్తిక తాత్పర్యటీక వెలువరించాడు. క్రీ॥శ॥ 10వ శతాబ్దిలో వ్రాయబడిన న్యాయకుసుమాంజలి కూడా

ప్రసిద్ధమైనదీ. అయితే వైశేషిక దర్శనం మీద వచ్చిన ఈ భావవాద వ్యాఖ్యానాలలో అశాస్త్రీయమైన ధోరణులెన్నో వున్నాయి. మూలార్థానికి భంగం కలించేవి కూడా వున్నాయి పునాదిని దెబ్బతీసేవి బాగా పెరిగిపోయాయి. అందువలన వైశేషిక దర్శనం ఏమి చెప్పిందీ అనే గందరగోళం ఎక్కువ ఏర్పడింది. కణాదుడు వ్రాసిన వైశేషిక దర్శనానికి వ్యాఖ్యానాలుకాని భాష్యాలుకాని లభ్యం కావటంలేదు. కాని లంకాధిపతి వైశేషిక దర్శనానికి రావణ వ్యాఖ్య వ్రాసినట్లు ప్రసిద్ధివుంది.

## గౌతముని న్యాయ దర్శన సిద్ధాంతం

గౌతముడు నాగార్జునుడు ప్రతిపాదించిన శూన్యవాదాన్ని తర్కం ద్వారా ఖండించాడు. నాగార్జునుడు 'విగ్రహవ్యావర్తి'నిలో ప్రతిపాదించిన శూన్యవాదంలో "వస్తువుల్లో స్థిరమైనతత్వం పదార్థమేమీ లేదు. ప్రతి ఒక్కటీ విచ్ఛిన్న ప్రవాహం మాత్రమే" నని చెప్పాడు. అంతేగాక "ఈ శూన్యతను తెలుసుకున్నవారు సమస్త అర్థాలను తెలుసుకుంటారు. శూన్యతను తెలుసుకోలేని వారు ఏమీ తెలుసుకోలేరని" సిద్ధాంతీకరించాడు. ఈ వాదాన్ని తర్కంతో ఖండిస్తూ గౌతముడు తిరిగి పరమార్థప్రమాణాన్ని నిరూపించాడు.

గౌతముడు తన తర్కశాస్త్రంతో భావవాదాన్ని నిర్ధారించటానికి ప్రయత్నించాడు. ప్రజల్లో పాతుకుపోతున్న బౌద్ధ ఉద్యమాన్ని నిర్వీర్యం చేయడానికి ప్రయత్నించాడు. అయితే గౌతముడు రూపొందించిన తార్కిక భావవాదానికి శాస్త్రరూపాన్ని ఇవ్వడానికి ప్రయత్నించాయి. గౌతముడు తన న్యాయదర్శనంలో తర్కశాస్త్రాన్ని నిరూపించడానికి ప్రమాణం, ప్రమేయం, సంశయము, ప్రయోజనము, దృష్టాంతము, సిద్ధాంతము, అవయవము, తర్కము, నిర్ణయం, వాదం, జల్పం, వితండం. హేత్వాభాసం, ఛలం, జాతి, నిగ్రహస్థానం మొదలైన ప్రమాణాలను పేర్కొన్నాడు. ఈ ప్రమాణాలతో గౌతముడు తన సిద్ధాంతాన్ని రూపొందించాడు. న్యాయదార్శనికులు మోక్షాన్ని అంగీకరించారు. "ఆత్మకుదుఃఖముల ఆత్యంతిక వినాశం గుణరాహిత్య మగుట మోక్షం దగ్ధమైన ఇంధనమందలి అగ్నివలె ఉపశమనము" అనివ్యాఖ్యానించాడు.

భావవాద దార్శనికుడైన గౌతముడిలో ఉన్న తర్కం భావవాదంతో పాటుకొన్ని భౌతికవాద ధోరణులను కూడా ప్రతిపాదించింది

## కణాదుని వైశేషిక దర్శనం

కణాదుడు భారత దేశంలో ప్రసిద్ధిచెందిన దార్శనికుల్లో ఒకరు. ప్రపంచ దార్శనికుల్లో వుంది. కణాదునికి సముచిత స్థానంకారణం ఆయన స్థాపించిన అణుసిద్ధాంతంలోవున్న ప్రసిద్ధి. కణాదుడు ఉలుకునికుమారుడు. కణాదుడు నేటి అలహాబాద్ మండలంలోని 'పభోసా' అనే(ప్రభాస) గ్రామానికి సంబంధించినవాడు. నేల మీదపడివున్న గింజలను ఏరుకొని తిని బ్రతికే వాడట అందుచే కణాదుడనేపేరు వచ్చిందని న్యాయకందరీకారుడు వివరించాడు. కణాద ఇతితస్య కాపోతం వృత్తి మనుతిష్టతో రధ్యానిపతితాంస్తణ్ణుల కణానాదాయ ప్రత్యహం కృతాహారనిమిత్తా'' అని వివరణయిచ్చారు. అణుసిద్ధాంతాన్ని కనిపెట్టాడు కావున కణాదుడికి ఈపేరు వచ్చినదని కొందరువ్యాఖ్యానం చేశారు.

కణాదుడు పరమాణు సిద్ధాంతం:

కణాదుడు ప్రత్యక్షము, అనుమానమూ అనే రెండు ప్రమాణాలు మాత్రమే అంగీకరించాడు. శబ్దం ఉపమానమూ కూడా అనుమానం తోనే అంతర్గత మౌతాయిఅన్నాడు.

కణాదుడు పదార్థాన్ని ద్రవం, గుణ, కర్మ, సామాన్యం, విశేషం, సమవాయం అని ఆరుభాగాలుగా విభజించారు. తరువాత ద్రవ్యం, పృధివీ, జలం, అగ్ని, తేజస్సు, వాయువు, ఆకాశం, కాలం, దిక్కు, ఆత్మ, మనస్సు అను తొమ్మిది రకాలుగా విభజించాడు. కర్మక్షేపణం, అవక్షేపణం ఆంకుచనం, ప్రసారణం, గమనం అని ఐదురకాలు ఉంటుందన్నాడు.

'సామాన్యం, న్యాయం ఒకటిగానే ఉంటూ అనేక వస్తువులతో సంబంధించి ఉంటుంది'. అని కణాదుడు వ్యాఖ్యానించాడు. విశేష మంటే రెండు వస్తువుల్లో వున్న పరస్పర భేదానికి కారణమౌతుంది. సమవాయం అనగా విడదీయరాని వస్తువులమధ్యవున్న సంబధం అనివివరించాడు అభావం నాలుగు విధాలు, ఇవిప్రాగభావం, ప్రధ్వం, సాభావం, అన్యోన్యాభావం, అత్యంతా భావంగా పేర్కొనబడ్డాయి. ఘటం పుట్టటానికి

ముందు ఆఘటంలేదు. అప్పుడా ఘటం లేకపోవటానికి (ఘట) ప్రాగభావమని పేరు. పుట్టిన ఘటం కొంతకాలానికి నశించినప్పుడు కూడా ఘటంలేదు. ఆఘటాభావానికి (ఘట) ప్రధ్వంసా భావం అని పేరు. ఘటం పటంకాదు. పటం ఘటంకాదు. ఈ విధంగా రెండు వస్తువులమధ్య ఉన్న భేదానికి అన్యోన్యం అని పేరు. చెరువులో అగ్ని లేదు. ఇలాంటి అభావానికి అత్యంతాభావం అని పేరు.

కణాదుడు ఆత్మని అంగీకరించాడు. అయితే దాన్ని కూడా ఒక పదార్థమన్నారు. పదార్థం అణువుల కలయిక వలన, అణువుల సంవిధానం వలన రూపొందుతుందన్నాడు. వివిధ పదార్థాల సమ్మేళనం కనుగొనడం ఎంత కష్టమో 'ఆత్మ' అనేపదార్థాన్ని కనుగొనడంకూడా అంతక్లిష్టమేనన్నాడు.

కణాదుని భౌతిక వాదంలో తర్కం వుంది. విశ్లేషణవుంది. సమన్వయం వుంది. కణాదుడి భౌతిక సిద్ధాంతంలో చొరబడిన 'ఆత్మ' ప్రక్షిప్తమై వుండవచ్చు. భారతీయ భౌతికవాదాన్ని నిర్వీర్యంచేస్తూ ఈశ్వరసిద్ధాంతం ఆత్మావాదం వెంటాడుతూ వచ్చాయి. భౌతిక సిద్ధాంతం పునాదులు కూల్చడానికి భావ వాదులు చేసిన ప్రయత్నాలు, కుతంత్రంతోను, కుయుక్తులతోను కూడుకున్నాయి. కొన్ని సార్లుకర్కశంగా కూడా అవి ముందుకొచ్చాయి.

అయితే భౌతికవాదసిద్ధాంత పునాదులుసజీవమైనవి కాన అవి కప్పబడ్డాయేకాని శిథిలం కాలేదు.

## పతంజలి- యోగదర్శనం

పతంజలి వ్రాసిన యోగం అధి భౌతిక సిద్ధాంతానికి సంబంధించినది. దానిలో ప్రస్తావించబడిన మానసిక శాస్త్రాంశాలు అధి భౌతిక శాస్త్రానిక వివరంగా వచ్చిన శాస్త్రాలు మాత్రమే. ఈ శాస్త్రం భారతీయ తాత్విక ధోరణులన్నింటిని వ్యతిరేకించింది. అంతేగాక దీనికి మొదటి తాత్విక సిద్ధాంతాలను పూర్వ పక్షం చేయుడానికి ప్రయత్నించింది.

సాంఖ్య, యోగ దర్శనాలు రెండూ ప్రకృతిని, పురుషుణ్ణి అంగీకరించాయి. భౌతిక వాదానికి ఆత్మమూలం అని యివి అంగీకరించాయి.

యోగశాస్త్రం మీద సాంఖ్యం ప్రభావమే గాక, యోగ తత్వానికి సంబంధించిన అధి భౌతికవాదం పునాదులు సింధూ నాగరికతలోనే కని పించాయని దాస్‌గుప్తా వాదం. అది శైవంశా క్తేయం ప్రభావం యోగ దర్శనంమీద కూడా వుందని దేవిప్రసాద్ ఋజువు చేశారు. జాకోబ్ క్రీ॥శ॥ 450 లో ఈ సూత్రాలు సమీకరించబడ్డాయి అని పేర్కొన్నారు.

దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ సాంఖ్యతత్వానికి పతంజలి 'దేవుణ్ణి' చేర్చడం తప్ప యితనికి ప్రత్యేకత ఏమీ లేదన్నారు. యోగశాస్త్రంలో చేర్చబడిన ప్రయోగాలు ఆదిమ సమాజాల ఇంద్రజాలిక రూపాలేనని తత్వవేత్తలు చెప్పారు.

'There is nothing new in this view. Competent scholars have argued out this. Some of them have gone so far as to discover the origin of the yoga in the magical practices of primitive society. What is not argued' however, is that if the relation of the sankhya and the yoga were not an innovation of the later thinkers, the origin of the yoga has some light to throw also on that of the sankhya.

ఈ అభిప్రాయాన్ని దాసుగుప్త యింకా వివరంగా విశ్లేషించాడు

ప్రాచీన అధిభౌతికవాదుల నుండి చెప్పబడిన యోగసూత్రాలను పతంజలి ఒక వరుసలో సంగ్రహించి వాటికి వివరాలు యివ్వడం జరిగిం దని దానిలో సాంఖ్యుల అధిభౌతికవాద ప్రభావం మిక్కుటంగా వుందని దాసుగుప్తా అభిప్రాయపడ్డాడు. మరి సాంఖ్యుల ప్రభావం కూడా పతంజలి మీద వుంది. మరి సాంఖ్యులపై భావవాదం ప్రభావం స్పష్టంగా ఉంది. యోగశాస్త్రం మీదకూడా ఈ భావవాద ప్రభావం పూర్తిగావుంది.

పతంజలి తన యోగతత్వం నుండి యోగాచారాన్ని రూపొందిం చాడు. యోగసిద్ధాంతం నుండి, యోగాచరణనుండి ఏకాగ్రతను పతంజలి బోధించాడు ఏకాగ్రతద్వారా ఆధ్యాత్మిక భావాన్ని పొందడాన్ని యోగద ర్శనం నివేదించింది.

భారత ఆదిమ జాతులు శరీరాన్ని అదుపులోకి తేవడానికి ఎన్నో యోగసూత్రాలను అనుసరించారు. ఈ విషయం సింధూ నాగరికతలోని

ఫలకాలు వలన తెలుస్తుంది. భారత దేశానికి వలస వచ్చిన ఆర్యజాతులు కూడా ఈ యోగాన్ని అభ్యసించినట్లు కొన్ని ఆధారాలు ఉన్నాయి.

ఈ ఏకాగ్రత అనేది భౌతికాంశం నుండే ప్రారంభమై ఆధ్యాత్మిక వాదానికి చేరిందని యోగ శాస్త్రం చెబుతుంది. బౌద్ధం ప్రభావం కూడా యోగశాస్త్రం మీద కొంత వుంది. 'స్థిరమగు ఇంద్రియధారణము యోగ మ'ని కఠోపనిషత్ చెబుతుంది. పంచేంద్రియములు మనస్సుతో పాటు ఆత్మయందు స్థిరమైనపుడు బుద్ధికి చేష్టవుండదు. అదే పరలోక మార్గం అని వారి విశ్వాసం.

యోగమనగా ఉపాయమని, ప్రయత్నమని, ధ్యానమని, శక్తి యని, పురుష ప్రకృతుల వియోగమే యోగమని భోజుడు వివరించాడు బౌద్ధ గ్రంథములగు దీర్ఘ నికాయము మొదలైనవాటిలో 'ప్రాణాయామం' సమాధిగా వర్ణించ బడ్డాయి.

సింధూ నాగరికతనుండి కనిపిస్తున్న ఈ యోగదర్శన ముద్రలు పతంజలి కాలం నాటికి ఆధ్యాత్మిక రూపాన్ని సంతరించుకొన్నాయి. భారతీయ భౌతిక వాదముద్రలు ఈ యోగశాస్త్రం మీద ఉండటాన్ని మనం స్పష్టంగా గమనించడం వలన భౌతిక వాద ప్రభావాన్ని ప్రాశస్త్యాన్ని మనం అంచనా వేయగలుగుతున్నాము. భౌతికవాదముద్రలేని ఏదర్శనం భారత దేశంలో లేదనేది మనకు అవగతమవుతోంది. భావవాదులు భౌతికవాద దర్శనాలను భావవాదంతో ముగించాలని ప్రయత్నించారు. భావవాద దర్శనాలుగా చెప్పబడుతున్నవి కూడా భౌతిక వాద దర్శనాల ప్రభావం నుండి తప్పుకోలేక పోయాయి.

## మనుస్మృతి హిందూమతరాజ్యధర్మం

భారతదేశంలో వచ్చిన భౌతికవాద భావవాద దర్శనాలు మొత్తం మీదతాత్వికలోకంలో పెద్దచర్చ రేపాయి. హిందూరాజ్యం ఒకశక్తిగామారే కొలది తాత్విక సమాలోచనమీద గొడ్డలి వేటుపడింది.

హిందూధార్మికచట్టాలు రూపొంది హిందూధర్మాన్ని ప్రశ్నించే. నిలదీసే తాత్వికఆలోచనాపరులపై నిర్బంధించే చట్టాలు తెచ్చారు. విమ

ర్శకు ఆలోచనకుసమాలోచనకు, చర్చకు ప్రశ్నకు అవకాశంలేని హిందూ రాజ్యధర్మాన్నిప్రతిష్ఠాపించారు.

మానవతను సమతను తమ అగ్రవర్ణాధిపత్య సిద్ధాంతాలతో రూపు మాపడానికి ప్రయత్నించారు. భారతీయతాత్వికచింతనకు ఒకబలమైన అడ్డుగోడగానిలిచిన మనుస్మృతినిగురించి చరిత్రలోదానిపాత్రనుగురించి మనము అర్థంచేసుకోవడం ద్వారానే హిందూరాజ్యం పునాదులు మనకు అర్థమవుతాయి.

హిందూరాజ్యం ఏర్పడేనాటికి మనుధర్మశాస్త్రాన్ని రూపొందించారు దీనికి కూడా వేదగౌరవాన్ని కలిగించారు. మనువు ఈ సంస్మృతిని భృగుమహర్షికి బోధించెనని భృగువు మిగిలిన ఋషులందలికి బోధించెనని ప్రసిద్ధివున్నది. మనుస్మృతికి ముందే పరాశరస్మృతి వాడుకలో ఉంది. మనుస్మృతికి మేధాతిథి గోవింద రాజులు కుల్లూకభట్టులనేవారు వ్యాఖ్యానాలు వ్రాశారు. ఇందులో కుల్లూకభట్టునివ్యాఖ్యానము ప్రఖ్యాతిలోకివచ్చింది.

మనుస్మృతి ఎప్పుడు వ్రాయబడింది. అనే విషయంలో ఎన్నో వాదాలున్నాయి. ఆచార్య ఎస్. వెంకట్రామన్ క్రీ॥ పూ॥ 2000 సం॥ కాలంలో మనుస్మృతి వ్రాయబడింది అంటున్నారు. సర్. విలియం జోన్స్ క్రీ॥ పూ॥ 1280లో మనుస్మృతి రచించబడిందనిఅభిప్రాయపడుతున్నారు. 'ప్లెజల్' క్రీ॥ పూ॥ 1000 సం॥ అంటుండగా మోనియర్ విలియంగ్ క్రీ॥ పూ॥ 5వ శతాబ్దిఅని తెల్పారు. ప్రసిద్ధచరిత్రకారుడు. "కాణే" క్రీ॥ పూ॥ 3వ శతాబ్దిఅని వ్యాఖ్యానించగా బూలర్ క్రీ॥ పూ॥ 200 నుండి క్రీ॥ శ॥ 200 మధ్యలో వ్రాయబడి ఉండవచ్చని చెప్పారు. జయస్వాల్ క్రీ॥ పూ॥ 150 అని నిర్ధారించారు. డా॥ అంబేట్కర్ మనుస్మృతి క్రీ॥ పూ॥ 170 నుండి 1500 మధ్యకాలములో రూపొంది ఉంటుందని పేర్కొన్నారు. అంబేడ్కర్ పరిశోధనలను బట్టి సుమతి భార్గవుడు అనే వాడు మనుస్మృతిని రచించి ఉంటాడని మను, అతనియొక్క ఆరోపిత నామమని అంబేడ్కర్ అభిప్రాయము. బౌద్ధసంస్కృతిని విస్తరింపజేసిన మౌర్యసామ్రాజ్యం కూలేక్రమంలో బ్రాహ్మణరాజ్యాన్ని విస్తరించటానికి పూనుకున్నపుష్య

మిత్రుని కాలం నకు బ్రాహ్మణ వాదాన్ని వ్యవస్థీకృతం చేయటానికి కూర్చబడిందే మనుస్మృతి అని అంబేద్కర్ తన పరిశోధనలో వెలువరించారు.

According to scholars whose authority can not be questioned Sumathi Bhargava must have composed the code which he deliberately called Manu Smriti between 170 B. C. and 150 B. C. Now if one bears in mind the fact that the Brahamanie Revolution by Pushyamitra took place in 185 B. C. there remains no doubt that the code known as Manu Smriti was promulgated by Pushyamitra as embodying the principles of Brahamnie Revolution against the Buddhist state of the Mauryas. That the Manu Smriti forms the institutes of Brahmanism and are a proof that Pushyamitra Revolution was not a purely personal adventure will be clear to any one who cares to note the following peculiarities relating to the Manu Smiriti. [28]

అంబేడ్కర్ మనుస్మృతి రూపొందిన కాలాన్ని అవసరాన్ని అది నిర్వహించిన పనిని చారిత్రక దృక్పథంలో వివరించారు. పుష్యమిత్రుడు మరియు బ్రాహ్మణ రాజ్యవాదులు బౌద్ధసంస్కృతి నిర్మించిన సమ సంఘాన్ని ధ్వంశించి వర్ణవ్యవస్థను పునర్నిర్మించటానికి ఆయుధంగా వాడుకున్నారు.

That the new regime of Pushyamitra was anti-Buddhist is betrayed by the open provisions enacted in the Manu Smriti against the Buddhist and Buddhism. [29]

పుష్యమిత్రుడు మనస్మృతిని బౌద్ధాన్ని నాశనం చేసి బ్రాహ్మణవాదాన్ని పునర్నిర్మించటాని సాధనంగా వాడుకున్నాడు. బౌద్ధసాంమ్రాజ్యాన్ని కూల్చటానికి బ్రాహ్మణరాజ్యన్ని విస్తరింపజేయటానికి మనుస్మృతిని బలమైనశక్తిగావారు ఉపయోగించారు. మనుస్మృతి బ్రాహ్మణుకునిరాజుగా వ్యస్థాపకుడుగా నిర్ధారించింది.

బ్రాహ్మణుల్ని ఆధిక్యజీవిగా ప్రకటించింది. వర్ణాన్ని కులంగా మలచింది. కులపై రుధ్యాలను, సామాజిక అసమానతలను పురిగొల్పింది.

28 29 Dr. B.R. Ambedkar. Writings and Speaches vol-3 page. 271

స్త్రీలను శూద్రులను. అవమానించి అణిచివేచింది. సామాజిక అసమానత లను కఠినమైన శాసనాలతో చట్టబద్ధంచేసింది. ఒక శూద్రుడు బ్రాహ్మణుని నిందించిన పొరపాటున కొట్టిన మనువువిధించిన నిభంధనలను పరిశీలిస్తే మనకు సుభోదకమౌతుంది.

"యేన కేనచిదం గేన హింస్యాచ్చే చ్ఛేష్ఠమంత్యజః,
ఛేత్తవ్యం తత్తదేవాస్య తన్మనోరను శాసనమ్"

శూద్రుడు వీని నొకయంగములోఁగాని, ప్రత్యక్షముగఁగట్టి పెంద లగు వానితోఁగాని తనకంటె శ్రేష్ఠుని (ద్విజులను) గొట్టెనేని, యేయంగ ముతోఁ గొట్టెనో యాయంగమును ఛేదింపవలయునని మనవు నుపదే శము. ఇఁకఁ జెప్పఁబడునది యెల్ల దీని వివరణమే.

"పాణి ముద్యమ్యదండం వాపాణిచ్ఛేదన మర్హతి,
పాదేన ప్రహరకోన్ పాత్పాదచ్ఛేదనమర్హతి"

ఆ శూద్రుడు కొట్టుటకు జేతినిగాని కఱ్ఱనుగాని పైకెత్తినేని, చేతిని కోసివేయవలయును. కోపముచే గాలితోఁదన్నెనేని, కాలిని కోసివేయ వలయును.

"సహా సనమభి ప్రేప్సు రుత్కృష్టస్యావకృష్టజః
కట్యాం కృతాంకో నిర్వాస్యః స్ఫిచంవాఽ స్యావకర్తయేత్"

బ్రాహ్మణునితో సమానా సనంబున గూర్చుండునట్టి శూద్రునికి, నడుమున నొక్క కఱ్ఱుతో గాల్చి వాతవేసి తఱుమవలయును. ఇతడు చావ కుండు నట్లు తని త్రిష్ఠమును గోసివేయువలయును.

"అవనిష్ఠీవతో దర్పాద్ద్వావోష్ఠౌ ఛేదయేన్నృపః
అవమూత్రయతో మేఢ్ర మవశర్ధయతో గుదమ్"

గర్వముచే బ్రాహ్మణుని ముఖమున గాఱయుమ్మివేయు శూద్రుని రెండు పెదవులను రాజు గోసివేయు వలయును. మూత్ర విసర్జనముచే నవమానించు వాని మేఢ్రమును, ప్రమాదమునగాక,గర్వముచే బ్రాహ్మ ణునిపైన పానవాయువు నిడుచు వానిగుదమును గోసివేయవలయును.

కేశేషు గృహ్ణతో హస్తౌ ఛేదయేద విచారయన్
పాద యోర్దాఢి కాయాం చ గ్రీవాయాం వృషణేషుచ

గర్వముచే బ్రాహ్మణుని జుట్టుపట్టుకొన్న శూద్రునికి వీనికి నాస్తి గలిగినదా లేదాయని విచారింపక, చేతులను నఱికివేయుచవలయును. అట్లు హింసించుటకై కాళ్ళయందును. దాడి యందును మెడ యందును, వృషణమునందును బట్టుకొన్నవానికి నిట్లే హస్తద్వయుచ్ఛేదము జేయు వలయును.

త్వగ్భేదకశ్శతం దండ్యో లోహితస్యచ దర్శకః,
మాంస భేత్తాతు షణ్నిష్కాన్ ప్రవాస్యస్త్వస్థి భేదకః.

బ్రాహ్మణుని తోలు మాత్రము బఱచుకొన గొట్టిన సమాన జాతీయునికి నూఱు రూకలు దండన విధింపవలయును. రక్తముగార్చిన వానికి నట్లే దండన విధింపవలయును. మాంసమును జీల్చిన వానికి ఆఱు నిష్కములు దండన విధింపవలయును ఎముకలు విఱిచిన వానిని దేశము నుండి తఱుమ వలయును,

(మనుస్మృతి-8వ అధ్యాయం 279 నుండి 284 వరకు)

ఈ సూత్రాలను బట్టి శూద్రులను బ్రాహ్మణుల బానిసలుగా రూపొందించడానికి మనుస్మృతి చేసిన ప్రయత్నం బోధపడతుంది. బ్రాహ్మణాధిక్యతకు బ్రాహ్మణ రాజ్య ధర్మానికి కంచు కోటలు నిర్మించిన మనుస్మృతి ప్రభావం ఈనాడు భారతదేశంలో బ్రాహ్మణ రాజ్య స్థాపనకు పుష్యమిత్ర సాంప్రదాయాన్ని కొనసాగిస్తున్న అద్వాని వర్గం మీద బలంగా ఉంది. బ్రాహ్మణాధిక్యతతో అధికారంతో శతాబ్దాలు [illegible] పోయిన శూద్రులు. అస్పృశ్యులు స్త్రీలు ఈప్రమాదాన్ని గ్రహించి మనుస్మృతి రాజ్య నిర్మాణానికి వ్యతిరేకంగా నిలబడి పోరాడాలంటే చార్వాక దర్శనమే సరైన సిద్ధాంత ఆయుధం అనేది గమనించగలగాలి.

## భగవద్గీత-హిందూ హింసావాదం

భగవద్గీత భారతీయ ఆధ్యాత్మిక వాదనికి సారంగా ఈనాడు చెలామణీ అవుతుంది. ఆర్యుల ఆధ్యాత్మికవాదం భగవద్గీతలో కవితా బద్ధమైంది. భగవద్గీత రచనాకాలానికి ఆర్యుల సామ్రాజ్యాలు రూపొందుతున్నాయి. ఆర్య గణాలు సామ్రాజ్యాధిపత్యం కోసం ఘర్షిస్తున్న కాలమది.

బ్రాహ్మణులు తాము స్వయముగా రాజ్యాధిపత్యాన్ని కొనసాగించటమే కాక క్షత్రియ రాజుల మీద బ్రాహ్మణత్వాన్ని రుద్దిన కాలమది. వేదాల వర్గం ముందు పలు కాలాల నాటి హిందూ మత వాదాన్ని క్రమబద్ధీకరించవలసిన ఒక చారిత్రక అవసరంగా భగవద్గీతను వాళ్ళు రూపొందించుకున్నారు. భగవద్గీతలో ఆధ్యాత్మిక సారమే కాకుండా, రాజ్యాధికారానికి మతపునాది రూపొందింది. జాతులను నిర్మూలించటానికి సిద్ధాంతం ఆయుధంగా కూడా దీన్ని చేసుకున్నారు. ఒక జాతిని మరొక జాతి. ఒక వంశాన్ని మరొక వంశం, ఒక వ్యక్తిని మరొక వ్యక్తి రాజ్యంకోసం వధించటం అధర్మంగాదనే ధర్మం భగవద్గీతలో రూపొందింది. ఇది అప్పటికి ప్రసిద్ధి పొందిన ఆర్యగణాలలో ముఖ్యమైన గణనాయకుల ముఖతా చెప్పించటం కోసం, భారతంలో దీన్ని చేర్చారు. అందునా ఒక శూద్రుని ముఖంచే చెప్పించటం వలన దీని పరిధిని త్రైవర్ణాల నుండి చాతుర్వర్ణాలకు విస్తరింపబడింది. కృష్ణుడు యాదవ రాజు కురువంశానికి సంబంధించిన అర్జునుడికి ఈ ధర్మాన్ని బోధించాడు. ఈ భగవద్గీత ధర్మ రక్షణార్థం చెప్పినట్లు, అధర్మానికి గ్లాని జరిగేటప్పుడు ధర్మాన్ని రక్షించటం కోసం వీరిభగవానుడు ఆవిర్భవిస్తుంటాడని భగవద్గీతలో చెప్పారు.

''యదా యదాహి ధర్మస్య గ్లానిర్ భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం''
"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే''

ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలిగిననాడు నన్ను నేను సృష్టించుకొందును. సజ్జనులను రక్షించుటకు, దుర్జనులను శిక్షించుటకు, ధర్మమును నెలకొల్పుటకు అప్పుడప్పుడు నేను పుట్టుదును. జన్మింతును! అని అర్జునునితో కృష్ణుడు అనినట్లు భగవద్గీతలోని పై శ్లోకముల కర్థము.

హిందూమత అవతార తత్వానికి ఇక్కడ పునాదిని వేసుకున్నారు. దశావతారాల సిద్ధాంతానికి భూమికను రూపొందించుకొని, ఇంకా ధర్మానికి హాని కల్గినప్పుడల్లా ఒక అవతారం ఎత్తటం దుష్టుల్ని

శిక్షించటం, శిష్టుల్ని రక్షించటం అనేది సిద్ధాంతంగా ముందుకు తెచ్చారు. ఆర్య జాతుల్ని ఎదిరించి ప్రాచీన భారత జాతులు నిలబడినప్పుడు, ఆ జాతులను అణచి వేయటానికి వారు ముందుకు తీసుకొచ్చే నాయకత్వమే అవతారతత్వం. ఇదే దుష్టశిక్షణ. ఆర్య జాతిని రక్షించటమే శిష్ట రక్షణ. ఆ క్రమంలో ముందుకు తెచ్చిన ఆయుధాలు, యుద్ధ వ్యూహాలు, యుద్ధ వ్యూహాలలోవున్న కుతంత్రాలన్నిటినీ ఈ ధార్మిక సిద్ధాంతం ప్రోత్సహిస్తుంది.

రాముడు అనార్య జాతినాకులైన వారిని, రావణుడిని చంపడం, ఇలాగే దశావతారాల్లోనూ ఈ విధానం మనకు కనిపిస్తుంది. ఆర్యుల్లో ప్రధానమైన పురు, యదు, ద్రుహ్యు, మనుగణాలు, వాటి నాయకులు భారతదేశంలో విస్తరించే క్రమంలో అనార్య జాతుల్ని తురుమాడుతూ వచ్చారు. పురుగణము సప్తసింధు (పంజాబ్) యొక్క తూర్పు ప్రదేశాలలో 'పరుష్ణి' అనే రావీ నదినుండి సరస్వతీ నది వరకు వ్యాపించివుంది. ఈ పురుగణములో అనేకమైన ఉపశాఖలు గూడా వున్నాయి. కృషిక, భరత, తృత్సు ఇవన్నీ పురుగణంలోని ఉపశాఖలు. ఈ ఉపశాఖల మీదగూడా మూలపురుగణానిదే ఆధిక్యత ఎక్కువగా వుంటుంది. ఈ పురు గణంలోని ఉపశాఖలైన కృషిక, భరత, తృత్సు గణాల నాయకులు గొప్ప వారుగా కీర్తింపబడ్డారు. ఈ జాతుల్ని రక్షించిన వారిని వీళ్ళు అవతార పురుషులుగా తీర్చిదిద్దుతూ వచ్చారు.

భగవద్గీత భారతంలో వున్నది. అనూచానంగా ఈనాడు ప్రచారంలోవున్న గీతలో 700 శ్లోకాలున్నాయి. దీనిలో 338 శ్లోకాలు వ్యాసుడు రచించినవి కాదని ప్రచారం ఉంది. ఇవిగాక మిగిలినవేనిజమైన గీత శ్లోకాలని ఆర్యసమాజిస్టులు వాదిస్తున్నారు. కాలక్రమానుగతంగా ఇందు హిందూ ఆధ్యాత్మిక వాదానికి సంబంధించిన అనేక వాదాల్ని ఈ గీతలో చేర్చారు. శంకరాచార్యుల దగ్గరనుండి గాంధీదాక హిందూ సామ్రాజ్య వాదులు ఆయా కాలాలలో ఆయా వాదాల కనుకూలంగా సమర్థించుకోవటం కోసం గీతమీద వ్యాఖ్యానాలు రాశారు. దీనినిబట్టి, ఈనాటి రాజ్యవాదులకు గీత ఒక ఆయుధంగా తోడ్పడుతుంది.

"గీతా సుగీతా కర్తవ్యా,
కిమన్యైః శాస్త్ర విస్తరైః"

గీత ఒకటి అధ్యయనం చేసిన సరిపోవును. ఇతర శాస్త్రములు చదవనేల అని అర్థము. అనగా, హిందూవాద మొత్తాన్ని గీతలో అను బంధించారని అర్థం అవుతుంది. బౌద్ధం భారత సమాజాన్ని ప్రభావితం చేసి వైదిక సంస్కృతిని పెకలిస్తున్న నాడు శంకరుడు తన భగవద్గీత భాష్యంతో మరోసారి హిందూ రాజ్యవాదాన్ని పునఃప్రతిష్ట చేయటానికి ప్రయత్నించాడు. ఈనాటి హిందూరాజ్య వాదులైన ఆర్.ఎస్.ఎస్. వారు గూడా గీతా యుధాన్ని చేతధరించే మైనారిటీల కుత్తుకలను కరకు కత్తులకు ఎరజేస్తూ నెత్తుటి ఏరుల ముంచుతున్నారు. గీత అమానవ నీతికి ఉద్గీత. గీత అప్రజాస్వామ్య సంస్కృతికి ప్రతీక. గీత ఆర్య సామ్రాజ్యవాదానికి హృద్గీత. భౌతికవాదులు భీష్ముడి నుండి గాంధీ వరకు ఆర్య సామ్రాజ్యవాదాన్ని, హిందూ సామ్రాజ్యవాదాన్ని గీతా వ్యాఖ్యానం ద్వారా ఎలా రూపొందించారో, దాన్ని ఒక శక్తిగా ఎలా వాడుకున్నారో అవలోకనం చేసుకోవాలి. డా॥ అంబేద్కర్ గీత హింసా వాదాన్ని వర్ణవ్యవస్థా అసమత్వాన్ని ఇలాగా చెప్పాడు,

"కృష్ణుడు హింసను సమర్థించి సిద్ధాంతీకరించాడు. అంతవరకు పరవాలేదు. భగవద్గీత దేవుని వాఖ్యము అంటే అభ్యంతరం చెప్పాలి. దానిలో ఏ సందేశం లేదు. గీతంలో సందేశంకోసం వెదకడం నిష్ప్రయోజనం. అయితే ఇక్కడ మనకొక ప్రశ్న ఎదురౌతుంది. భగవద్గీత పవిత్ర గ్రంథం కాని పక్షంలో మరింకేమిటి? నా సమాధాన మేమిటంటే భగవద్గీత మత గ్రంథమూ కాదు. సుదీర్ఘ తాత్విక విచారమూ కాదు. భగద్గీత ఏం చేస్తుందంటే తాత్విక స్థాయిలో మత మూర్ఖత్వాన్ని, మూఢత్వాన్ని బలపరుస్తుంది. కృష్ణుడు యుద్ధానికి తాత్విక సమర్థన ఇస్తాడు. యుద్ధంలో చంపుకోవడం తప్పు కాదంటాడు. శరీరం, ఆత్మ ఒకటేనను కోవడం పొరపాటు. ఆత్మకు చావులేదు. దాన్ని చంపడమన్న ప్రశ్న లేదు. కాబట్టి మనిషిని చంపడమన్నది ఏ మాత్రం తప్పుకాదు. యుద్ధం చేయడానికీ, తోటిమనుషుల్ని చంపి రక్తపాతం చేయడానికీ మనుష్యులు పశ్చాత్తాపంగానీ, సిగ్గుగానీ పడనవసరంలేదు. ఇది భగవద్గీతలో కృష్ణుడి

సందేశం. యుద్ధమూ, హింస యివేగాక భగవద్గీత చాతుర్వర్ణ వ్యవస్థకు
కూడా తాత్విక కవచాన్ని తొడుగుతుంది. దేవుడే నాలుగు వర్ణాలను
సృష్టించాడని, కాబట్టి వర్ణవ్యవస్థ పవిత్రమైనదని భగవద్గీత వక్కాణించి
చెబుతుంది. మనుష్యుల స్వభావమూ గుణగణాలూ పుట్టుకతోనే వస్తాయి,
అవి స్వతహాగా పెరుగుతాయి అన్న సిద్ధాంతానికి చాతు వర్ణానికి చెందిన
వాడన్న అంశాన్ని నిర్ణయించడంలో పొరపాటుకానీ, తొందరపాటుగా
కానీ, ఏక పక్షంగా చేసిన చర్యలేదని భగవద్గీత చెబుతుంది. బుద్ధి
యోగం కర్మయోగానికి తప్పనిసరి షరతనే సూత్రాన్ని వర్ణించింది భగ
వద్గీతే. వర్ణవ్యవస్థ ఉనికికి సహేతుకమైన వివరణ మాత్రం భగవద్గీత
ఇవ్వదు." [28] డా॥ అంబేద్కర్ చెప్పినట్లు భగవద్గీత సందేశం హింస
అసమ సమాజనిర్మాణం. ఈ నిర్మాణాన్ని కూల్చి, భౌతికవాదం సమత
వాదం పునాదిగా ఉండే ఉద్యమాన్ని పునర్నిర్మించాలి.

భారతదేశ ప్రాచీన జాతుల సిద్ధాంతాయుధాలైన చార్వాక
దర్శనం నుండి, ఈనాటి గతితార్కిక, చారిత్రిక భౌతిక వాదం వరకు
అభివృద్ధి చెందిన సిద్ధాంతాయుధాలను శక్తివంతంగా సమీకరించుకొని
భారత జాతుల పోరాటాన్ని సమర్థవంతంగా విజయవంతం చేయాల్సి
చారిత్రక అవసరం ముందుకొచ్చింది. అందుకే భగవద్గీతకు ప్రత్యామ్నా
యంగా భౌతికవాద గీతను సిద్ధాంతాయుధంగా ముందుకు తీసుకువెళ్ళే
కృషి ముందుకు సాగాలి.

## ఆచార్యత్రయం

బౌద్ధం ఒక సామాజిక విప్లవ శక్తిగా, సాంస్కృతిక పరిణామ
రూపంగా ప్రజ్వలిస్తూ ముందుకొస్తున్ననాడు దాని పునాదులను కుళ్ళ
హిందూ పునరుద్ధరణ వాదానికి కంచుకోటలు నిర్మించిన దుష్ట ఆధ్యాత్మిక
వాద త్రయమ్ ఆచార్యత్రయంగా ప్రసిద్ధి చెందింది. వీరు హిందూ
రాజ్యాన్ని, హిందూ ఆధ్యాత్మికవాదాన్ని గజిబిజిచేసి ప్రజల్లో ప్రభావ

28 డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రైటింగ్స్ &
స్పీచెస్ వాల్యూమ్ III 1987.

భ్రాంతులు సృష్టించి తాత్విక పునాదిని చెరిపివేసి భావవాదానికుండే అన్ని చీకటి గదులను తెరిచారు. భావవాదపు గాఢాంధకారపు లోయల్ని సృష్టించి, ప్రజల్ని ఆధ్యాత్మిక అనుభూతికి గురిచేసి ఆ లోయల్లోకి నెట్టారు.

శంకర, శంకరాద్వైతంమీద ఈ గ్రంథం లోపల పూర్తి వివరాలు ఇచ్చాము. రామానుజ, మధ్వాచారులుగా ప్రసిద్ధి చెందిన ఈ ఆచార్య త్రయం హిందూరాజ్యాలు బలంగా కొనసాగుతున్న కాలంలో వర్ధిల్లారు. సుమారు 8వ శతాబ్దం నుండి 12వ శతాబ్దిదాకా ఈ హిందూ సమాజం వీరి తత్వాలతో, భావాలతో, గానాలతో, ధ్యానాలతో, వాదాలతో, వివాదాలతో, ఖండనలతో, మండనలతో, అనుకూల-ప్రతికూల వైరుధ్యాలతో ముక్కలు ముక్కలై భావవాద రొంపిలో దిగబడిపోయింది.

శంకరాద్వైతం బౌద్ధుల శూన్య వాదాన్ని పూర్తి భావవాదంగా మలచింది. బౌద్ధ తత్వవేత్తలైన నాగసేనుడు, నాగార్జునుని ప్రభావం అద్వయితం మీద బలంగావుంది. అద్వైతమంటే రెండుగానిది. ఆత్మ-పరమాత్మ రెండుగాదు, ఒకటే (నా + ద్వైతం అంటే రెండుగాదు ఒకటే) నని అర్థం. ఈ దిశ నుండి శంకరుడు భారతీయ భౌతిక దర్శనాలపై వ్యాఖ్యానంచేసి వాటి మూలాన్ని దెబ్బతీయటానికి ప్రయత్నించాడు. భారత రాజకీయ వ్యవస్థ ఇతనికి అనుకూలంగా వుండటం ఈతని విస్తరణకు అవకాశం కల్పించింది. హిందూ ధార్మిక వాదులు రాజ్య శక్తిని తమకు అనుకూలంగా ఉపయోగించుకోవటంలోను, నిర్మించుకోవటంలోను అద్వితీయులుగా వున్నారు, విచిత్ర మేమిటంటే, శంకరుని మాయా వాదాన్ని, రామానుజుని విశిష్టాద్వైతం పూర్తిగా ఖండించి, ఆత్మ-పరమాత్మ రెండూ ఒకటే కాని, ఆత్మ పరమాత్మను చేరాలంటే, అది భక్తి ద్వారానే సాధ్యం అని చెప్పి, విశిష్టాద్వైతం శంకరుని మాయా వాదంపై దాడిచేసింది. ఈ రెండు వాదాల్ని మధ్వాచార్యుడు తన ద్వైత వాదంతో ఖండించాడు. ఆత్మ-పరమాత్మ రెండూ ఒకటి కావు. రెండూ వేరువేరు అని ఆయన సిద్ధాంతీకరించాడు. అయితే, ఈ పూర్తి భిన్నమైన వాదాలు చేసిన ఆచార్యులు హిందూ ఆధ్యాత్మికవాదులుగా భారతీయ భౌతికవాదుల మీద, దార్శనికుల మీద ఉమ్మడి దాడిచేశారు. హిందూమతంలోని

కుతంత్రం ఇదే. భౌతికవాదాన్ని, భౌతికవాద దర్శనాన్ని నాశనం చేసేటప్పుడు వీరందరూ ఐక్య శక్తిగా రూపొందుతారు. అంతర్గతంగా మాత్రం విభిన్న వాదాలతో కుమ్ములాడుకుంటారు.

ఈ ఆచార్యత్రయం భౌతిక, సామాజిక దార్శనికుల సంస్కృతికి భిన్నమైన సంస్కృతిని ప్రచారం చేయటంలో, నిర్మించటంలో కృతకృత్యులయ్యారు. బౌద్ధుల ఆరామాలను నిర్మూలించి వాటికి లంజ దిబ్బలని నామకరణంచేసి హిందూ అధ్యాత్మిక వాదానికి పునాదైన మఠాలను నిర్మించారు. బౌద్ధ, జైన సన్యాసులను హిందూ రాజ్యాలు పట్టుకొని ఊచకోతకోసి వీరు సన్యాసాశ్రమాలను నిర్మించారు. బౌద్ధ కళను, సాహిత్యాన్ని, స్థూపాలను శిధిలంచేసి, వాటిపునాదులపై హిందూ మత ధార్మిక వ్యవస్థను రూపొందించి కర్కశంగా వారిరుధిర క్షేత్రాలపై హిందూ ఆధ్యాత్మిక సౌధాన్ని నిర్మించారు. ఈ త్రిమతాచార్యులు పయోముఖ విషకుంభులు. ఆహార్యంలో సన్యాసత్వం, ఆచరణలో క్రౌర్యం, బోధనల్లో అహింస వీరి జీవనంగా సాగింది. అడుగు అడుగులో ప్రత్యర్థులుగా భావించిన బౌద్ధ, జైన, చార్వాక వాదులను వేదిస్తూ, వధిస్తూ ఆధ్యాత్మిక మార్గాన్ని భౌతికవాదుల శిధిల దేహాలపై నిర్మించుకున్నారు. మౌర్య సామ్రాజ్యం అంతరించుట, హిందూసామ్రాజ్య విస్తరణను చారిత్రకంగా మనం పరిశీలిస్తే హిందూ సామ్రాజ్యాలు బలపడటానికి ఈ త్రిమతాచార్యులు ఎలా దోహద పడ్డారో మనకు అర్ధమౌతుంది. వీరు బోధించిన తాత్విక అంశాలు ఏమీ లేకపోయినా, వీరిని గొప్ప తత్వవేత్తలుగా హిందూ ఆధ్యాత్మికవాదులు ఆకాశానికెత్తుకొని కొనియాడారు. వీరి కాలం భౌతిక వాదులకు అంధకారయుగం అని పేర్కొనవచ్చు. వాదం ప్రతివాదం అనే తాత్త్విక చర్చను అధిగమించి ప్రత్యర్ధిని, ప్రత్యర్ధి వాదాన్ని తునుమాడటం అనే కర్కశ సూత్రాలు వీరు ప్రవేశపెట్టారు. ఏనుగులతో తొక్కించి, గానుగలలో రుబ్బించి, వధ్యశిలపై వధించి, సీసాలు కరిగించిపోసి, నాలుకలు ఛేదించి హింసతో భౌతిక-సాంఘిక వాదులను అంతం చేసిన ఈ త్రిమతాచార్యుల వారసులు ఆ తర్వాత వారి మార్మిక హింసా వాదాన్ని ముందుకు కొనసాగించారు. చరిత్రలో వారి వధ్యశిలపై స్రవించిన రక్తపు చారలతడి ఇంకా ఆరలేదు.

# చీకటి యుగంలో చిరుదివ్వెలు

త్రిమతాచార్యులు హిందూ మతోన్మాధాన్ని వ్యాప్తిజేసిన తరువాత భారతదేశంలో తాత్వికంగా చీకటి యుగం అవతరించింది. మత మౌఢ్యం విస్తరించి వర్ణవ్యవస్థ ఉక్కు చట్రంగా రూపొందింది. అసమ సమాజానికి ఆయువుపోసే రాచరిక వ్యవస్థలు ఆనాడు భారతావనిలో కొనసాగాయి. మౌర్య సామ్రాజ్యం అంతరించిన తరువాత మానవతా సౌధము కూలి పోయింది. హిందూ రాజ్యాధినేతలు మానవతా రహితంగా శూద్ర, అస్పృశ్య జాతులను అణచివేశారు. సమాజానికి మూలశక్తులైన శూద్ర, అస్పృస్య జాతుల అణచివేత పరాకాష్ట చెందిన తరువాత హిందూ సాంమ్రాజ్యం కూడా కూలిపోవడం ప్రారంభించింది. ఇతరదేశ సాంమ్రాజ్యవాదశక్తులు భారతదేశంలో చొచ్చుకురావటం ప్రారంభించాయి. అనైక్యత, అసమానత, అవినీతి, కుతంత్రవ్యూహాలు భారతసమాజాన్ని వ్రియ్యులుచేశాయి. నిర్వీర్యులైన బ్రాహ్మణుల నుతుల స్తుతులతో మత్తెక్కిన హింధూరాజులు బహుభార్యత్వం, మధ్యపానం, జూదం, వేశ్యాలోలత్వంలో పడి ప్రజలను పీల్చి పిప్పిచేస్తూ దేశఆర్థిక, సాంఘిక వ్యవస్తను నిర్వీర్యం చేసిన సందర్భంలో ఎన్నో ఇతర రాజవంశీలు చొచ్చుకొనివచ్చి భారతావనిని ఆక్రమించడం ప్రారంభించాయి. ఈ రక్తదాహమైన యుద్ధఘట్టాలలో ఎందరో పేదల రక్తం ఈ నేలలో ఇంకింది. మొత్తం మీద హింధూరాజ్యం అంతరించి మొగలాయిరాజ్యం అవతరించింది. ఈ కాలాలలో దక్షిణభారతంలో వీరశైవం, బౌద్ధ, జైన సంస్కృతులను కాలరాయటానికి విజృంభించడంతో పాటు కొన్ని సంస్కరణలను కూడా తీసుకువచ్చాయి. కులతత్వాన్ని ఖండించింది. స్త్రీలను శూద్ర, అస్పృస్య జాతులను వీరశైవ ఉద్యమంలోకి నడిపించింది. వీరశైవాన్ని కాకతీయ సాంమ్రాజ్యం దగ్గరనుండి బసవన్నదాక దక్షిణ భారతంలో ఎన్నో రాచరిక వ్యవస్థలు ప్రోత్సహించాయి. నన్నెచోడ మహారాజు దగ్గరనుండి పాల్కురికి సోమనాధుడు, మల్లిఖార్జున పండితుడు వరకు ఎందరో కవులు ఆవిర్భవించారు. వీరశైవులు వేదవిధ్యను ప్రశ్నించారు. కులవ్యవస్థను విమర్శించారు. బ్రాహ్మణుల యజ్ఞాలను ఎద్దేవ జేశారు. అస్పృశ్యతను ఖండించారు.

ఎచట బ్రాహ్మణులకు నితరుల ముట్ట
నుచితంబు గాదుగా కొరులకు ద్విజుల
ముట్టంగ రాదను నిట్టి ధర్మములు పుట్టుక,

విసుము శూద్రులు ముట్టినను బ్రాహ్మణులకు
మన సచేల స్నానములు సేయువలయు
నని చెప్పగాక యీ యధమ వంశజుల
కును ద్విజులను ముట్టంజన దని కలదె
యేనీతి యేధర్మ మేపురాణోక్తి
యేనాటి భక్తిసహింపగం దగునే?

(బసవ, సప్తమ - తల్లిదేవయ్యాగారి కథ)

ఈ ద్విపదలో వీరశైవులు అగ్రవర్ణాలను శాస్త్రీయ దృక్పథంతో ఖండించటం కన్పిస్తుంది. ఈ విధంగా వీరశైవులు సాంఘిక అసమానతల మీద కొంత సంస్కరణను చేశారు. దక్షిణభారత సాహిత్యంలో శివకవులు యుగాన్ని సృష్టించుకున్నారు. భారతచరిత్రలో వారి సంస్కరణల ముద్రలను వేయగలిగారు.

మధ్యయుగాల్లో హిందూమతం నుండి ముస్లీమ్ మతం నుండి ఎందరో సన్యాసులు భక్తికవులు ఆవిర్భవించి మానవతా గానాన్ని చేశారు. వారిలో చక్రధర్, రామానంద, కబీర్, చైతన్య, ఏక్‌నాథ్, తుకారామ్ ప్రసిద్ధులు. వీరందరూ దేవుణ్ని భజించినా కుల దురాచారానికి వ్యతిరేకంగా మానవతా గానం చేశారు. వీరందరూ భావవాదులే, మధ్యయుగాల్లో భౌతికవాద దృక్పథం భారతదేశంలో బాగా కొరవడింది. భావవాస్య శృంఖలాల్లో భారతావని మగ్గిపోయింది. బాల్య వివాహాలు సతీసహగమనాంలో భారతదేశంలోని మత అకృత్యాలనుచూసి భారత దేశానికి చూడవచ్చిన యాత్రికులు ఆశ్చర్యపోయే అంతగా భారత భావ వాద గాడాంధకారంలో మగ్గిపోయింది. ఆ కాలములో భక్తి కవుల భక్తి గీతాలే కొంత వూరట కలిగించాయి. భావవాద గాడాంధకారంలో చిరు దివ్వెలు వెలిగించాయి అనక తప్పదు. ఈ కాలంలో పాశ్చాత్యదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవ నోద్యమాలు వెల్లివిరిశాయి, భౌతికవాద

ఉద్యమం శాస్త్రీయ రూపాన్ని సంతరించుకొంది. పాశ్చాత్యదేశాల్లో అభివృద్ధి చెందిన భావవాద భౌతికవాద ధోరణుల పైన మనకు సమగ్ర అవగాహన ఏర్పడితే బ్రిటీష్ వలస వాదులు భారతదేశం వచ్చిన తరువాత పాశ్చాత్య భావవాద భౌతికవాద ఉద్యమాల ప్రభావం భారతావనిపై ఎలాపడింది. అతి కీలకమైన 17, 18, 19 శతాబ్దాలలోని భారతదేశ ఉద్యమాలపై వీటి ప్రభావమెంతో మనం అవగాహన చేసుకోవడానికి వీలుంటుంది. అందుకే పాశ్చాత్య దేశాల్లో భావవాదం, భౌతికవాద ధోరణులను పరిశీలిద్దాం.

## పాశ్చాత్య తత్వశాస్త్రం - భౌతికవాద, భావవాద ధోరణులు

ప్రపంచ దర్శనాలలో గ్రీకు దర్శనానికి గొప్ప ప్రశస్తి ఉంది. గ్రీకు దార్శనికులలో ప్రసిద్ధుడైన సోక్రటీస్‌కు ముందే భౌతిక తాత్విక వాదాలు కొన్ని ప్రచారంలో వున్నాయి. వీరిని నాలు రకాలుగా చెబుతున్నారు.

1) అనేక విధములగు భౌతిక వాదులు 2) పైథాగరస్ సంప్రదాయ వాదులు 3) ఎలియాటిక్ హేతువాదులు 4) సోఫిస్టులు ఉన్నారు. ఈ వాదాల ప్రభావం ఆ తరువాత వచ్చిన భౌతికవాదుల మీద ఉంది. సృష్టి సిద్ధాంతాన్ని తేలీజ్, అనే అన్వేషకుడు ఈ విధంగా ప్రతిపాదించాడు. మంచుక్రింద, ఆవిరిక్రింద సులభముగా మారగలుగుటయేకాక జీవపదార్థము సంతతికిని జలమే ఆధారమగుటచే జలమే ప్రపంచమునకు ఉపాదాన కారణమనియు, వస్తువులన్ని జలము నుండి ఉద్భవించి, జలములో లీనమగుటవల్ల సృష్టి పర్యాయ క్రమమున జరుగుననియు" చెప్పుట వలన, ప్రపంచ నిర్మాణ సమస్యా పరిష్కారమునకు పూనుకొన్న వారిలో (క్రీ॥పూ॥ 614-547) తేలీజ్ మొదటివాడు. దీనినిబట్టి తేలీజ్ నీరు విశ్వానికంతటికి మూలమన్నాడు.

క్రీ॥పూ॥ 610-546 మధ్య జీవించిన అనక్జిమాండర్ అనింకం అన్నిటికి మూల మన్నాడు. క్రీ॥పూ॥ 588-525 మధ్యలోనే అనాక్జిమీకస్ గాలి అన్నిటికి మూలమన్నాడు. క్రీ॥పూ॥ 500-428 మధ్య జీవించిన

అనాక్జిగోరస్ ఈయన ప్రపంచంలోని ప్రతి పదార్థం అతి ముఖ్యమైన నశింపులేని రేణువుల సముదాయమని గొప్ప భౌతిక భావాన్ని ముందుకు తెచ్చాడు.

క్రీ॥పూ॥ 460-370 నాటి డెమొక్రిటస్ పరమాణువాదం ప్రసిద్ధమైనది. డెమొక్రిటస్ ప్రాచీన భౌతికవాద తత్వవేత్తలలో అతి ముఖ్యుడు. అంతేగాక డెమొక్రిటస్ గొప్ప శాస్త్రజ్ఞుడు. తత్వశాస్త్రం, పదార్థ విజ్ఞానం, గణిత, వైద్య, శరీర శాస్త్రాలపైన, సంగీతశాస్త్రంపైన వీరు 70 కి పైగా గ్రంధాలు రచించారు. గ్రీకులలో విజ్ఞాన సర్వస్వంగా పేర్కొన దగిన వారిలో మొదటివాడు డెమొక్రటస్ అని మార్క్స్ ఒక సందర్భములో అన్నాడు. తత్వశాస్త్ర మౌలిక సమస్యను డెమొక్రటస్ భౌతికవాద పరంగా పరిష్కరించాడు. అయన సిద్ధాతం ప్రకారం ప్రపంచంలో ప్రతి వస్తువు అతి సూక్ష్మమైన, అవిభాజ్యమైన అణువులతోనూ, కొంత శూన్యం తోనూ, కూడు కొన్న సముదాయం. అణువులు శాస్వితమైనవి. మార్పు లేనివి. అవి భాజ్యమైనవి. వీటికి పుట్టుక, నాశనంలేదు. అవి చాలా ప్రాధమికమైన స్వభావం కలవి. బాహ్యమైన ఏ ఒత్తిడికి అవి లోను కావు. అణువుల సంఖ్య అనంతం. ఇవి ఒక నిర్దిష్టమైన రూపంలో సయోగం చెందుతాయి. పరస్పరం నిర్దిష్టమైన సంబధాలు కలిగి వుంటాయి. కలయికల వలననే సృష్టిలోని అన్ని వస్తువులు ఏర్పడుతున్నాయి. అణువులు భౌతికమైనవి. నిజమైనవి.

జగత్ సృష్టికంతా అణువులు మూలమని అంగీకరించటంతో పాటు డెమొక్రటస్ వాటిలో చలనాన్ని కూడా గుర్తించాడు. ఇందులోనూ యితడే ఆద్యుడు. అణువుల చలనానికి ఒక నియమం అంటూలేదని, అన్ని వైపులకూ అవి ప్రకంపన చెందుతూ వుంటాయని డెమొక్రటస్ భావించాడు అణువుల నిరంతర చలనం వలననే ప్రపంచంలో ప్రతిదీ సృష్టించబడు తుందనీ, తిరిగి నశిస్తుందనీ చెప్పడంలో సరియైన శాస్త్రీయ అధ్యయనానికి డెమొక్రటస్ మార్గదర్శకుడయ్యాడు.

(Democrutus also assumed motion to be the basis of all things, specifically, a strait, line motion of atoms)

డైటస్ లుక్రీషియస్ కారస్ (క్రీ॥పూ 99-55) రోమన్ తత్వవేత్త డెమొక్రటస్ ఎపిక్యూరస్ శిష్యుడు.

లుక్రీషియస్ తత్వశాస్త్రంలో ప్రాచీన కాలంనాటి అణు భౌతిక వాదం అత్యున్నత స్థాయి నందుకున్నది. వస్తుస్వభావం అని అతడొక గేయం రచించాడు. అందులో జగత్తును గురించిన అణు సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అణువులూ, శూన్యమూ- ఈరెండు ప్రపంచంలో ఉన్నాయి. అణువులు ఆకారంలోనూ, పరిమాణంలోనూ, బరువులోనూ వేర్వేరు విధాలుగా వుంటాయి. వేర్వేరు అణు సముదాయాలు, శూన్యంలో నిరంతరం పరిభ్రమిస్తూ ఉన్నందున, ఈప్రపంచంలోని వైవిధ్యమంతా ఏర్పడుతున్నది. దేశము, కాలము-వీటిని గురించి లుక్రీషియస్ ఆసక్తి జనకములైన అనేక సిద్ధాంతములను ప్రతిపాదించాడు. పదార్థానికి విశ్వవ్యాపితమైన చలనమున్నదనే అంశాన్ని నిరాకరించాడు. బాహ్య ప్రపంచం నుండి విజ్ఞానాన్ని సంపాదించటమనే రెండవ తాత్విక మూల సూత్రాన్ని కూడా భౌతిక సూత్ర పరంగా లుక్రీషియస్ వాఖ్యానించాడు. ప్రాచీన కాలం నాటి నాస్తికులలో లుక్రీషియస్ అగ్రగణ్యుడు. ప్రకృతి తన ఆంతరంగిక సూత్రాల కనుగుణంగా అభివృద్ధి చెందు తుందని, ప్రకృతిని వివరించటానికి అతీత శక్తి ఏదీ అక్కర లేదని తెలియ జేశాడు. ప్రజలే దేవుళ్ళను సృష్టించుకొన్నారు అని అతడన్నాడు.

పైథాగరస్ సోక్రటీస్ ప్లేటో

గ్రీకు భావ వాదులలో క్రీ॥పూ 580-500 మధ్య కాలంలో పైథాగరస్, క్రీ॥పూ 469-399 మధ్య కాలంలో సోక్రటీస్ గొప్పవాళ్ళు పైథాగరస్ తత్వవేత్త, గణితశాస్త్రజ్ఞుడు కూడా. పైథాగరస్ సిద్ధాంతాలలో ప్రపంచానికి సంభందించిన పౌరాణిక మూఢ విశ్వాసాలు వుండేవి. పైథాగరస్ దృష్టిలో ఈ జగత్తు అగ్నిని విరజిమ్మే ఒక గోళాకారవస్తువు పరిసరముల నుండి ఈగోళాన్ని వేరు చేసే ఈశూన్యత వల్లనే వస్తువుల వైవిధ్యం, విభజన ఏర్పడుతున్నాయని పైథాగరస్ నుడివాడు. గణిత శాస్త్రంలో కూడా పైథాగరస్ సంఖ్యను ఒక స్వతంత్ర భావంగా రూపొందించాడు. సంఖ్యకు అతీత శక్తులు ఆపాదించటం కూడా జరిగింది.

రాజకీయంగా పైథాగారస్ పాలకవర్గాలను సమర్థించాడు. అప్పటికి గ్రీకులలో ప్రచారమైన ప్రజాస్వామ్యాన్ని యితడు వ్యతిరేకించాడు.

సోక్రటీస్ గ్రీకు తత్వవేత్తలలో ప్రసిద్ధి పొందిన వాడు. వేరు వేరు వస్తువులలోని సామాన్య విషయాన్ని గుర్తించటమే సోక్రటీస్ దృష్టిలో జ్ఞానానికి మూలం. సోక్రటీస్ తన రాజకీయ విశ్వాసాలను దైవేశ్చ ప్రాతి పదిక పైకాక, సహేతుకతా వాదం ఆధారంగా నిరూపించుటకు ప్రయత్నించడంతో బానిసలయజమానులు ఆయన తత్వశాస్త్రాన్ని విమర్శించారు. అందు చేత బలవంతంగా ఆయన చేత విషంతాగించారు. సహేతుకత, విమర్శనాత్మక ఆలోచనలన్ని తమకు వ్యతిరేకంగా ఆయుధాలుగా మారగలవని ఆ ప్రాచీన కాలంనాటి ప్రతినిధుల వర్గం సైతం అర్థం చేసుకొన్నారు. సోక్రటీస్ మరణం గ్రీకు సామాజిక వ్యవస్థలో పెద్ద సంచలనం కలిగించింది.

భౌతికవాద తత్వశాస్త్రాన్ని డెమొక్రటస్ ఏ విధంగా సమీక్ష చేసి ఒక రూపాన్ని తీసుకువచ్చాడో, ప్లేటో భావవాద తత్వశాస్త్రానికి కూడా ఒక రూపం తీసుకువచ్చాడు. భావప్రపంచాన్ని ప్లేటో శ్లాఘించాడు. ప్లేటో ప్రకృతికి మానవుని ఆవిర్భావానికి మూల కారణంగా ఒక సృష్టికర్తను ఊహించాడు. మొత్తంగా ప్రాచీన గ్రీకు తత్వశాస్త్రంలో డెమొక్రటస్ భౌతికవాద శిబిరానికి, ప్లేటో భావవాద శిబిరానికి ప్రతినిధులుగా వ్యవహరించారు. ఆ తరువాత అభివృద్ధిచెందిన భౌతిక, భావవాదాలకు దగ్గర దగ్గరగా వీరుమూల కర్తలయ్యారు.

అరిస్టాటిల్

క్రీ॥పూ॥ 384-322 సం॥ల మధ్యకాలంలో వచ్చిన అరిస్టాటిల్ తమ తర్కశాస్త్ర నిర్మాణం ద్వారా దార్శనికులలో అత్యున్నత స్థానాన్ని పొందగలిగారు. అరిస్టాటిల్ తార్కిక రచనలు 3 భాగములుగా ఉన్నాయి. 1) పూర్వ విశ్లేషణలు (Prior enalysis) 2) అపర విశ్లేషణలు (Posterior enalysis) 3) అంశాలు, పాండితి విని గమనాలు (The topies and

Sophisties) lenchi గా విభజించాడు. అరిస్టాటిల్ ప్రయోగించిన Catapeories, De inter pretatione సమానార్థకాలు, పదము, ప్రతిజ్ఞా వాక్యాలు వీటినిగురించిన ప్రాథమిక పరిజ్ఞానము న్యాయ ప్రయోగాలను అర్థంచేసుకోవడానికి అవసరం. అరిస్టాటిల్ తర్కము ఆలోచనను అర్థం చేసే శాస్త్రము. ఆలోచన ఆకారము లేనిది. మాటల రూపంలో దానికి ఆకారం వస్తుంది. మాటలు అనేక సంకేతాలతో వ్యక్తమయ్యే ఆలోచనలను తర్కము అధ్యయనంచేస్తుంది. ఆలోచన అంతరంగికము, అవ్యక్తము. ఒకరి ఆలోచన తెలుసుకోవాలంటే మాటల రూపంలోనో క్రియా రూపం లోనో వెలువడాలి. కాబట్టి మాటలు అనే సంకేతాలతో బాహ్యంగా వ్యక్త మయ్యే ఆలోచనే అధ్యయన విషయం. తర్కశాస్త్రానికి కావలసింది మాటలు అర్థాలు కావు. వాటి ద్వారా వ్యక్తమయ్యే ఆలోచన. తర్కానికి కావలసింది ఆలోచన యొక్క పూర్వపరాలు కాదు. సత్యాన్ని సాధించ టానికి ఆలోచన ఎంత వరకు సహాయకారిగా వుంటుందనే విషయమే. ఆలోచన ఏదో ఒక విషయం గురించి సాగుతుంది. ఆలోచనకు పదార్థ రూపం ఏదో ఒక రూపంలో వుంటుంది.

| | | | |
|---|---|---|---|
| 1) | ద్రవ్యము (Substance) | ఉదా॥ | మానవుడు |
| 2) | గుణం (Quality) | ,, | తెలుపు |
| 3) | పరిమాణం (Qwantity) | ,, | 5' - 1" |
| 4) | సంబంధము (Relation) | ,, | రెండింతలు |
| 5) | ప్రదేశము (Place) | ,, | కళాశాల |
| 6) | సమయము (Time) | ,, | నిన్న |
| 7) | క్రియ (Activity) | ,, | నవ్వుతున్నాడు |
| 8) | నిష్క్రియ (Passivity) | ,, | దేనిని అనుభవించటం లేదు |

అరిస్టాటిల్ ప్రతిపాదించిన ప్రతి సిద్ధాంతంలోనూ పదార్థాలు తటస్థపడు తూనే వుంటాయి. అరిస్టాటిల్ యొక్క ఆలోచన ద్రవ్యం వస్తువు. అరి స్టాటిల్ వస్తువును యదార్థాలుగా గ్రహించాడు. ఈయన సిద్ధాంతం ప్లేటోకు విరుద్ధం. ఇంతేగాక అరిస్టాటిల్ రాజ్య భావం మీద కూడా స్పష్ట మైన అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు. రాజ్యము సాంప్రదాయంగా వచ్చింది కాదు, అది మానవ స్వభావంలోనే పాతుకొనిపోయి ఉన్నదని

చెప్పి రాజ్య నైతిక తాత్విక ఆలోచన(Political thought)కు చాలా సేవ చేసినాడు. మానవ జీవితం మూల స్వభావాన్ని బట్టిగాక, మానవ జీవితము ఏలక్ష్యాలపై ప్రయనిస్తోందో ఆలక్ష్యాల స్వభావం మీద రాజ్య స్వభావం ఆధారపడుతుందని భావించినాడు.

మానవుని సంకల్పిత చర్యవల్లనే రాజ్యాకృతి నిర్మాణము అభివ్యక్తి అయినాయి. అరిస్టాటిల్ భావించిన రాజ్యము సమాజాలకే సమాజము. జీవితంలో కుటుంబానికి ప్రత్యేక స్థానం ఉన్నది. కుటుంబమే కాక రాజ్యములో అనేక సంఘాలున్నాయి. మతంలోను, వృత్తి పరంగా ఏర్పాటైన సంఘాలలోను, ఇంకా అనేక ఇతర సంఘాలలోనూ, మానవుడు తనకు తాను గాను, ఇతరుల వత్తిడి వల్లను సభ్యుడవుతున్నాడు. కనుక మానవుడు రాజకీయ జీవిగానే కాక, సంఘజీవిగా గూడ అరిస్టాటిల్ గుర్తించాడు. మానవులను నీతిమంతులుగా చేసే విధ్యరాజ్యాధీనంలో వుండవలె కాని, చర్చిపని కాదన్నాడు.

మానవ జాతిలో ఉద్భవించిన అత్యుత్తమ మేధావులలో అరిస్టాటిల్ ఒకడు. కాగా బానిస సమాజ పరిధులు అతనిని కూడా పరిమితం చేశాయి. కనుకనే ప్రజలలో బానిసలు, బానిస యజమానులు అను రెండు వర్గాలు ఉండటం సమర్థనీయం అనేభావాన్ని అరిస్టాటిల్ వెలిబుచ్చాడు. పుట్టుకతోనే బానిసగానో స్వేచ్ఛా పౌరుడుగానో ఒకవ్యక్తి జన్మిస్తాడని అతని భవిష్యత్తంతా అతని పూర్వజన్మలోనే నిర్ణయించబడుతుందని అరిస్టాటిల్ వాదన. బానిస యజమానులు ప్రజాస్వామ్యాన్ని సమర్థించిన అరిస్టాటిల్ నిరంకుశత్వాన్ని కొద్దిమంది ప్రభువుల పరిపాలనను ఖండించాడు. సమాజంలోని మధ్యతరహా ప్రజలకు సంబంధించిన ప్రజాతంత్ర వ్యవస్థను కలిగిన బానిస సమాజం అరిస్టాటిల్ దృష్టిలో ఆదర్శ ప్రాయమైనది.

అరిస్టాటిల్ తత్వశాస్త్రంలో పరస్పర వైరుధ్యాలు వున్నందునే ఆ తరువాత కాలంలో పరస్పర విరుద్ధ వర్గాలు, శక్తులు ఆయన సిద్ధాంతాన్ని స్వప్రయోజనానికై వినియోగించుకొన్నారు.

అరిస్టాటిల్ బోధనలలోని భౌతికవాద ధోరణులు మధ్యయుగాలలో శాస్త్రజ్ఞాన అభివృద్ధికి, సాంస్కృతిక పునరుజ్జీవనానికి దోహదం

చేశాయి. అయిన బోధనలలోని భావవాద ధోరణులను మత ప్రచారకులు వినియోగించుకొని నిర్జీవమైన శుష్క వేదాంతాన్ని రూపొందించారు

మధ్యయుగాల్లో - భౌతిక వాదచింతన

మొదటి 10శతాబ్దాలు క్రైస్తవ ప్రపంచం రోమన్ రాజ్యం క్రింద ఉండేది. ఆనాడు ఆర్థిక, సాంఘిక వ్యవస్థనే కాకుండా మేధా సంపన్నత మొత్తం చర్చి తాకట్టులోనే వుండేది. చర్చి ఆధీనంలోనే వారు తమ వ్యాపారాలను ఆసియా, ఆఫ్రికాలను అరబ్ ముస్లీములు తమ క్రిందకు తెచ్చుకోగలిగారు. వారి ఆధిపత్యం స్పెయిన్ దాకా విస్తరించింది. తూర్పు దేశాలు వారికి వ్యాపార నిధులుగా కూడా ఉపయోగపడ్డాయి.

ప్రాచీన గ్రీకు తాత్వికుల సంపద రోమన్ సామ్రాజ్యాధి పత్యం నుండి విముక్తి కాగలిగిన నాటినుండే నూతన నాగరికత ఉత్తేజ కరంగా ప్రారంభమైంది. గ్రీకుల సాంస్కృతిక సంపద అరిస్టాటిల్ రచనా జగత్తులో సంకలితమై అరబ్బుల, యూదుల మేధో నిధుల్లో నిక్షిప్తం చేయబడినది. ఐరోపాలో అరిస్టాటిల్ విజ్ఞాన సంపద ప్రభావం 12 శతాబ్దం పూర్తయ్యే వరకు కొనసాగుతూనే వచ్చింది. 12 శతాబ్దానికి యూదు క్రైస్తవులు అరిస్టాటిల్ తర్కాన్ని మాత్రమే అవగాహన చేసుకో గలిగారు. 12 శతాబ్దం తరువాత ఐరోపా దేశాలకు అరిస్టాటిల్ తత్వశాస్త్రం. అరబ్బుముస్లింల ద్వారా రాగలింగింది.

ప్రాచీన యుగాలలో ముస్లిం ప్రపంచం గ్రీకు, యూదు, ఐగుప్తీయులు, అస్సీరియులు, పర్షియన్ల సంస్కృతులకు సమీకృత పీఠంగా వ్యవహరించింది. విభిన్న మత సంస్కృతులకు వారు వివిధ వాదాలలో ఒకరి నొకరు విభేదించుకొని ఆ తరువాత ఒకరి నొకరు అర్థం చేసుకొని మిశితమయ్యే కొద్ది ఈ అజ్ఞాన గోడల్ని కూలగొట్టి సమన్వయం కాగలిగారు. ఇది అరబ్బుతత్వ వేత్తల విజయుం అని చెప్పవచ్చు.

ఆరోజుల్లో "ఎవరోయస్" (Averroes) అనే ఒక తాత్వికబృందం హేతువాద దృక్పథం కలిగి వుండేది. వీరి ఆలోచనల ప్రభావం ఐరోపాలోని మధ్యయుగాల మేధావులపై బడినది.

13వ శతాబ్దం క్రొత్తయుగానికి నాందిపలికింది. ఆర్థిక జీవనంలో వచ్చిన మార్పు, వ్యాపార పరిశ్రమల పునరుద్ధరణ నూతన శాస్త్రీయ దృక్పధాన్ని కలిగించ గలిగాయి. మధ్యయుగాల మొదటి దశలో పాలక వర్గాల కిరాతకత్వానికి విసుగు చెంది చర్చి సాంప్రదాయ ఆధిపత్యానికి కలత చెంది, ఈ రెండు వ్యవస్థలకు వ్యతిరేకంగా విజ్ఞానాన్ని సంతరించుకోవడాన్ని ప్రజలు ప్రారంభించారు. అరబ్బుల తత్వశాస్త్రం ఈ కాలంలో వీరి తాత్విక దృక్పధాన్ని పెంచింది. మత అధ్యయనపరుల అసంఘటితవాదాన్ని ఎదుగుతున్న శాస్త్రీయ విజ్ఞానం అధిగమించ గలిగింది. ఈ శాస్త్రీయ విజ్ఞానం మత మూఢ విశ్వాసాలను ఒక దాని తరువాత ఒకటి జయించుకొంటూపోయింది. మూఢవిశ్వాసాల పునాదులు కదిలిపోయాయి. ప్రపంచ పరిణామానికి కీలకమైన మార్పు యిక్కడే జరిగింది. విశ్వాసం ప్రశ్నకు గురైంది. దైవం, స్వర్గం, నరక మనే అన్ని మత విశ్వాసాలు ప్రశ్నించబడ్డాయి. మతం మూఢవిశ్వాసాలు ప్రకృతి శాస్త్ర చర్చకు గురై కదిలించబడ్డాయి. అయితే మత విశ్వాసాలు మాత్రం చర్చిల బలిపీఠాలకు నిక్షిప్తంచేయబడి శాస్త్ర విజ్ఞాన ప్రకాంతులు తగ్గినపుడు చీకటి దొంతరులులా ప్రజలను కమ్ముకునేవి. అయితే విజ్ఞాన శాస్త్ర పరిణామాన్ని ఈ చీకటి తెరలు ఆపలేకపోయాయి. ఎందుకంటే యీ పరిణామం ఎప్పటికప్పుడు సాంఘిక శక్తులను సృజించుకోగలిగింది. ఈ క్రమంలోనే కార్యకారణ వివేచన పెరిగింది. విశ్వాసానికున్న ఎల్లలను పగలగొట్టి ఈ శాస్త్రీయవాదం ముందుకు చొచ్చుకు సాగింది. మరల చర్చి ఈ హేతువాద భావాన్ని తట్టుకోడానికి 'ప్లేటో'ను ఆశ్రయించింది. ఎట్టకేలకు ఈ నూతన సాంఘిక శక్తులు చర్చి దాడికి ఎదురు నిల్చి తమ శాస్త్రీయ సత్యాల ద్వారా తమ పునాదులను గట్టి జేసుకోగలిగింది.

ఈ యుద్ధాలలో ముందు నిలచి పోరాడినవాడు "రోజర్‌బేకన్" 12వ శతాబ్దంతంలో నూతన శాస్త్రీయ శక్తులకు ఇతడు నాయకత్వం వహించ గలిగాడు. ఇంతవరకు మతం ఎల్లలు మధ్య తిరుగాడుతున్న హేతువాదం ఇతని ప్రభావంతో మతం ఎల్లలు దాటి ముందుకు రాగలిగింది. ఇతడు గణితం ప్రయోగమే విజ్ఞానానికి మార్గమని బోధించాడు. విజ్ఞానాన్ని కారణం ద్వారా, ప్రయోగంద్వారా నిరూపించాలన్నాడు.

ఇతడు హేతువాద ఉద్యమ సంధాని పెంచాడు. 14వ శతాబ్దంలో ఆవిర్భవించిన అక్హాము(Ackham) హేతువాదాన్ని భౌతిక వాదంగా మలచగలిగాడు. ఆధునికభౌతిక వాదానికి మార్గం చూపిన వాడు ఇతడే.

విజ్ఞానయుగం ఆవిర్భావం :-

అరిస్టాటిల్ సిద్ధాంత ప్రభావం పాశ్చాత్యదేశాల మీదే కాకుండా ఆసియా ఖండం మీద కూడా ప్రసరించింది. రమారమి క్రీ॥శ 400 నుండి క్రీ॥శ 1000 వరకు ఉన్న పూర్వ మధ్యయుగం, మధ్యయుగాలలో అవతరించిన అగస్టయిస్, థియోతియస్, జాన్‌స్కాట్‌లు కొన్ని ప్రముఖమైన తాత్విక ధోరణులు ప్రచారం చేశారు. క్రీ॥శ 1000 నుండి 1300 వరకు పాండిత్యవాదం నడిచింది. ఈ పాండించ్ఛ్యవాదులు క్రైస్తవ మతానికి బ్రహ్మాండంగా కొమ్ముగాసి సంపూర్ణము సమగ్రము అయిన తాత్విక సిద్ధాంతాలను రూపొందించడానికి ప్రయత్నించారు. ప్లేటో, అరిస్టాటిల్ బోధనలను క్రీస్తు బోధనలతో సమన్వయపరచడానికి పాండిత్య వాదులు ప్రయత్నించారు. ఆన్‌సెల్మ్ ( Anselm 1033-1109) థామస్ ఎక్వినస్ (Thomes Acqnines) క్రీ॥శ (1227-1274) పాండిత్యవాదులే. ఈ యుగంలో తత్వశాస్త్ర చింతన అభివృద్ధి చెందలేదు. క్రైస్తవ మతానికి గ్రీకు తత్వానికి సామరస్యం సాధ్యమా లేక రెండు పరస్పర విరుద్ధాలా అనే సమస్య చుట్టే ఈయుగం పరిభ్రమించింది.

డన్స్‌స్కాటస్ (Dunis scatus), విలియమ్స్ ఆకమ్ (William-Acklam) ల తాత్విక సిద్ధాంతాలలో పాండిత్యవాదం శిథిలమైంది. పూర్వాచార సాంప్రదాయాల కళలు, బాషలు, సాహిత్యం, దైవ మీమాంస వీటి విమర్శతోను, పరిశీలనతోను ఈ యుగం ఆరంభమైంది. చర్చి, రాజ్యాల సంబందాల మధ్య ఘర్షణవల్ల మత ప్రభావం తగ్గింది. మతం వ్యక్తిగత జీవితానికి సంబందించిందేగాని దీనిని ఒకరు మరొకరి మీద రుద్దకూడదని చర్చ ప్రారంభమైంది. మత గురువుల, పురోహితుల అవినీతిపై జుగుప్స ప్రారంభమైంది. ఇన్ని సంఘర్షణల మధ్యలో నుండి నూతన శకం ఆరంభమైంది.

జర్మనీ దేశస్థుడైన నికోలస్, ఫ్రెంచి దేస్థుడైన డేకార్ట్ (Decart) బ్రిటిషు దేశస్థుడైన ఫ్రాన్సిస్ బేకన్ (Francis Bekhan) లు ఆధునిక తాత్విక యుగానికి పాశ్చాత్యదేశాలలో ప్రాతిపదిక వేశారు.

చర్చి ప్రభావం నుండి విముక్తమై భౌతిక, తాత్విక చింతన వేపు ప్రజల ఆలోచనలు మళ్ళాయి. పరిశుద్ధ గ్రంధం నిర్మించిన ఉక్కు గోడలు ఛేదించుకొని హేతు దృక్పథం వైపు ప్రజలు ప్రయాణించడం ప్రారంభించారు. 15 శతాబ్దంలోను నికోలస్ (NICOLUS) భూమి తిరుగుతున్నదనే నూతన సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు. 15వ శతాబ్దంలో తలెత్తిన లియోనార్డ్ (Leonard), కోపర్నికస్ (Coparnicus), గెలిలియో (Geleleo), గియోర్డినో బ్రూనో (Geordino Brune), కెప్లర్ (Keplar), న్యూటన్ (Newton) మొదలైనవారు వైజ్ఞానిక తాత్విక యుగాన్ని మతాధిపతుల నెదిరించి శక్తివంతంగా ముందుకు తీసుకు వెళ్ళారు భూమి గుండ్రంగా వుందని చెప్పినందుకు బ్రూనోని (Brune) మత దురహంకారులు మంటలలో సజీవంగా దహనం జేశారు. అనేక సందర్భాలలో పాలక వర్గాల పాశవిక చర్యల నెదుర్కొంటూ ఈ తత్వవేత్తలు శాస్త్రీయ ఉద్యమానికి ప్రాణం పోశారు సోక్రటీస్ దగ్గర నుండి బ్రూనో వరకు వచ్చిన తత్వవేత్తలు పెక్కురుని క్రైస్తవ మత పాలక వర్గం అనేక రకాలుగా హింసించింది. సోక్రటీస్‌కు విషమిచ్చి చంపడమే గాక క్రైస్తవ మతాచార్యుడుగా పేర్కొనబడ్డ అరిస్టాటిల్ సహితం సోక్రటీస్ గతి పట్టకుండా ఏథెన్స్ నుండి పారిపోయేటట్లు చేశారు. ప్రోటోగరస్ రచనలన్నీ ధ్వంసం చేసి ఆయన పారిపోయేటట్లుచేశారు. అనాక్సా కోరస్‌ను బంధించారు. డైగోనిస్‌ను హింసించారు. బైబిల్‌కి విరుద్ధంగా జెప్పిన ప్రతి తత్వవేత్తని వీరు హింసించారు. బ్రూనోని చివరకు కాల్చి చంపారు. ఈ విధంగా విజ్ఞాన యుగం భావవాదుల మతవాదుల అణచివేతలను, హింసలను ఎదిరించి తట్టుకొని నూత్న శకాన్ని రూపొందించగలిగింది. భౌతికవాదం, విజ్ఞానవాదం విజయం సాధించి చివరకు ఒక రూపాన్ని సంతరించుకొన్నాయి.

బేకన్ తాత్విక దృక్పథం గెలిలియో శాస్త్రదృక్పథం నూతన వైజ్ఞానిక యుగానికి పునాదులు వేశాయి.[29]

---

29 Modernity began with the reanthroement of sensation in science with Galilio, in Philosophy with Becon. The astronomen multiplied the senses with instruments. The Philosopher chastened

జేకన్ ఆలోచనలను మరింత శక్తివంతంగా ముందుకు తీసుకు వెళ్ళిన థామస్ హాబ్స్. (1581-1679) ఆధునిక తత్వశాస్త్రాభివృద్ధికి ఎంతో కృషి చేశాడు. సహజమైన వివేచన ఆధారంగా తత్వముండాలని హాబ్స్ ప్రతిపాదించాడు ఈవిధంగా సాంప్రదాయ బద్ధమైన అధి భౌతికము నుంచి హేతువాదాన్ని తప్పించి దానికి భౌతిక ప్రపంచంలో సరైనస్థానం కల్పించాడు. అంతేగాక ఇతను బేకన్ భౌతిక వాదాన్ని సులక్షణమైన పద్ధతిలో మలిచాడు. భౌతిక చలన సూత్రాలకు లోబడిన అనేక వస్తువులతో ప్రపంచము కూడి వుందని వస్తుజాలంలోని వైవిధ్యం, వాటి వాటి లక్షణాలలోని వైవిధ్యం భౌతిక మూలశక్తుల చలన వేగంపై ఆధారపడి వుంటుందని హాబ్స్ వివరించాడు.

డెకార్ట్ తత్వంలో అటు ఇటు గాని పాండిత్య అధి భౌతిక వాదాన్ని, కేవలం ద్వంద వాదాన్ని విమర్శిస్తూ, హాబ్స్ ప్రాధాన్యత పొందాడు. అయితే అన్ని రంగాలను ఆవరించిన అతని తత్వం స్వతంత్రం గానే అభివృద్ధి చేశాడు. "అంతర్గతభావాలు" అనే సిద్ధాంతాన్ని తృణీకరించి డెకార్టుకు ఎదురు తిరిగాడు. ఏదైన చర్యగాని, మార్పుగాని చలనం అంటారు. ఆలోచన ఒక విధమైన చర్య. కనక అది కూడా చలనంలో భాగమే. కనక జీవరాశిలో అదొక చలన విధానం. ఆలోచనా రీతుల సముదాయమే మనస్సు. శరీరానికి భిన్నంగా మనసు వున్నదనడం పాండిత్య వాదుల గుప్త విద్యగా విమర్శించాడు. ద్వంద్వ విధానం పై అతడు ద్వజమెత్తి, అధి భౌతిక వివేచనా వాదాన్ని విమర్శిస్తూ, మానసిక

---

reason with observation, and suppoened the most served deductions Novumorganum first of all, here logic is as billiand as a dnal. Reasening becames an adventure and a conquest and Philosophy is a detective story in which the villain is the hunted truth. What epigrams and what wisdom! Consider the very begining of the book. Man as the minister and interpreter of nature, does and understand as much as his observation on the order of nature........permit him, and neither knows nor is capable of more" was there ever a completer declaration of war on all mysticism, obscurantism, and pedantry? This was "The bell that called the with together" and sounded the tocism of the Renaisance.

( The Pleasures of Philosophy ) Will Durant. page-17

కృతిలో వివేచనను కూడా దయ్యబట్టాడు. "ట్రీటైజ్ ఆన్ హ్యూమన్ నేచర్" అనే గ్రంథంలో మానవుడి మనస్సుకు సంబంధించిన క్రొత్త సిద్ధాంతాన్ని విశ్లేషించాడు. ప్రకృతిలో వివేచనకు మానవునిలో వివేచనతో సంబంధాన్ని చూపాడు. ప్రకృతి నియమ భావానికి మానవతను సమకూర్చిన హబ్స్ క్రైస్తవ మత జ్ఞానంలోని దైవాన్ని తొలగించాడు.

హబ్జ్ యాంత్రిక భౌతిక వాదాన్ని అభివృద్ధి చేయడమే గాక తత్వశాస్త్రాన్ని, ప్రకృతి విజ్ఞానశాస్త్రాని సన్నిహిత పరచుటకు కృషిచేశాడు. ఆ తరువాత తత్వశాస్త్ర చరిత్రలో ప్రసిద్ధిగాంచిన స్పినోజా (1632-1677) స్వీయ సృష్టికారణమైన ఏకైక పరమ పదార్థంగా ప్రకృతిని పరిగణించాడు. ఆ తరువాత ప్రసిద్ధి చెందిన తత్వవేత్త జాన్‌లాన్ అనే ఆంగ్ల భౌతిక వాద తత్వశాస్త్రవేత్త బేకన్ హాబ్స్‌ల భౌతిక వాదాన్ని ముందుకు తీసుకు వెళ్ళాడు. ఇంత వరకు భౌతిక తత్వశాస్త్రానికి విజ్ఞాన వాదానికి ప్రాతినిధ్యం వహించెను. కోపర్నికస్, బ్రూనో, గెలిలియో, హాబ్స్, స్పినోజా, జాన్‌లాక్‌లలో భౌతిక వాద దృక్పథం స్పష్టంగా గోచరిస్తున్నప్పటికి అక్కడక్కడ కొన్ని భావవాద ధోరణులు కూడా కన్పించాయి. అయితే ఆతరువాత అభివృద్ధిజెందిన గతితార్కిక భౌతికవాద సూత్రానికి పునాదులు వీళ్ళలో వున్నాయి. ఈ భౌతికవాద తత్వశాస్త్రాన్ని బిషప్ జార్జి బెర్కిలీ (1685-1753). డేవిడ్ హ్యూమ్[1] (1711-1776) లు వివేచనా రహితంగా ఎదిరించారు. బర్కిలీ పదార్థాన్ని నిరసించి మనస్సుకు ప్రాధాన్యమిచ్చినాడు. "ఉండటమంటే చూడబడటమే' (To beis tobe perceived) అన్నాడు. అంటే బాహ్య ప్రపంచంలో మన మనస్సు చేత చూడబడినదే సత్యమవుతుంది. మనస్సులో లేకుండా పదార్థానికి ప్రత్యేక సత్తావుండదు. అంటే వస్తువు యొక్క ఉనికి మవస్సుమీద ఆధారపడి వుంటుంది. ఇతని సిద్ధాంతము ఆత్మాశ్రయ భావవాదము (Subjective idialism) ఈ విధంగా మానసిక అనుభవానికి ప్రాధాన్యమిచ్చినాడు. అనుభవ యోగ్యమైన మానసిక భావమంటే మానసిక భావాన్ని ప్రపంచంలో చూడటమే. ఇతడు బాహ్యపదార్థాన్ని లాక్ అంగీకరించిన ప్రాథమిక

1. ఆంగ్లతత్వవేత్త

గౌణ గుణాలిస్తూ నిరాకరించాడు. (The cbsolute existance of sens-able objects in themselves or with out the mind) [30] డేవిడ్ హ్యూమ్ తన స్వీయాత్మక భావవాదంతో భౌతికవాదాన్ని ఖండించడానికి ప్రయత్నించాడు. భారత దేశంలో శంకరాచార్యుల మాయా వాదానికి బర్కిలీ దగ్గరగా వుంటాడు. భారత దేశంలో అభివృద్ధి చెందిన భౌతిక వాద ఉద్యమాల మీద శంకరాచార్యులు చేసిన దాడినే బర్కిలీ పాశ్చాత్య భౌతికవాదం మీద చేశాడు.

కాంట్ అతీంద్రియ భావవాదం :

ఇమ్మాన్యువల్ కాంట్ (Immanuval Kant 1724-1804) తత్వశాస్త్రంలో ఒక విప్లవాన్ని తెచ్చాడు. కాంట్ 1755 ప్రాంతంలో కేనిస్బర్ విశ్వవిద్యాలయంలో ప్రైవేట్ లెక్చరర్‌గా వుండి అక్కడ భౌతిక శాస్త్రాన్ని, గణిత శాస్త్రాన్ని. తర్క శాస్త్రాన్ని, అధి భౌతిక శాస్త్రాన్ని, నీతి శాస్త్రాన్ని, భూగోళ శాస్త్రాన్ని, మానవ శాస్త్రాన్ని బోధించేవాడు 1770లో తర్క శాస్త్ర, అధిభౌతిక శాస్త్ర అధ్యక్షుడై 1797లో ఉద్యోగ విరమణ చేసే వరకు వాటిని బోధించాడు. కాంట్ తన పరిశోధనాత్మక వివేచనతో నూత్న దృక్పథాన్ని రూపొందించాడు. కొపర్నికస్ ఏవిధంగానై తే అంతకు ముందుంచే భూమికేంద్ర సిద్ధాంతాలను ఖండించి సూర్యుని చుట్టూ భూమి తిరుగుతుందని, భూమి గుండ్రముగా వుందనే సత్యాన్ని నిరూపించాడో, కాంటు కూడా ఆధునిక తత్వశాస్త్రములో ప్రధానములైన హేతువాదాన్ని, అనుభవ వాదాన్ని, సంశయ వాదాన్ని సమన్వయం చేయడానికి పూనుకొన్నాడు. కాంట్ తన తత్వశాస్త్రాన్ని విమర్శనాత్మక అతీంద్రియ భావవాదం అన్నాడు. కాంట్ వాదంలో భౌతిక వాదము గోచరిస్తుంది. కాంట్ తత్వశాస్త్రాని గూర్చి లెనిన్ స్పష్టమైన నిర్వచన మిచ్చాడు "మనకు బాహ్యంగా వుండే పూర్ణవస్తువు మన భావాలకు అనుగుణంగా వుందని చెప్పినప్పుడు కాంట్ భౌతిక వాది. ఈ పూర్ణవస్తువునే అజ్ఞేయముగాను, ప్రకృతికి అతీతంగాను, పరలోక సంబంధమైనది

---

30. On Dialectical Materialisam - Marx, Engele. Lenin collected work. page- 189.

గాను వర్ణించినపుడు కాంట్ భావవాది." The principal feathu of kents philosophy is the reconcilation of Materialism with idealism, a compremise between the two, the combination with in one system hetenofenions and contnary philosophical trends. when kant assumed that same thing out side us, a thing-in-itself, corresponds to out ideal, he is a meterialist. When he declares the thing-in-itself to of unknowable, transcendental at, otherside he is an idealist.[31] కాంట్‌వాదంలో కొన్ని వైరుధ్యాలున్నా తత్వశాస్త్ర చరిత్రలో అది ప్రాధాన్యతను సంతరించుకొంది.

హెగెల్ - గతితర్కం

పాశ్చాత్య తత్వశాస్త్రంలో ఒక ముఖ్యమైన మలుపుకు మూలమైన గెనోర్గ్ విల్‌హెల్మ్ ఫ్రిడ్రిక్ హెగల్ 1770లో జర్మనిలోని స్టూట్‌గార్డ్‌లో జన్మించాడు టూబిగెన్ విశ్వవిద్యాలయంలో దైవశాస్త్రం, తత్వశాస్త్రం అధ్యయనంచేశాడు. తన మిత్రులైన షెల్లింగ్‌తోను హోల్డర్లిన్ కవితోను కలసి ట్యూబింజెన్‌లో ఈయన ఈశ్వర మిమాంసగురించి అధ్యయనం చేశాడు 1799లో మోనాపట్టణంలోని విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడిగా చేరాడు. 1808లో పూర్తిచేసిన ఫినోమనాలజి ఆఫ్ స్పిరిట్ (ఆధ్యాత్మక దృగ్విషమ శాస్త్రము)ని చేతబట్టుకుని బాంబర్గ్ చేరుకున్నాడు 1812 వరకు బాంబెర్గ్‌లో పత్రికా సంపాదకుడిగా పనిచేశాడు ఆతరువాత ఆయన హైడల్ బర్గ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా చేరాడు. ఆయన ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ ఫిలసాఫికల్ సైన్స్ అనే ప్రసిద్ధగ్రంథాన్ని రచించాడు అప్పటికి ఈయనకు సాహిత్యంలో గోథెకు సంగీతంలో బీథోవెన్‌కు ఉన్నంత ప్రఖ్యాతివచ్చింది.

హెగెల్ దార్శనిక భావన క్లిష్టతరంగా ఉండేది హెగెల్ దృష్టిలో తత్వ శాస్త్రము అధిభౌతిక శాస్త్రము రెండూ ఒకటే భావములు స్థిరమైనవి కావని అవిఘర్షణలో మారుతూ వుంటాయని హెగెల్ వ్యాఖ్యానించాడు హెర్క్యులేటస్ అన్ని ఘటనలకు వైరుద్యమే మూలమని వివరించగా హెగెల్

31. LENIN collected works Volume - 14 page-198 Progress pablishas Mascow (1977)

వైరుధ్యాన్ని అన్ని సంఘటనలను కదలించే శక్తిగా పేర్కొన్నాడు. హెగల్ తాత్వికదృక్పథంలో వైరుధ్యం యొక్క పాత్రను వివరిస్తూ నికోలాయి బుఖారిన్ "The basis of all things is therefore the law of change, the law of canstant neotion. Two Philosphers perticularly (the ancient Heraclitus and the Modern Hegal as we have already Seen) formulated this law of change, but they did not stop there. They al so set up the question of the manner in which the process operates. The answer they discovered was that changes are produced by constant internal contradiction, internal struggle. Thus he raclitus declred; " conflict is the mother of all happenings. " while Hegel said " contradiction is the power that Moves things"

హెగెల్ తత్వశాస్త్రంలో వైరుధ్యం ఒక ప్రధాన పాత్రను వహించింది. హెగెల్ భావవాది. ఆయన గతితర్కాన్ని ప్రతిపాదించాడు. ఈ ప్రపంచ మంతా నిరంతరం చలన శీలమైందని, పరిణామాత్మకమైనదని, ప్రగతిశీలమైనదని ఆయన పేర్కొన్నారు. ప్రగతిశీలమైన ప్రతిదీ వైరుధ్యాలతో కూడుకుంటుందనీ, వైరుధ్యం ప్రగతికి మూలమని హెగెల్ వివరించాడు. వైరుద్యాలను సమన్వయపరచి వాటి గతిని నిర్ణయించే విధానమే గతితార్కము అని హెగెల్ పేర్కొన్నారు.

హెగెల్ యొక్క ఈ గతితార్కిక భావవాదాన్ని మార్క్స్ తన గతితార్కిక చారిత్రక భౌతికవాదానికి సమన్వయం చేసుకోగలిగాడు. అందుకే ఏంగిల్స్ "మానవ ఆలోచన కార్యాచరణ ఫలితంగా ఏర్పడే అన్ని అంశాల శాశ్వత సత్యానికి చావు దెబ్బగొట్టడంలోనే హెగిల్ మస్ తత్వశాస్త్రము యొక్క నిజమైన ప్రాధాన్యత విప్లవ స్వభావం ఇమిడివున్నవి. అని వ్యాఖ్యానించాడు. అంతేగాక ఏంగిల్స్ హెగిలియన్ తత్వశాస్త్ర పద్ధతిని దాని విస్తారమైన పరిధిని గూర్చి వ్యాఖ్యానిస్తూ, "హెగెలియన్ తాత్వికపరిశీలనా పద్ధతి, అతఃపూర్వమున్న ఏ పద్దతి కూడా అధ్యయనం చేయనంతటి విస్తారమైన పరిధిని ఆవరించింది. ఈరంగంలో అపారమైన జ్ఞాన సంపదను పోగుచేసింది. ఈనాటికి ఇదిసంభ్రమాశ్చర్యాలను కలిగించే విషయం మానవ దృగ్విషయ శాస్త్రము, తర్కం ప్రకృతి సంబందమైన తత్వశాస్త్రం, మానసిక తత్వశాస్త్రం, అందులో తిరిగి చారిత్రక ఉపవిభా

గామైన చారిత్రక తత్వశాస్త్రం, హక్కుల తత్వశాస్త్రం, మతతత్వశాస్త్రం, సౌందర్య తత్వశాస్త్రము, ఇలా అనేక విభాగాలలో హెగెల్ కృషిచేశాడు. వీనిలోని అంతర్గత అభివృద్ధి సూత్రాన్ని కనుగొనేందుకు, నిరూపించేందుకు శ్రమించాడు."

హెగెల్ గతితర్కంలో ఉన్న భావవాద పిడివాదాన్ని మార్క్స్ ఏంగిల్స్, తీవ్రంగా విమర్శించారు. హెగిలియన్ సాంప్రదాయికవాదుల్ని వీరు తమ ప్రతికూల శాస్త్రీయవాదంతో ఎదుర్కొన్నారు. హెగెల్ తన సిద్ధాంతాలలో ప్రతిపాధించిన "వాస్తవమైన ప్రతిది హేతుబద్ధమైన ప్రతిదీ వాస్తవమైనది." అనేసూత్రాన్ని ఏంగిల్స్ నిర్దాక్షిణ్యంగా విమర్శించాడు. ఈ సూత్రంలో హెగెల్ యధా తధా పరిస్థితి సమర్థిస్తున్నాడని మూడవ ఫ్రెడరిక్ విల్‌హెల్మ్ కాలంలోని నిరంకుశత్వానికి పోలీసు ప్రభుత్వానికి తాత్విక ఆచార్యవచనము ఇస్తున్నాడని వ్యాఖ్యానించాడు.

హెగెల్ మానవస్వభావాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ మానవుడు అరిస్టాటిల్ చెప్పినట్లుగానే రాజకీయ సామాజిక జీవి అని, అతని మానసిక నైతిక అభివృద్ధి తన పరిసరాల మీద ఆధారపడి వుంటుందని చెప్పాడు. మానవుని యొక్క అభివృద్ధికి పరస్పరస్నేహం ప్రేమ అనురాగాలు కూడా తోడ్పడుతాయని భావించాడు హెగెల్ స్వేచ్ఛను గురించి వివరిస్తూ ప్రపంచ ప్రగతి స్వేచ్ఛను గుర్తించడంపైననే ఆధారపడి యుందని వ్యాఖ్యానించాడు (The history of " the world is none other than the progress of the consciousness of freedom " )

హెగెల్ తత్వశాస్త్రంమీద ప్లాటో,అరిస్టాటిల్ కాంట్ ప్రభావం ఉంది.

ప్రపంచ తత్వశాస్త్ర అభివృద్ధికి హెగెల్ యొక్క సిద్ధాంతాలు శాస్త్రీయంగా అనువయించబడటంలో విజయాన్ని సాధించాయి. హెగల్ భావవాద గతితర్కాన్ని మార్క్స్ తన చారిత్రక భౌతిక వాదానికి అన్వయించుకోవడంవల్లె ఈ విజయం సాధ్యమైనది. భావాల వైరుధ్యాన్ని

అభివృద్ధిని వర్గాలపై రుద్యోలు అభివృద్ధికి అన్వయించడం ద్వారాగతితా ర్కిక చారిత్రక భౌతికవాదం రూపొంది ప్రపంచ పరిణామానికి మూలశక్తిగా వుపయుక్తమైనది. హెగెల్ ప్రభావం తాత్వికవ్యవస్థమీద కొన్ని దశా బ్దాలు కొనసాగింది. హెగెల్ మరణా నంతరం కూడా ఆ ప్రభావం తగ్గలేదు. 1830-40 ప్రాంతాలలో ఆ ప్రభావం నుండి ప్రత్యర్థులసైతం తప్పుకోలేక పోయారు. 1830-40 ప్రాంతాలలో హెగెల్ ధోరణిలో చీలిక ఏర్పడింది. వామపక్ష విభాగం యువహెగెలియన్లుగా వ్యవహరించ బడే వారు. తాత్వి కంగా వారు ఉదాసీనతను విసర్జించి అనాటి సాంప్రదాయ మతవ్యవస్థను రాజ్యాంగ యంత్రాంగాన్ని ధ్వంసంచేసేందుకై కొనసాగింది. ఈయువ హెగిలియన్ విభాగం అధికారం కోసం అర్రులుచాచిందే కాని శాస్త్రీయ సిద్ధాంత భూమికలేదు. యువహెగిలియన్లు మతంతో పోరాటడానికి భౌతిక వాదాన్ని ఆశ్రయించాల్సి వచ్చింది. వీరు ఆక్రమములో హెగిలియన్ భావవాదాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ పరిణామాన్ని ఏంగిల్స్ చాలాస్పష్టంగా వివరించాడు. యువహెగిలియన్లలో అత్యంత దృఢ త్వం కలిగినవారు, సూటిగా మతవ్యవస్థతో పోరాటం సాగించే ప్రత్యక్ష అవసరాల దృష్ట్యా ఆంగ్లో, ఫ్రెంచి భౌతికవాదం పైపు నెట్టబడ్డారు. దీంతో వారు తమ హెగెలియన్ వ్యవస్థతో సూటిగా ఘర్షణపడక తప్పలేదు. భౌతికవాదం దృష్టిలో ప్రకృతి ఏకైక వాస్తవిక విషయం హెగెలియన్ వ్యవస్థలో ప్రకృతి, అఖండ భావం యొక్క పరాయికరణ ప్రతిబింబం మాత్రమే. భావం యొక్క పతన స్వరూపం మాత్రమే ఏ విధంగా చూసినా, ఆలోచన, ఆలోచన ఫలితమైన భావం, ఇక్కడ ప్రాథమికం ప్రకృతి ద్వితీయం భావం యొక్క దయాధర్మాలపై ఆధారపడి ప్రకృతి జీవిస్తుంది. ఈ వైరుధ్యంలో వారు తప్పనిసరిగానో, లేక అనుకోకుం డానో ఇరుక్కున్నారు.

ఫాయర్‌బాక్ - భౌతికవాదం

ఈ ఘర్షణలో ఉన్న యువహెగెలియన్ వాదులకు ఫాయర్‌బాక్ (Feuer bach) 1804-72 లో రచించిన క్రైస్తవ మతసారం అనేగ్రంథం భౌతికవాధ దృక్పధాన్ని రూపొందించింది. ఈ గ్రంథం యంగ్ హెగె లియన్లలో కలిగించిన చైతన్యాన్ని గురించి ఎంగెల్స్ చాల స్పష్టంగా

వివరించారు. ఈ గ్రంథం, ఒక్క దెబ్బతో ఈ వైరుధ్యాన్ని బద్దలు
చేసింది. ఎట్టిడొంక తిరుగుడూ లేకుండా, ఈ గ్రంధం భౌతిక వాధాన్ని
తిరిగి సింహాసనంపై ప్రతి ష్ఠించింది. తత్వశాస్త్రంతో ప్రమేయం లేకుండా
ప్రకృతి స్వతంత్రంగానే అస్తిత్వంతో ఉంటుంది. అదిపునాది అ పునా
దిపైననే ప్రకృతిలో ఉద్భవించిన మన మానవులం పెరిగాం ప్రకృతికీ
మానవునికీ బాహ్యంగా ఏదిలేదు. మన ఊహాలోకంలో మతపరమైన అద్భు
తాల ద్వారా సృష్టించుకున్న ఉన్నతస్థాయి జీవులు మన సారాంశ
యొక్క అశ్చర్యకరమైన ప్రతిబింబాలు మాత్రమే దీంతో భ్రమ కాస్తా
బద్దలైంది "వ్యవస్థ" ముక్కచెక్కలై పక్కకు విసిరివేయ బడింది. మన
ఊహాలోకంలో మాత్రమే ఉన్నదని భావించబడిన వైరుధ్యం కాస్తా కరిగి
పోయింది"[32] ఫొయెర్ బాఖ్ భౌతికవాదం తత్వశాస్త్రంలో పెద్దసంచ
నాన్ని కలిగించింది ఫొయెల్ బాఖ్ భౌతికవాద ఉద్యమం హెగిలియన్
వ్యవస్థను దగ్గర దగ్గర భేదించింది. ఆలోచనకు, అస్తిత్వానికి గల సం
బంధాన్ని ప్రకృతికి భావానికి గల సంబంధాన్ని స్పష్టంచేయగలిగింది
హ్యూమ్, కాంట్‌లు ప్రతిపాధించిన భావవాద ధోరణుల్ని హెగెలె వ్యక్తీ
కరించిన భావవాద దృక్కోణాలను ఫోయెర్ బాఖ్ తన భౌతిక వాదం
ద్వారా చిత్తుగా ఖండించి స్పష్టమైన భౌతిక దృక్పదాన్ని. రూపొందించ
గలిగాడు. పదార్థం మనస్సు నుండి జనించలేదు దానికి వ్యతిరేకంగా
మనస్సే పదార్థం యొక్క అత్యున్నత సృష్టి' అని వ్యాఖ్యానించాడు
భావవాదం ఏ విదంగా అనేక దశలలో పరిణామం చెందుతూ వచ్చింది
భౌతికవాదం కూడా అనేక దశలలో అనేక రూపాలలో పరిణామం చెందుతూ
వచ్చింది. అది ప్రకృతి శాస్త్రరంగాలలో యుగ ప్రాధాన్యత కలి
ఆవిష్కరణ జరిగినప్పుడల్లా దానిరూపాన్ని అదిమార్చుకోవలసి వచ్చింది
18వ శతాబ్దిలో యూరప్‌లో వచ్చిన భౌతికవాదం యాంత్రిక భౌతికవాద
రసాయన, జీవ, జంతు, వృక్షశాస్త్రాలు ప్రాధమిక దశలోనే ఉండట
వలన యంత్రశాస్త్రం ఒక్కటే అందులో ఖగోళ, భూగోళ, ఘనపదార్థాలకు
చెందిన యంత్ర శాస్త్రం ఒక్కటే అందులోను గురుత్వాకర్షణ చెందిన
యంత్ర శాస్త్రం మాత్రమే ఎంతో కొంత నిర్దిష్టతకు చేరుకోవడం వల

32 కార్ల్ మార్క్స్ ఫ్రెడరిక్ ఎంగెల్స్
సంకలిత రచనలు - భాగం 5 పేజి - 17

భౌతిక వాదం మీద యంత్ర శాస్త్ర ప్రభావమే ఉందిగాని ఒక నిర్దిష్టమైన దశకు అనాడు భౌతిక వాదం రూపొందలేదు. "ఫాయెర్ బాఖ్" భౌతిక వాదాన్ని గురించి వివరిస్తూ ''నాదృష్టిలో భౌతిక వాదమనేది జ్ఞానమును సారం, విజ్ఞానమును సౌధానికి పునాది. అయితే మానవశరీర శాస్త్రవేత్తకు సంకుచితార్థంలో ప్రకృతి శాస్త్రజ్ఞుడైన మోల్‌స్టాట్‌కు, దానిఅర్థం వేరు; నాఅర్థం వేరు వారి దృష్టిరీత్యా, వృత్తిరీత్యా కూడా భౌతికవాదమే సౌధం. గతానికి సంబంధించి నంతవరకు నేను భౌతికవాదులతో పూర్తిగా అంగీకరిస్తున్నాను. భవిష్యత్తు విషయంలోకాదు."

ఫాయెర్ బాఖ్ ఈ నిర్వచనంలో భౌతికవాద దృక్పథాన్ని సమర్థిస్తూనే ఆయాకాలాలలో గురవుతున్న అంశాలకు సంబంధించి విభేదిస్తున్నాడు. మార్క్స్, ఎంగెల్స్‌లు ఫాయెర్ బాఖ్ భౌతికవాదంలో ఉన్న యాంత్రిక ధోరణులపైన భావధోరణులపైన విమర్శ పెట్టారు.

ఫాయెర్ బాఖ్ నుండి మార్క్స్ చేసిన కీలకపరిణామాన్ని ఎంగెల్స్ ప్రతిభావంతంగా వివరించాడు. "ఫాయెర్‌బాఖ్ కలిగించిన ఈ శక్తివంతమైన ఊపు అతనికి సైతం నిరుపయోగం గావడానికి కారణమేమిటి? అందుకొక సూటి సమాధానముంది. ఊహా ప్రపంచంలో నుండి బైటపడి వాస్తవ ప్రపంచంలో అడుగు పెట్టడానికి అతడు ప్రయత్నమే చేయడు. అలా బయుపడటమంటే అతనికి మహారోత. ప్రకృతికి, మనిషికి అతడు దృఢంగా అంటి పెట్టుకుంటాడు. కాని ఈరెండు అతనిదృష్టిలో మాటలు మాత్రమే. నిజమైన ప్రకృతిని గురించి, నిజమైన మనిషిని గురించి ఏమి చెప్పటానికి కూడా అతడు అసమర్థుడు. ఫాయెర్‌బాఖ్ ఊహా ప్రపంచంలోని మానవుడినుండి నిజమైన మానవుడి దగ్గరకు రావాలంటే మానవులను చరిత్రలో భాగస్వాములుగా చూడాలి. అలా చూడటానికి ఫాయెర్‌బాఖ్ నిరాకరిస్తున్నాడు. కనుకనే 1848 సంవత్సరం, అంటే అతని దృష్టిలో వాస్తవ ప్రపంచం నుండి పూర్తిగా తెగతెంపులు చేసుకొని, ఏకాంతవాసానికి తిరోగమించడం, ఆ ఘటనను ఫాయెర్‌బాఖ్ ఎన్నడూ గ్రహించలేదు ఇందుకు ప్రధానంగా నిందించవలసింది. అనాటి జర్మనీ లోని పరిస్థితులనే ఏదో ఒకమూల నిర్జీవంగా కాలం గడపవలసిన దౌర్భాగ్యాన్ని అపరిస్థితులు అతనికి కలిగించాయి.

ఫోయెర్‌బాఖ్ ఏ అడుగు వేయలేక పోయినాడో, ఆ అడుగు వేసి తీరాలి. ఫోయెర్‌బాఖ్ కొత్తమతానికి కేంద్ర బిందువైన ఊహాత్మక మానవుని తొలగించి, ఆస్థానంలో నిజమైన మానవులు, వారి చారిత్రక అభివృద్ధికి సంబంధించిన విజ్ఞానశాస్త్రాన్ని తెంపుచేయాలి. ఫోయెర్‌బాఖ్ దృక్పథాన్ని ఫోయెర్‌బాఖ్ కంటె ముందుకు తీసుకు పోయే ఈక ర్యాన్ని 1845లో మార్క్స్ తన "పవిత్ర కుటుంబం" గ్రంథంలో ప్రారంభించాడు"[33]

## కార్ల్ మార్క్స్- గతితార్కిక చారిత్రక భౌతికవాదం :

ఫాయర్ బాఖ్ వరకు తత్వశాస్త్రవేత్తలు ప్రకృతిని, సమాజాన్ని వివరించారేగాని, సమాజాన్ని మార్పే శక్తిగా తత్వశాస్త్రాన్ని ఉపయోగించుకోలేదు. ఈవిషయంలో మార్క్స్ ప్రతిభావంతమైన కృషిని నిర్వహించాడు. హెగెల్ గతితార్కిక దృక్పథంలోఉన్న వైరుధ్యాన్ని అభివృద్ధిని భౌతికవాదానికి, సమాజానికి అన్వయించగలిగాడు. మార్క్స్ హెగెల్ గతితార్కిక భావవాదాన్ని ఏవిధంగా ఫాయర్ బాఖ్ భౌతిక వాదానికి అన్వయించి ముందుకు తీసుకువెళ్ళాడో లెనిన్ అత్యంత ప్రతిభావంతంగా వివరించాడు.

But Marx did not stop at eighteen century materialism he developed philosophy to a high level. He enriched it with the achievements of German classical Philosophy, especially of Hagel's system. Which in its turn had led to the materialism of Feuebach. The main achieuements was doalectics; ie the Doctrine of Deveipment in its fullest, deepest and most comprehensive form, the doctrine of relativity of the human knowledge that provides us with a reflection of eternally developing matter. The latest discoveries of natural science radium, electrons, the transmutation of elements have been a remarkable confirmation of Marx's dialectical materialism despite the teachings of the bourgeois philosophers with their " new " reversions to old and decadent idealism.[34]

33 మార్క్స్, ఎంగెల్స్ సంకలిత రచనలు. భాగం-4 -పేజి.-37

34. vol-1 LENIN collected works' vol-19 page-24
progress publishers Mascow-1980

మార్క్సు 18వ శతాబ్దపు భౌతిక వాదం వద్ద ఆగలేదని ఆయన తత్వశాస్త్రాన్ని మరింత ఉన్నత స్థాయికి అభివృద్ధి చేశాడని ఆయన ఆ తత్వశాస్త్రాన్ని జర్మన్ సాంప్రదాయక తత్వశాస్త్ర విజయాలతో ముఖ్యంగా హెగెల్ తాత్విక వ్యవస్థా విజయాలతో సుసంపన్నం చేశాడని లెనిన్ వివరించాడు. అంతేగాక హెగెల్ వ్యవస్థ మళ్ళి ఫాయిర్ బాఖ్ భౌతిక వాదానికి దారి తీసిందని ఆ విజయాలలో ప్రధానమైనది గతి తర్కం అని, గతి తర్కం అత్యంత పరిపూర్ణ గంభీర సర్వ గ్రాసి అభివృద్ధి సిద్ధాంతమని నిత్య అభివృద్ధి అవుతున్న పదార్థం యొక్క ప్రతిబింభాన్ని మనకందించే మానవ జ్ఞానము యొక్క సాపేక్షతకు సంబంధించినదే మార్క్సుసిద్ధాంతమని లెనిన్ వివరించాడు.

ఇంతేగాక మార్క్సు తాత్వికభౌతికవాదాన్ని సమగ్రంగా గంభీర పరచి అభివృద్ధి చేసి మానవ సమాజ జ్ఞానాన్ని కూడా ఇముడ్చుకొనేటట్లు. ప్రకృతి జ్ఞానాన్ని విస్తృత పరిచాడని లెనిన్ వ్యాఖ్యానించాడు.

మార్క్సు రూపొందించిన గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పధం మానవ సమాజంలో ఉన్న ప్రధాన వైరుధ్యాన్ని బయటకు తీసుకు వచ్చింది. తత్వశాస్త్రం ఇప్పటివరకు సమాజాన్ని వ్యాఖ్యానించింది. కాని మార్క్సు తాత్విక సిద్ధాంతం సమాజాన్ని మార్చేశక్తిగా రూపొందింది. "మానవుని జ్ఞానం అతనిమీద ఆధారపడకుండా వున్న ప్రకృతిని ఎలా ప్రతిబింబిస్తుందో, అలాగే మానవుని సామాజిక జ్ఞానం సమాజం యొక్క ఆర్థిక వ్యవస్థను ప్రతిబింబిస్తుందని" 35 మార్క్సు సిద్ధాంతీకరించాడు.

అందు వల్లనే మార్క్సు తత్వశాస్త్రం ఆర్థికంగా అణగద్రొక్కబడుతున్న కార్మిక వర్గానికి ఒక శక్తివంతమైన సాధనాలు సమకూర్చింది.

Marx's philosophy is a consummate philophical materialism which has provided mankind, and especially the working classwith powerful instruments of knowledge. 36

35. లెనిన్ ఏరిన రచనలు. మొదటి భాగం పేజి-22
ప్రగతి ప్రచురణాలయం - మాస్కో

36. LENIN - Collected works-Vol - 19 Page - 25

మార్క్స్ తాను పెట్టుబడికి వ్రాసిన పీఠికలో ఆర్థికశాస్త్ర ప్రాధాన్యతను నొక్కి వక్కాణిస్తూ

Why because the body, as an organic whole, is more easy of study than are the cells of that body. In the analysis of economic forms, moreover neither microscopes nor chemical reagents are of nes. The force of obstraction must replace both. But in bourgeois society and commodity for of the product of labour-or the value from of he commodity is the economic cell-form. [37]

ఈ వివరణలో మార్క్స్ ఇలా పేర్కొన్నాడు.

శరీరాన్ని మనం అర్థం చేసుకోవాలంటే శరీరంలో వున్న కణాల గురించి తెలిసికోవడం కన్నా శరీరం మొత్తం గురించి తెలిసికోవడం తేలిక. ఆర్థికసూత్రాల్ని పరిశీలన చేసేటప్పుడు అతిసూక్ష్మంగా రసాయనశాస్త్ర రూపంలో మొదలు పెట్టడం వుపయోగం లేదు. భౌతికంగా పరిశీలిస్తేగాని ఉపయోగపడదు. పెట్టుబడి దారీ వుత్పత్తి విధానంలో సరుకు రూపం ధరించడానికి కారణం శ్రమ. ఈ సరుకు రూపం కణరూపంలో ఉంటుంది. పై పైన చూస్తే అలాకన్పిస్తుంది. లోతుగా చూస్తేగాని దానిలోతు తెలియదు. జీవశాస్త్రాన్ని ఎంత సూక్ష్మంగా పరిశీలించవలసి ఉంటుందో ఆ క్రమంలోనే మనం ఈ పెట్టుబడి దారీ విధానాన్ని కూడా పరిశీలించాలి." అని మార్క్స్ పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క మూలాన్ని గురించి వ్యాఖ్యానించాడు.

మార్క్స్ తత్వశాస్త్ర చరిత్రకు, సామాజిక, ఆర్థిక, రాజకీయ, శాస్త్రాలను సమన్వయం చేశాడు. మార్క్స్ రూపొందించిన గతితార్కిక చారిత్రక భౌతికవాద సూత్రాలు ప్రపంచ చరిత్రనే మార్చగలిగాయి. శ్రామిక వర్గానికి మార్క్స్ తత్వశాస్త్రం ఒక శక్తిగా ఉపయుక్తమైంది మార్క్స్ ఈ కృషిలో భాగస్వామియైన ఫెడరిక్ ఏంగిల్స్ వ్రాసిన "డైలిక్ట్స్ ఆఫ్ నేచర్" అనే గ్రంథం తత్వశాస్త్రాన్ని శాస్త్రరంగాలన్నింటికి విస్తరించ గలిగింది. మార్క్స్ కృషికి ఏంగెల్స్ సహకారాన్ని సాహచర్యాన్ని, సంపూర్ణతని చేకూర్చాడు. అందుకే వారిద్దరి కృషి

37. Capital - volume - 1 - Page - 19

సమన్వయం చేయబడి తరువాత కాలంలో వారిరువురి రచనలన్నీ కలిసి మార్క్స్ ఏంగెల్స్ రచనలుగా ప్రసిద్ధిచెందాయి.

మార్క్స్ ఏంగెల్స్ రచనలను రష్యన్ సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థకు అన్వయించటంలో లెనిన్ అద్వితీయ కృషిగావించాడు. ఒక ఉద్యమకారుడిగా పోరాట వీరుడిగా తత్వశాస్త్రంలోను, ఆర్థిక శాస్త్రంలోను, రాజకీయ శాస్త్రంలోను ఎనలేని కృషిగావించి మార్క్సు తత్వశాస్త్రాన్ని లెనిన్ అభివృద్ధిగావించాడు. ఇలాగే చైనాలో మావో మార్క్సు గతితార్కిక, భౌతికవాద సూత్రాలను తన 'వైరుధ్యాలు' అనే విశ్లేషణలో మరింతగా శాస్త్రీయతను చేకూర్చి చైనా సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థలో మార్క్స్ ఏంగెల్స్ తత్వశాస్త్రాన్ని శాస్త్రీయక్రమంలో అమలు జరుపగలిగాడు. మార్క్స్ ఏంగెల్స్ తత్వశాస్త్ర ప్రభావం ప్రపంచ వ్యాప్తంగా ప్రవహించింది, భావవాదుల,వారి పాలక వర్గాల పునాదుల్ని అనేకదేశాల్లో పునాదులంట కూల్చగలిగింది. అదేవిధంగా భారత ఉపఖండానికి కూడా మార్క్స్ తత్వశాస్త్రం ప్రసవించింది.

## భారతదేశంలో - మార్క్స్ సిద్ధాంత అన్వయ వైఫల్యం

భారతదేశంలో తాత్వికంగా చీకటియుగం కొనసాగేకాలంలోనే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఆధీనంలోకి భారతదేశం వచ్చింది.

బ్రిటిష్ వలసవాదులు భారత అగ్రవర్ణాల మతఛాందస వ్యవస్థల, వర్ణకులవ్యవస్థల జోలికి పోకుండా. భారత ఆర్థిక, రాజకీయ వ్యవస్థను వారి ఆధీనంలోకి తెచ్చుకొని భారతదేశ శ్రామికవర్గాన్ని దోచుకునే విధానాల్లోకి వేగంగా చొచ్చుకు పోయారు.

భారత దేశంలో వచ్చిన జాతీయ వాదుల్లో ముఖ్యులంతా హిందూ అగ్రవర్ణ భావవాదులే. తిలక్, గాంధీ, పటేల్ మొదలగు వారందరూ హిందూ అగ్రవర్ణ శక్తులే, వారిపోరాటానికి ఆయుధంగా వారు భావవాదాన్నే స్వీకరించారు.

జాతీయ ఉద్యమానికి ముందు జాతీయోద్యమకాలంలో నడిచిన హిందూ పునర్జీవనోద్యమాలు రాజారామ్ మోహన్‌రాయ్‌ల బ్రహ్మసమాజం, దయానంద సరస్వతి ఆర్యసమాజం, రామకృష్ణపరమహంస,

వివేకానందుల హిందూ సంస్కరణ వాదాలన్నీ హిందూమతాన్ని పున రుద్ధరించడానికే ఎక్కువకృషిచేశాయి. అవి హిందూ అగ్రవర్ణ జాతీయ వాదానికే ఉపకరించాయి.

మార్క్సు గతితార్కిక భౌతికవాద దృక్పథాన్ని భారతదేశంలో చేపట్టిన వారు కూడా పెక్కురు హిందూ అగ్రవర్ణాలకు సంబంధించిన వారే. వారు మార్క్సు ఆర్థిక రాజకీయ విప్లవాలను ప్రచారం చేసినంతగా మార్క్సు తత్వశాస్త్రాన్ని ప్రచారం చేయలేక పోయారు.

అంతేగాక పాశ్చాత్య తత్వశాస్త్రాన్ని సుదీర్ఘంగా పరిశీలించి భావవాదం పునాదులను కూల్చడానికి మార్క్సు తీసుకున్న శ్రద్ధ వారు భారత తత్వశాస్త్రంలో భావవాద, భౌతికవాద పరిశీలనమీద భారతదేశం లోని తాత్విక సాంఘిక ఆర్థికరంగాలకు మార్క్సు తత్వశాస్త్రాన్ని సమన్వ యించడంలోను తీసుకోలేదు,

హిందూ మతవాద పునాదులు కూల్చడం ద్వారానే భారత శ్రామికవర్గ విప్లవాన్ని విజయవంతం చేయగలమనే అంశానికి వారు ఇవ్వవలసినంత ప్రాధాన్యం ఇవ్వలేదు.

భారత తత్వశాస్త్రంలో అవైదిక దర్శనాలను ప్రచారంలోకి తేలేదు. చార్వాక తాత్విక ఉద్యమాన్ని వారు సొంతంచేసుకోలేదు. కులం పునాదులను కూల్చడంలో ఉత్సాహం చూపలేదు. స్త్రీఅసమానత అస్పృ శ్యతను నిర్మూలించే సామాజిక ఉద్యమాలను పటిష్టంగా నడపలేదు.

మార్క్సిజాన్ని జీవితాలకు అన్వయం చేయుటంలో పూర్తిగా విఫలమయ్యారు. కులాన్ని, వ్యక్తి ఆస్తిని, హిందూ సామాజిక జీవనవిధా నాన్ని జీవితాల్లో అలాగే కొనసాగిస్తూ ఆర్థికవిప్లవాన్ని మాత్రమే బోధిం చారు. దానిలో మార్క్సిజాన్ని జీవితానికి అన్వయించుకోలేని అశక్తతను అన్వయంగా వ్యాఖ్యానాలు చేసుకుంటూ పోయారు.

దానితో హిందూ పునరుద్ధరణ వాదులు తిరిగి పుంజుకొన్నారు. వారి జీవితంలో హిందూ మతోన్మాదాన్ని, కులతత్వాన్ని, స్త్రీఅసమానతని, అస్పృశ్యతని, ఆచరించడంలో కృతకృత్యులయ్యారు. హిందూ మతే

శరుత్తైన మైనారిటీ మతాల వారిమీద కూడా వీరిముద్రలు వేయగలిగారు. ప్రవక్తి మార్క్సిస్టులుగా, కమ్యూనిష్టులుగా చెప్పబడేవారిలో పెక్కురు హిందూ కమ్యూనిష్టులుగా, హిందూ మార్క్సిస్టులుగా మాత్రమే మన గలిగారు. హిందూ రాజ్యాన్ని హిందూ మత భావవాద సంస్కృతిని కులచట్రాన్ని వాళ్ళు కూల్చడంలో విఫలమయ్యారు. అందుకే గతితార్కిక చారిత్రక భౌతికవాదులుగా చెప్పబడే వారందరూ హిందూ సమాజానికి వ్యతిరేకంగా భౌతికవాద ఉద్యమాన్ని బలంగా ముందుకు తీసుకు పోవల సిన అవసరాన్ని గుర్తించాలి. మరిముఖ్యంగా చార్వాక ఉద్యమాన్ని వారు సొంతం చేసుకోవాలి.

భారతీయ భావవాదాన్ని మొత్తం పునాదులుకూల్చే ఆచరణాత్మక ఉద్యమాన్ని గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథంతో వారు ముందుకు తీసుకుపోగలగాలి.

## ఆధునిక భారత సామాజిక ఉద్యమకారులు

భారతదేశంలో ఆధునిక సామాజిక ఉద్యమకారుల్లో ప్రసిద్ధులైన మహాత్మపూలే, డా॥ బి.ఆర్. అంబేడ్కర్, పెరియార్, ఇ.వి.రామస్వామి నాయకర్ హిందూ మతవ్యవస్థకు కులవ్యవస్థకు హిందూ రాజ్యవ్యవస్థకు వ్యతిరేకంగా బలంగా పోరాడారు. మహాత్మాపూలే హిందూ సాంప్రదాయవాదులకు వ్యతిరేకంగా బలమైన సాంస్కృతిక ఉద్యమాన్ని నడిపాడు. డా॥ బి. ఆర్. అంబేడ్కర్ హిందూ మత వ్యవస్థ మీద యుద్ధాన్ని ప్రకటించాడు. హిందూ భావవాద గ్రంథాలైన వేదాలు, స్మృతులు, పురాణాలు అన్నిటి మీద శాస్త్రీయ విమర్శచేసి అవి అశాస్త్రీయమైనవని నిరూపించాడు. హిందూ సామాజిక వ్యవస్థలో అసమ త్వానికి మూలమైన కులం పునాదుల మీద తీవ్రమైన దాడిచేసి కుల నిర్మూలన హిందూ సామాజిక పునర్నిర్మాణ సూత్రంగా నొక్కివక్కాణిం చాడు. అస్పృశ్యతను, స్త్రీఅసమానతను నిర్మూలించడానికి ఎలుగెత్తి చాటాడు.

హిందూ రాజ్య నిర్మాతలైన తిలక్, గాంధీ, పటేల్‌ల కుట్రలను కుతంత్రాలను నిర్ద్వందంగా బయటకీడ్చాడు.

హిందూ వ్యవస్థను కూల్చాలంటే హిందూ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడిన బౌద్ధాన్ని ముందుకు తీసుకు వెళ్ళాలని ఉద్బోధించడమేగా బౌద్ధాన్ని స్వీకరించి బౌద్ధధర్మంలో వున్న లోపాలను సరిదిద్దాడు.

అయితే అంబేడ్కర్ ఆలోచనా విధానాన్ని ముందుకు తీసుకు వెళ్ళడంలో హిందూ మార్క్సిస్టులు చేసిన తప్పునే అంబేడ్కరీయులు చేశారు.

అంబేడ్కరీయులు హిందూ మతాన్ని మతసంస్కృతిని వదల లేక పోయారు కులనిర్మూలనను ఆచరించలేక పోయారు. హిందూ రాజ్యాన్ని కొనసాగిస్తున్న కాంగ్రెస్ పార్టీని వదలలేక పోయారు. దానిలో హిందూ అగ్రవర్ణాలకు అగ్రవర్ణరాజ్యానికి వ్యతిరేకంగా బలమైన ఆచరణాత్మక ఉద్యమాలను నిర్మించ లేక పోయారు.

ఈవిషయాన్ని పునరాలోచించుకొని ఇటీవల భారత దేశవ్యాప్తంగా ముందుకు వచ్చిన దళిత ఉద్యమాలు అంబేడ్కర్ సిద్ధాంతాల సారాన్ని శాస్త్రీయ పద్ధతుల్లో అన్వయించుకొని హిందూరాజ్యానికి వ్యతిరేకంగా నిలబడి పోరాడగలుగుతున్నాయి.

పెరియార్ ఇ.వి.రామస్వామి నాయకర్ హిందూమతానికి వ్యతిరేకంగా సెల్ఫ్ రెస్పెక్ట్ ఉద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్ళగలిగాడు.

దక్షిణభారతంలో హిందూమత మౌఢ్యంమీద హిందూ అగ్రవర్ణ శక్తులమీద నిర్భయంగా పోరాడాడు. ఆయన అనుయాయులు కూడా ఆయనంత శక్తివంతంగా నిలబడలేక పోయారు.

హిందూ మతవాదం మీదే గాక అన్నిరకాల మతవాదాలపై పోరాడిన నాస్తిక హేతువాద ఉద్యమాలు భారతదేశవ్యాప్తంగా కొనసాగాయి. వారి ప్రచారశక్తి హిందూ పునరుద్ధరణ వాదుల ప్రచారశక్తిని తట్టుకో లేక పోయింది.

హిందూ రాజ్యం భావవాదాన్ని తమ రేడియోల ద్వారా టీవీల ద్వారా తమ ఆస్థాన పండితుల ద్వారా నిరంతరప్రచారం చేస్తుంది.

హిందూ మతవాదులు చివరకు భౌతిక వాదుల భౌతిక దాడులకు సిద్ధపడుతున్నారు. ఈపరిస్థితుల్లో భారతదేశంలోని భౌతికవాద ఉద్యమ శక్తులు మరియు హిందూ మతోన్మాద వ్యతిరేక శక్తులు సమైఖ్యంగా వారిని ఎదుర్కోవలసిన తరుణం ఆసన్నమైంది. గతితార్కిక చారిత్రిక భౌతిక వాదులు భారత సామాజిక ఉద్యమాలతో ముందుకు నడుస్తున్న దళితఉద్యమశక్తులు, నాస్తిక హేతువాద శక్తులు, హిందూ నాజీల అణచివేతలకు గురౌతున్న దళిత జాతుల ప్రజలు సమైక్యశక్తిగా, భౌతికశక్తిగా రూపొంది హిందూ భావవాద అగ్రవర్ణాల్ని వారి రాజ్యాధికారాన్ని కూలదోయడానికి శాస్త్రీయంగా ఉద్యమించాలి. అందరిలో ఉన్న లోపాలను ఆత్మపరిశీలన చేసుకొని భారతదేశ తత్వశాస్త్రంలో వున్న భావవాద,భౌతికవాద ధోరణులను పరిశీలించి అవి ఏఏ పాలక వర్గాలకు ప్రాతినిధ్యం వహించాయి అనే విషయాన్ని చారిత్రికంగా సమన్వయం చేసుకొని ఆ అవగాహనలో భౌతికవాద ఉద్యమాన్ని ఒక పోరాటశక్తిగా, శ్రామికశక్తికి ఆయుధంగా రూపొందించు కొని ముందుకు సాగాలి. ఆ అవగాహనతో పోరాడే శక్తులకు ఈచార్వాక దర్శనం ఒక ఆయుధమైతే ఈనాప్రయత్నానికి సాఫల్యం చేకూరినట్లే అవుతుంది.

భారతదేశ చరిత్రలో భౌతిక వాదుల శక్తిని సామర్థ్యాన్ని అవగాహన చేసుకునే క్రమంలో చార్వాక దర్శనాన్ని పరిశీలిద్దాం.



చార్వాకులు ప్రాచీన భౌతికవాదులు. "చార్వీ" లేక "చార్వాక" అనే ఆచార్యునిబట్టి వీరికి ఆ పేరు వచ్చినదని కాశికా వృత్తిలో వున్నది. "చారు" అంటే "అందమైన" వాక్కులు గలవారు కాబట్టి చార్వాకులని వీరిని పేర్కొన్నట్టు చెప్పుచున్నారు. "చర్వణము" అంటే నాకివేయడం పుణ్యపాపాది భావవాదవస్తుజాలము నంత (ఈ సిద్ధాంతము) నాకివేసింది కాబట్టి దీనికి చార్వాకమని పేరు వచ్చినదన్నారు. "చర్వీ" అంటే "తినుట" అనే అర్థంవుంది. "తిను" "తిను" అంటే అనుభవించు, సుఖించు అని చెప్పారు కాబట్టి వీరికి చార్వాకులని పేరు వచ్చినదని గుణరత్నాకరుడు ఊహించాడు చార్వాక శబ్దాన్ని యిన్నిరకాలుగా వ్యాఖ్యానించడాన్ని బట్టి వీరి ప్రశస్తి మనకు తెలుస్తూవుంది.*

వీరికే లోకాయతులు అనే మరో ప్రసిద్ధనామం కూడ వున్నది. "లోకేషు ఆయతః - లోకాయత" ప్రజలలో వ్యాపించినదని అర్థము. లోకముమాత్రమే విషయముగా గల శాస్త్రము లోకాయతము. ఇహలోకాన్ని ఆధారంచేసుకొని యోచించు గ్రంథము లోకాయత

---

* "అథకథం పరమేశ్వరస్యసిః శ్రేయస ప్రదత్వ మభిధీయతే ! బృహస్పతి మతానుసారిణా నాస్తిక శిరోమణినా చర్వాకేణ తస్య దూరోత్సారి తత్వాత్"

వేదాంతంలో పరమేశ్వరుడు మోక్షమును ఇవ్వగలడు అని ఎట్లు చెప్పబడుచున్నది? బృహస్పతి మతానుసారియైన చార్వాకుడు ఈ మతమును ముందుగానే నిరూపించెను కదా! అని చార్వాకదర్శనంలో నాస్తికుడు ప్రశ్నిస్తున్నాడు. ఈ విషయం వీరి ప్రాచీనతను చాటుతుంది. (సర్వదర్శన సంగ్రహం)

మని బుద్ధఘోషుడు, హరిభద్ర, మణిభద్రులు వ్యాఖ్యానించారు. సాధారణ ప్రజల దర్శనమని భౌతికతత్వాన్ని ప్రబోధించేది "లోకాయత"కు అర్థము. లోకమును లేదా లోకాచారమును అనుసరించువారని, "షున్-సు" అనే చైనా అనువాదకుడు అనువదించాడు. లోకాయత శబ్దమునకు గల "ఆయత" అను పదమును "ఆ+యత్+ఆ"గా విడదీసి, సరియైనవిధముగా (ఆ) లోకమున (యత్) ప్రయత్నించుట అని అర్థము చెప్పవచ్చునని దాస్‌గుప్తాగారు అన్నారు.

లాటిన్‌లోని లూకస్, లిథూనియన్‌లోని లౌకస్ లతో పోల్చి విచారించినట్లయితే అడవులను నరకుట, పొలము అని అర్థము వస్తున్నట్లు మోనియర్ విలియమ్స్ పేర్కొన్నారు. అడవులను నరికి వ్యవసాయమునకై వాటిని పొలములుగా మార్చి కృషిచేయు శ్రామికులే లోకాయతులని తెలుపుతూవుంది. కౌటిల్యుడు తన అర్థ శాస్త్రములో సాంఖ్యము, యోగముతోపాటు లోకాయతమును విద్యల్లో భాగంగా చేర్చాడు. అంటే లోకాయత సిద్ధాంతానికి కౌటిల్యుని కాలంలో వున్నస్థానం వ్యక్తమవుతూవుంది.

అది ప్రజలలో వ్యాపించియుండినందున లోకాయత అన్నారు. ఇ. బి. కోవెల్ (E, B. Cowell) తాను అనువదించిన "సర్వదర్శన సంగ్రహ" అను పేరు గల మధ్యయుగాల భారతీయ తత్వజ్ఞాన సంగ్రహములో (క్రీ. శ. 14 వ శతాబ్దంలో మధ్వాచార్యునిచే) ఈ పేరు యొక్క వ్యుత్పత్తిని అంగీకరించాడు. హెచ్. పి. శాస్త్రికూడా ఈ పదాన్ని ప్రజల దృక్పథాన్ని తెలిపే అర్థంలో వాడాడు. దేశం యొక్క తత్వజ్ఞాన సంబంధమైన సాధారణజ్ఞానంగానే భావించాడు. కాబట్టి దానిని బలపరచేందుకు ఏ సాక్ష్యం అవసరం వుండబోదు. అయినప్పటికి అలాంటి సాక్ష్యాలున్నాయి. ఒకటిరెంటిని పేర్కొంటాము ఎస్. యన్. దాస్‌గుప్తా ఈ వ్యుత్పత్యర్థములోనే బౌద్ధగ్రంథం

"దివ్యావదాన" లోకాయతపదం వాడినట్లు చూపించారు. అనగా ప్రజల నడుమ పరివ్యాప్తంగా వున్నది అనే అర్థాన్నిస్తుంది. జైనవ్యాఖ్యాత "గుణరత్నాకరుడు" "షట్‌దర్శనసముచ్చయ" మనే గ్రంథంమీద క్రీ.శ. 14వ శ.లో తాను రచించిన వ్యాఖ్యానములో లోకాయతు (క్రీ.శ. 8 శతాబ్దం హరిభద్రుడు రచించినది) లను లేక లోకాయతికులను ఆలోచనారహితమయిన ప్రజానీకంవలె ప్రవర్తించినవారని, విచక్షణారహితులయిన సామాన్య జనులని పేర్కొన్నాడు. మధ్వాచార్యులు కూడ ప్రాచీన భౌతిక దృక్పథం ఎందువల్ల సాంప్రదాయికముగా చార్వాకుని పేరుతో జోడింపబడ్డదో తెలిపేందుకు ఇదే కారణాన్ని ఆచరణాత్మకంగా యిస్తూ లోకాయత దృక్పథం అనికూడ పేర్కొన్నాడు.

(ప్రజాబాహుళ్యము తంత్ర భోగశాస్త్రిములకు అనుగుణ్యంగా కోర్కెను సంపదను మానవుని ఏకైక లక్ష్యంగా పరిగణిస్తూ భవిష్య త్ప్రపంచానికి సంబంధించిన ఏ పదార్థపు ఉనికినైనా తిరస్కరిస్తూ, చార్వాకసిద్ధాంతాన్ని మాత్రమే అనుసరిస్తూండినట్లు తెలిసింది. కాగా ఆ శిష్యబృందానికి మరో పేరు లోకాయత-దాన్ని సార్థకపరుస్తున్న పేరు.)

ఇలా చెప్పడంలో మధ్వుడు కేవలం తన మేటి గురువు శంకరాచార్యుని (క్రీ.శ. 8వ శ.) అడుగుజాడలలో నడిచినాడు. ఆయన తన "బ్రహ్మసూత్రాలపై" వ్రాసిన వ్యాఖ్యానములో దాదాపు అదే లెక్కలో ఇద్దర్ని కలిపి పేర్కొనడంలో మొరటు మూకను (ప్రకృతి జనము) లోకాయత దృక్పథంగల అనుయాయులను (లోకాయతకా) సమానం చేశాడు. (ఒకే గాటిన కట్టివేశాడు).

అటువంటి వాఙ్మూలాలు లోకాయతులపట్ల ఏవగింపు కల్గించడంలో ఎక్కువగా బాధ్యత వహించిన విషయం వాస్తవము. అయి

నప్పటికి యిది ఆ వాఙ్మాలాల ప్రాధాన్యతను తగ్గించబోదు. వి
షించి ఆ పదం యొక్క వుత్పత్తిలో ఇమిడియున్న వాస్తవార్థ
దీనికి తోడయింది. ఈ అర్థంలో ఈ పేరును ప్రజలు వాడుతున్నప్ప
టికి ఆ ప్రజలపట్ల ఈ తత్వజ్ఞానంతొపాటు తీవ్రద్వేషం వ్యక్తమయి
ప్పటికీ, లోకాయత మనగా ప్రజల తత్వజ్ఞానము. ఈ తత్వజ్ఞాన
ప్రధానంగా ఇహలోకలేక భౌతిక సంబంధమయి ది. ఇతర ఋజువులను
ప్రక్కనబెట్టి చూసినపుడు ఈ పేరు ఒక ప్రత్యామ్నాయంగా
సూచితమవుతుంది. "పీటర్స్ బర్గ్ డిక్షనరి" లోకాయతమనగా కేవ
లము భౌతికవాదమని పేర్కొన్నది. యమ్. మోనియర్ విలియమ్స్
ప్రకారము ఈ పేరు పుంలింగ మయినప్పుడు "భౌతికవాది" అను
అర్థమునూ, నపుంసక లింగమయినప్పుడు "భౌతికవాదము" లేక
నాస్తికతత్వజ్ఞాన విధానాన్ని సూచిస్తుంది. హెచ్. టి. కోల్ బ్రూక్
లోకాయత పదం పుంలింగంలో "భౌతికవాది" అనే అర్థాన్ని మాత్రమే
యిస్తున్నదన్నాడు.

కొంత మంది ప్రసిద్ధ సాంప్రదాయిక పండితులు కూడా ఈ
పదానికి ఈ విధంగానే అర్థం చెప్పారు. పంచానన తర్కరత్న అభిప్రా
యం ప్రకారం ఈ తత్వజ్ఞానాన్ని లోకాయత అనడానికి కారణం అది
సాకారభౌతిక ప్రపంచము (లోకం) వినా ఏదీలేదని నమ్ముతూ,
వెలుపలవున్న ప్రతిదాన్నీ తిరస్కరించింది. ముఖోపాధ్యాయుడుకూడా
ఈ అర్థాన్నే సమర్థించాడు. అతని ప్రకారం లోకాయత అనే పేరు ఈ
తత్వజ్ఞానంలో సహజ ప్రపంచం మీది ప్రధానమయిన వక్కాణింపు
నుండి వుత్పన్నమయినది.

ప్రాచీన గ్రంథాలలో దాని భౌతికవాదసారం దృష్ట్యా ఆ
పేరును వివరించే కొన్ని ప్రయత్నాలు జరిగినట్లు మనం చూస్తాం.
క్రీ.శ. 5వ శతాబ్దపు బౌద్ధవ్యాఖ్యాత బుద్ధఘోషుడు "ఆయత" పదం
"ఆయతనం" అనే అర్థంలోకూడ వాడవచ్చు అని సూచించాడు.

ఈ అభిప్రాయంమేరకు లోకాయత అనగా భౌతిక ప్రపంచం ప్రధానంగాగల తత్వజ్ఞానం అని అర్థం వస్తుంది. దాదాపు ఈ పేరుకు యిదే వ్యుత్పత్తిని హరిభద్రుడు అతని వ్యాఖ్యాతలు సూచించారు. అతని నిర్వచనం మేరకు లోకం అంటే ఇంద్రియ జ్ఞానానికిలోనయ్యే సమస్త పదార్థం. వ్యాఖ్యాత మణిభద్రుడు మరింత స్పష్టీకరించడానికి ప్రయత్నించాడు, పదార్థ సార్థము లేక సమూహము. అనగా భౌతికంగా ఉనికిలోనున్న సమస్తం అని నిగ్గుదేల్చాడు. ఉభయుల అభిప్రాయం మేరకు లోకాయత పదంయొక్క మూలపదం, "లోక" కనుక దాని అర్థం భౌతిక జ్ఞానతత్వం.

దాస్‌గుప్తా అభిప్రాయం ప్రకారం చార్వాక సంబంధమయిన సమస్తసిద్ధాంతాన్ని తెల్పేదిగా కనబడుతూవుండి, లోకాయత అనే ఈ నామము తత్వవేత్తలచేత, వ్యాఖ్యాతలచేత, ఈ తత్వశాస్త్ర చరిత్రకారులచేత యింతగా వివరింపబడి సమన్వయింపబడుటను బట్టి దాని ప్రశస్తి మనకు దృగ్గోచరమగుచున్నది.*

యీ లోకాయత ఉద్యమానికి ప్రమాణగ్రంథాలు ఏమీ కనిపించడం లేదు. ప్రత్యర్థుల ద్వేషానలంలో అవి దగ్ధమయివుంటాయనేది చారిత్రకసత్యంగా మనకు గోచరిస్తూవుంది. ప్రజలపై వారికి గల ప్రభావానికి భయపడి వారి గ్రంథాలను నాశనంచేసి యుండవచ్చునని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తన— "డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో పేర్కొన్నారు.

వీరికి నాస్తికులు అను బిరుదు కూడ కలదు. "పాణిని" పరలోకం లేదనేవారు నాస్తికులు అని చెప్పాడు. దీని ప్రకారం భౌతికవాదులు, స్వభావవాదులు, యాదృచ్ఛికవాదులు, చార్వాక భౌతికవాదులు, నాస్తికులుగా పరిగణనలోనికివస్తారు. మనుస్మృతికారుడు వేదనిందకులను

* లోకాయత — దేవీప్రసాద్ చటోపాధ్యాయ
(Lokayata — Deveeprasad Chatopadhyaya)

స్మృతులను విమర్శించు బ్రాహ్మణులను వేదనిందకులుగా నాస్తికులుగా పేర్కొన్నాడు. వారిని సాధువులు బహిష్కరించా లన్నాడు. *అంటే అవైదికులను నాస్తికులుగా పేర్కొంటున్నాడు. జైనులు, బౌద్ధులు కూడ అవైదికులే, వాళ్ళు మనువు దృష్టిలో నాస్తికులే. దీనినిబట్టి నాస్తికపదము చరిత్రలో అనేక అంద ర్భములలో అనేక అర్థాల్లో వాడబడింది. ఒక మత, వారిని పరలోక మతంవారు అనేక సందర్భాల్లో నాస్తికులుగా పేర్కొంటూ వచ్చారు.

చార్వాక సిద్ధాంతమును ప్రవచించినవారు భారతీయ తత్వ శాస్త్రంలో ప్రధానపాత్ర వహించియున్నారు. చార్వాక భావప్రతి నిధులు అన్ని కాలములందు వున్నారు. రామాయణములో జాబాలి ఋషి భౌతికవాది. అతను శ్రీరామునికి చెప్పిన బోధల్లో చార్వాక సిద్ధాంతమున్నది. హరివంశమున వేనరాజు చార్వాకమతానుయాయి. వ్యాసునిచేత ఇతను నిందకు గురిఅయినాడు. ప్రాచీన బౌద్ధ వాఙ్మయ ముల ననుసరించి అజిత కేశకంబలిన్ బుద్ధుని సమకాలికుడుగా వుండి చార్వాకాన్ని ప్రవచించినవాడే. పాయాసి అజిత కేశకంబల్‌కు అను యాయుడు. అతడు చార్వాకసిద్ధాంతమును బలపరచిన భాగురుని పేర్కొన్నాడు. వేరు వేరు రీతుల్లో ప్రవచించినప్పటికిని అనేకమంది చార్వాకసిద్ధాంత అనుయాయులు అనాడువున్నారు. గోశాలల్లోపుట్టి బానిసల్లో పెరిగి, అడవుల్లోకి పారిపోయి భౌతికవాదాన్ని ప్రవచిం చిన మక్కలి గోశాలుడు, బానిసలనుండి పారిపోయి బానిసవ్యవస్థను భౌతికవాద దృష్టిలో వ్యతిరేకించిన పూర్ణ కాశ్యపుడు బానిసవ్యవస్థకు ఎదురుతిరిగి అణుసిద్ధాంతాన్ని చెప్పిన ప్రకృథ కాత్యాయని మొదలగు వారందరు చార్వాకసిద్ధాంతాన్ని బోధించినవారే.

---

* యోऽవమన్యేత తేమూలే హేతుశాస్త్రాశ్రయోద్విజః
  సనాడు భిర్బహిష్కార్యో నాస్తికో వేద నిందకః".

పృద్విజుడు ప్రమాణములయిన శృతి స్మృతులను హేతుతర్క వాదములచేవర్చించి దూషించునో అట్టి నాస్తికుని వేదదూషకున్ని సాధువులు బహిష్కరింపవలెను.

అంతేగాక యీ ఉద్యమ భావాలకు దగ్గరలోనున్న ఉద్యమాలు అనాడు వివిధనామములతో వున్నాయి. వారందరూ ఆయా కాలాలలో యించుమించుగా భౌతికవాదాన్నే బోధించారు. వానిలో కొన్ని ముఖ్యమయిన ఉద్యమాలను సిద్ధాంతాలను పరిశీలించుదాం!

**పాఖండకవాదం:** పాఖండ, పాఖండి, పాఖండిక యీ మూడు పాఖండికయొక్క పర్యాయపదాలు. సామాన్యంగా ఈ పదంయొక్క అర్థం బూటకం. కాని ప్రాచీన భారతములో యీ పదాన్ని హేతువాద్యాన్ని అయుధంగా వాడే నాస్తికులకు వాడారు. ఎవరయినా తన హేతుజ్ఞానం వినియోగిస్తే అతడు వెక్కు చెడుపనుల నుండి తప్పించుకోగలడు. కాబట్టి దాన్ని పాఖండ అన్నారు. హేతుత్వాన్ని అభ్యసించే మనిషి శుష్కవాదాన్ని నమ్మడు అతడు తర్కాన్ని నమ్మి శుష్కవాదాన్ని త్రోసిపుచ్చుతాడు.

**ప్రకృతివాదం:** నాస్తికులు ప్రకృతిని అర్థం చేసుకొనేందుకు, ప్రకృతిశాస్త్రాలను అధ్యయనంచేసి సహజ జీవితాన్ని గడిపారు. కాబట్టి వారిని ప్రకృతివాదులన్నారు.

**భూతవాదం:** భూతమనగా పదార్థమని అర్థము. ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవారు పదార్థాల కావల ఏమీలేదన్నారు. అందుచే వారు భూతవాదులు.

**దేహాత్మవాదం:** నాస్తికుడు ఆత్మయొక్క ఉనికిని నమ్మడు. దేహము పదార్థసంయోగ నిర్మితమని అంతర ప్రవృత్తి దానినుండి జనిస్తుందని అంటారు. దేహామే సర్వస్వం. అంతర ప్రవృత్తి దేహారహితంగా వుండదు. కాబట్టి దేహామే ఆత్మ.

**అక్రియవాదం:** ఈ వాదం లోకాయత సిద్ధాంతాలను అనుసరిస్తుంది. అనగా సుఖదుఃఖాలు ప్రకృతిసూత్రాలననుసరించి కలుగుతాయి అని చెబుతోంది ప్రాణి ఉనికిలోనికి రావడానికి మూల

పదార్థాలయొక్క యాదృచ్ఛిక సమ్మిశ్రమం జరుగుతోంది. స్వర్గ నరకాలు పాపపుణ్యాలు వగైరా భావాలు సోమరి ఊహాల ఫలితం.

**దిత్తాదమునివాదం:** ఈ వాదం మేరకు అంతిమ నిర్ణాయం పంచ కాయ గుణాలవల్లనే— స్పర్శ, వాసన, ధ్వని, సౌందర్యము, రుచి అను రూపాలలో మాత్రమే సాధ్యమవుతుందని చెబుతోంది. వారు మరో లోకభావనను తిరస్కరించారు.

**స్వాస్తవాదం:** ఇది బాగా అల్లబడిన మతశాఖ. దీని అనుయాయులు ఆత్మయొక్క నిశ్చితత్వాన్ని విశ్వసించారు. కాని అతను ప్రకృతి యొక్క కార్యరూపంతో కలగజేసుకోజాలని నిష్క్రియాత్మ దర్శకునిగా పరిగణించారు.

**ఉచ్ఛేదవాదం:** పదార్థ సంయుతమయిన ప్రతిజీవి నాశబద్ధమయిన దన్నారు. దేహము, ఆత్మ ఒకే పదార్థ సంజాతములు కాగా రెంటికి వినాశనం చెందుతాయి. ఆత్మ మరణంతో నాశనమౌతోందన్నారు.

**అజ్ఞానవాదం:** దీని ప్రతిపాదకులు ఏదయినా ప్రశ్నకు తప్పనిసరి సమాధానం పరులను పెడదారి పట్టిస్తుందని బోధించారు. కాబట్టి విశ్వాన్ని గురించి జీవితాన్ని గురించి యథాలాపంగా జవాబులివ్వడం తెలివైన పని కాదన్నారు. వారు భ్రాంతిపదమయిన కాంతివెల్లువలో ఈదులాడేకంటే చీకట్లో జీవించడం మేలు అనే దృక్పథం కలిగి యున్నారు.

వారు విజ్ఞానాన్ని అనుమానాస్పదమైన స్థితిగా భావించారు. విజ్ఞానం అనుమానానికి అతీతమయింది. అయితే విద్యావంతుల నడుమ అభిప్రాయ భేదములుండేందుకు అవకాశం లేదు. వారు తేల్చిందేమనగా తత్వవేత్తల నడుమ అభిప్రాయభేదాలు తీవ్రంగా ఉన్నాయి. అందుచేత యుక్తమయిన అభిప్రాయం ఏర్పడలేదు.

**శూన్యవాదం:** ఈ వాదంలో ఉన్నట్టిది ఆలోచనవినా ఏదీ ఉనికిలో లేదు కనుక బంధాల గురించి మాట్లాడటం అంతగాలేదు. మోక్షాన్ని గురించి మాట్లాడటం అనవసరం. ప్రతిదీ నశిస్తుంది- ఏదైనా నాశం వస్తుస్వభావం, శూన్యంఒక్కటే వాస్తవం.

**స్వభావవాదం:** ఈ వాదాన్ని ప్రకృతివాదం అనవచ్చును. దీని ప్రకారం గ్రహింపు ఒక్కటే జ్ఞానము. గ్రహింపుకు తుల్యమైన సంస్కృతపదం దర్శనం కాబట్టి స్వభావవాదులు, దార్శనికవాదులు అని కూడా వాడబడ్డారు. గమనించవలసింది ఏమిటంటే, ఈదార్శనిక శబ్దం అనతికాలంలోనే తత్వవేత్తయనే అర్థాన్నిచ్చింది. అందుచే సనాతన వాదాలనారింటిని షడ్దర్శనాలు అన్నారు. ఆరు తత్వాలు అని అన్నారు.

**దేహవాదం:** ఈ వాదం ప్రకారం పదార్థరూపమయిన మానవదేహం జగత్ దృష్టితో పాటు విశ్వంయొక్క అతి సూక్ష్మభాగం క్రిమిరుణువుల సంయోగాన్ని విశ్వానికి మూలంగా ఆపాదించబడినది.

ఈ విధంగా భారతీయ వాస్తవికత నుండి పుట్టిన భౌతిక ఉద్యమాలు అనేక రూపాల్లో అనేక రంగాలనుండి భావవాదం మీద వైదిక సంస్కృతి మీద తిరుగులేని తిరుగుబాటు చేశాయి. అంతేకాక ఆ కాలపు పరిధుల ననుసరించి వారికి అందుబాటు ఉన్నంతలో మహోన్నతమయిన సిద్ధాంతాన్ని వెలయించాయి.

—o—

# చార్వాక సిద్ధాంత దర్శనం

## బూడిదయిన శరీరం తిరిగిరాదు:-

శ్లో॥ యావజ్జీవం సుఖం జీవేత్ నాస్తి మృత్యోరగోచరః।
భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం కుతః॥

తా॥ జీవించినంతకాలం సుఖంగా జీవించాలి. మృత్యువు తర్వా యింకేమీ లేదు. బూడిదయిన శరీరం తిరిగి వచ్చుట ఎట్లు?

మృత్యువు తర్వాత ఇంకేమీ లేదనే విషయాన్ని చార్వాక సుమారు ఇప్పటికి మూడువేల సంవత్సరములనాడే చెప్పారు. ర్జన్మ సిద్ధాంతాన్ని శాస్త్రీయంగా ఖండించారు. జీవితానికి అ చెప్పారు, ఈ జీవితం తప్ప మరొక జన్మలేదని దీన్ని సుఖవంత చేసుకోవడానికి కృషిచేయమని వారు బోధించారు. ఆత్మ వేరే లే చెప్పారు. అందువల్లనే శరీరానికి కావలసినవన్ని, ఆహారం నుంచే స కూరునని చరక సంహిత యీ విధంగా వివరించినది.

జీవం అంటే జీవంగా రూపాంతరం చెందిన ఆహారం మా ప్ర లోకమంతట ప్రతి ప్రాణి ఆహారం కోసం గట్టిగా యత్నిస్తున్న ది, రపు రంగు, భౌతికమయిన పొంపు, పెరుగుదల శ్రావ్యమయిన ధ్వని, జీవితం, ఉపజ్ఞ, సౌఖ్యం, సంతృప్తి, సునిశిత మేథస్సు-వీట ఆహారంవల్ల యేర్పడ్డవే.

"ప్రాణః ప్రాణ భూతం అన్న మ్లోకాః అభిధావతి
వర్ణః ప్రసాద సౌస్వరాయం జీవితం ప్రతిభా
సుఖం తుష్టిః పుష్టిఃబలం మేధాసర్వం అన్నే ప్రతిష్ఠితం"

(చరక సంహిత—1-27; 249-250)

ఆ విధంగా దేహచ్ఛాయ; బలము, భౌతిక లక్షణాలు, ఉపజ్ఞ (ప్రతిభ), విశిష్ఠ వివేకం, (మేథ), గుణగణాలు, శక్తియుక్తులు, మామూలుగా భౌతికం అనుకునేవి-అన్నీ ఆహారంనుండి జనించినవే.
(Science and Society in Ancient India--Deviprasad Chatopadhyaya)

దీనిని బట్టి చార్వాకుల సిద్ధాంతము సప్రమాణ మయినదని మనకు బోధపడుతూ వున్నది.

## సుఖదుఃఖ సమ్మేళనమే జీవితం :

శ్లో॥ త్యాజ్యం సుఖం విషయసంగమ జన్మపుంసాం
దుఃఖోప సృష్టమితి మూర్ఖ విచారణైషా।
వ్రీహీన్ జహాసతి సితో త్తమ తండులాఢ్యాన్
కోనామ భోస్తుష కణోప హితాన్ హితార్థ॥

జీవితము పంచేంద్రియ సంబంధము వలన కలిగెడు సుఖదుఃఖము లతో కూడియుండును. గాన, మానవులు జీవితమును విడిచిపెట్టవల యును అనెడిమాట మూర్ఖుల అభిప్రాయము, పొట్టు కూడి యుండు నంత మాత్రమున స్వచ్ఛమయిన ధాన్యమును వివేకవంతుడు విడిచి పెట్టునా? సుఖదుఃఖములతో కూడియున్న. జీవితంలో దుఃఖం ఉన్నది కాబట్టి ఈ జీవితం వ్యర్థమనే వేదాంతతత్వాలు అసత్యపూర్ణ మయినవి.

అట్లు చెప్పేవారు ఒకప్రక్క సర్వభోగాలతో జీవితాన్ని సుఖమయం చేసుకుంటూనే వుంటారు. బోధనలు మాత్రం అవిధంగా చేస్తువుంటారు. కొందరు జీవితమంటే అర్థం తెలియక దాన్ని శుష్కింపజేసి మోక్షజ్ఞానాన్ని పొందాలని చూస్తారు. ఇవన్నీ వివేకం లేనివాళ్ళుచేసే పనులని ఆనాడే చార్వాకులు వివరించారు. జీవితంలో అన్ని కోణాలను విశ్లేషించుకొని, ఈ జీవితాన్ని సుఖవంతం చేసుకోవాలనిబోధించారు. శుష్కవేదాంత బోధనలు చేయు వారిని చూసి హేళన చేశారు. ఈ లోకంలో జీవించడం తెలియక, పరలోకం కోసం జీవించడం వ్యర్థమని బోధించారు. పొట్టుపేదో,గింజేదో

తెలిసికోమని, వివేకవంతులుగా అభివృద్ధి చెందమని వాదించారు. జీవితానికి, జీవనానికి అర్థాన్ని నివేదించినారు. శుష్కవేదాంత బోధనలను తమ హేతువాద దృక్పథం నుండి ఖండించారు. అజ్ఞానానికి, వివేకానికి, మూఢత్వానికి తేడా చెప్పారు. పంచేంద్రియాలను కర్మేంద్రియాలను విశ్లేషించి వాటి ధర్మాలను, గుణాలను వివరించారు. మానవునికి మానవత్వానికి భాష్యం చెప్పారు. తుప్పుపట్టి సమాజాన్ని కొరుక్కుతింటున్న మూర్ఖబోధనలను, తమ విజ్ఞానపు అగ్ని కొలిమిలో పుటము పెట్టారు. భౌతికతాత్విక భావానికి పాదుచేసి, నీరుపోసి పూవులు పూయించి, విజ్ఞాన సౌగంధ్యాలు విరజిమ్మేటట్లుగా శ్రమించారు. మత దుర్గంధాన్ని పారద్రోలడానికి తమ శక్తికొలది కృషి చేశారు.

## బుద్ధిలేనివారి జీవనోపాధి :

అగ్నిహోత్రం త్రయో వేదాః త్రిదండం భస్మగుణ్ఠనం ।
బుద్ధిపౌరుష హీనానాం జీవికేతి బృహస్పతిః ॥

అగ్నిహోత్రము, మూడు వేదములు, త్రిదండములు, విభూతి రాసుకొవడం ఇటువంటివి అన్నీ కూడా బుద్ధిపౌరుషము లేనివారి యొక్క జీవనమార్గాలు అని బృహస్పతి చెప్పుచున్నాడు.

చార్వాకులు తమ మతగురువుగా బృహస్పతిని చెప్పుచున్నారు. (ఈతడు దేవతలగురువయిన బృహస్పతి మాత్రంకాదు) వీరి సిద్ధాంతం ప్రకారము అగ్నిహోత్రము అంటే ప్రాతః సాయంకాలములందు చేసెడి హోమం. అగ్ని ముందు కూర్చొని మంత్రోచ్చారణ చేయుట వలన అగ్ని అనే పురోహితుడు వాటిని స్వర్గానికి మోసుకెళతాడనే ఒక నమ్మకము. మూడువేదాలు, ఋగ్యజుస్సామ వేదాలు, సన్యాసులు ఉపయోగించే మూడుదండాలు జీవించడానికి మార్గాలు తప్ప అందులో ఏమీ శ్రమలేదని వారు చెప్పారు. జీవుల రక్తధారలనుండి ఉత్పత్తి అవుతున్న సంపదను, హోమాలు చేస్తూ వేదపఠనాలు చేస్తూ, సన్యాసులై,

ఋషులై భుజిస్తున్న వారి గుట్టురట్టుచేశారు. మానవ శ్రమను దోచుకోవడానికి వారు పన్నిన పన్నాగాన్ని బయటకీడ్చారు. వివేకముతో విజ్ఞానంతో ప్రశ్నించారు.

## స్వర్గ నరకాలు వేరేలేవు:

అంగనాలింగనాత్ జన్య సుఖమేవ పుమర్థతా ।
కంటకాది వ్యథాజన్యం దుఃఖం నిరయ ఉచ్యతే ॥

పురుషునికి స్త్రీని కౌగిలించుకోవడంవల్ల వచ్చిందే సుఖం, ముల్లు గుచ్చుకోవడం మొదలయిన వాటివల్ల కలుగు దుఃఖమే నరకం. ఇంక వేరే స్వర్గనరకాలు లేవు. (పంచేంద్రియములకు అందని స్వర్గ సుఖాలు లేవని వీరు భావించారు)

స్వర్గం నరకం అనేవి సుఖదుఃఖాలకు సంకేతం తప్ప మరేమీ కాదు. ఆ స్వర్గనరకాలు పైన ఎక్కడాలేవు. స్వర్గం కేవలం కల్పిత మయినది స్వర్గంరత్నవైఢూర్య గోమేధిక పుష్యరాగమణులతో కూర్చ బడింది అనేది ఊహ. ఆ వజ్రవైఢూర్యములన్నీ భూతలంలో దొరికే రాళ్ళు. స్వర్గానికి పురుషుడు రంభా, ఊర్వశి, మేనకల కోసం వెళితే మరి స్త్రీలు ఎవరికోసం స్వర్గానికెళ్ళాలి? ఇదంతా అబద్ధమని వారు వ్యాఖ్యానించారు. యీ విషయాన్ని శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తన ప్రహసనాల్లో నిశితంగా ఖండించారు.

"స్వర్గలోకసుఖము" -- అనే ప్రహసనములో, యుద్ధాలలో చస్తే వీరస్వర్గం వస్తుందని, రంభాసంభోగం లభిస్తుందని పొగపెట్టి ఎందరో వీరులను, అమాయకులను, యుద్ధానికి ఉసిగొల్పి చంపారు. అక్కడ రంభా లేదు. సంభోగమూ లేదు. ఒకవేళ రంభే ఉంటే చచ్చి పోతున్న యిన్ని కోట్లమందికి ఆమె ఒక్కతే సంభోగసుఖం అందించడం ఎలా వీలవుతోంది? అందుకే బడేసాహెబ్‌గారు, నరసింహసోమయాజులుతో ఇలా అంటున్నారు.

"మీరు వెయ్యేళ్ళు తల్లక్రిందులుగా తపస్సు చేసినా మీకిప్పుడు రంభ రాదు ఆఫ్ఘన్ యుద్ధంలో మాతో చచ్చినవాళ్లు ఇరవైవేలమంది

సాహెబులున్నారు. ఈజిప్టు యుద్ధంలో చచ్చినవాళ్ళకు పంతురాకుండా ఇంకా పదివేలమంది దిగబడియున్నారు. ఇంకా సౌహాను యుద్ధంలో చచ్చిన తురకలు ఎంత మందో ఇప్పుడు వస్తున్నారు. మీ గ్రహచారం వీధుల్లోపడి యేడుస్తుండవలసినదే" అంటాడు.

సుబ్బరాయవధానులుగారు. ఈస్వర్గాన్ని చూసి, "వెధవ స్వర్గము. ఇది స్వర్గమన్నమాటే గాని యిక్కడంతా వర్ణసంకరం. వావీ వరసా ఏమీలేదు, ఆ మాలవాడు వెళ్ళడంతోటే రంభ వద్దకు నేను వెళ్ళినాను. అందరం యజ్ఞాలు చేయడం చేత మా తండ్రి గారు, నేనూ, మా బావమరిది కూడా ఒక్క ముండతోనే యేడవవలసి వచ్చింది. ఆ రంభముండ ముసలివాడని ఒక్కత్రోపు త్రోసేటప్పటికి ముసలిబ్రాహ్మడు క్రింద పడిపోయాడు. నేను ఆయన చెవులుమూసి, వుపచారం చేస్తూ వుంటే, మోటుముండావాడు మా బావమరిది వచ్చి అస్తమానమూ మీరే యిక్కడ వుంటే, మేము వెళ్ళవద్దా ?" అని గుబికీ గుబికీ నావీపుమీద పడి గుద్దులు గుద్దినాడు. అన్ని కష్టాలుపడి తీరా కాస్త రంభా సంభోగం లభించ వచ్చేవరకు తుండ్లలాగు తురక ముండావాళ్ళు వచ్చి మమ్మల్ని నాలుగు తన్ని జుట్టుపట్టుకొనియీడ్చి పడలాగివేసినారు. మా బావమరిదిగాడికి మహా చెడ్డరోగాలు అంటు కున్నాయి. వాడు అప్పటినుండి ఆవతిన్న నసరంలాగు క్రిందపడి కొట్టాడుకుంటూ దొర్లపుచ్చకాయ లాగు దొర్లుతూ వున్నాడు. గాడిదికొడుకు కొట్టినందుకు వాడికి శాస్తి జరగవలసిందే".

(హాస్యసంజీవని-ద్వితీయభాగం-1?వ పేజి).

శ్రీ వీరేశలింగం గారి హాస్యస్ఫోరక మయిన ఈ ఖండన స్వర్గ భావన అబద్ధమని నిరూపిస్తూవుంది.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునికి స్వర్గాన్ని ఆశచూపి యుద్ధానికి ఏ విధంగా ప్రేరేపిస్తున్నారో చూడండి.

హతోవా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ కృతనిశ్చయః॥

ఇక యుద్ధం చేసినట్లయితే నీవు హతుడయితే స్వర్గాన్ని పొందుతావు. జయించితే రాజ్యాన్ని అనుభవిస్తావు. కనుక అర్జునా! యుద్ధం చేయడానికే నిశ్చయించుకొని లెమ్ము.

ఇక్కడ శ్రీకృష్ణుడు అర్జునుడు యిద్దరూ కల్పిత పురుషులే అయినా వారి పేరు మీద ప్రచారంలోకి వచ్చిన ఈ భావం ఎందరో అమాయకులను యుద్ధానికి ప్రేరేపించి బలిచేసింది.

## ఈశ్వరుడులేడు:

లోకసిద్ధో భవేత్ రాజా పరేశో నాపరస్మృతః
దేహస్య నాశో ముక్తిస్తు నజ్ఞానాత్ ముక్తిరిష్యతే"

లోకమందలి రాజే గొప్ప ప్రభువు. ఇంతకంటే గొప్ప ఈశ్వరుడు ఎవరూ లేరు. దేహము నశించుటయే మోక్షము. జ్ఞానము వలన మోక్షమురాదు,

మనకు కనిపిస్తున్న రాజు తప్ప ఈశ్వరుడు లేడు. అని చార్వాకులు ప్రవచించినారు. ఈశ్వరుడున్నాడంటే అతడు సాకారుడా? నిరాకారుడా? అనే ప్రశ్న వస్తుంది. నిరాకారుడు అని సమాధానం చెబితే సాకారప్రపంచాన్ని నిరాకారుడు, నిర్గుణుడు, నిరంజనుడు ఎలా సృష్టించగలడు? అని ప్రశ్న వస్తుంది. అయితే సాకారుడు అని సమాధానం చెబితే ఏ రూపం నిజమయింది? ఈరూపాన్ని రూపొందించింది మానవులే కదా? అని ప్రశ్న వస్తుంది. అందుకే ఆస్తికులు ఈశ్వరుని అస్తిత్వాన్ని నిర్వచించలేక తబ్బిబ్బు పడ్డారు.

భగవద్గీతలో సాక్షాత్తు భగవానుడే జన్మను గురించి చెప్పాడంటున్న వానిలో ఎన్ని వైరుధ్యాలున్నాయో చూడండి.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్॥
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా॥"

నేను పుట్టుక లేనివాడను. నాశము లేనివాడను. ప్రాణులకు నియామకుడను. అయినా నాదైన ప్రకృతి నవలంభించి నాదైన మాయవల్ల పుట్టుతున్నాను.

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారతః।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజామ్యహం"॥

ఓయి భారతా? ఏకాలంలో ధర్మానికి హానికలుగుతుందో, అధర్మానికి వృద్ధి కలుగుతుందో అప్పుడంతా నేనీలోకంలో అవతరిస్తాను.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే॥"

శిష్టపాలన, దుష్టనిగ్రహం, ధర్మసంరక్షణల కోసం ప్రతి యుగంలో అవతరిస్తున్నాను.

"జన్మ కర్మచమే దివ్య మేవం యోవేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతిసోఽర్జున॥"

ఓ అర్జునా! యీవిధంగా నా జన్మను కర్మను దివ్యమైనదిగా ఎవడు తత్త్వాన్ని తెలుసుకొంటున్నాడో, వాడీ దేహాన్ని వదిలి మళ్ళీ జన్మించడు. నన్నే పొందుతాడు.

నేను పుట్టుక లేనివాడను, నాశనము లేనివాడను. నాదైన మాయవల్ల ధర్మానికి హాని కలిగినపుడు నేనే పుడతూ వుంటాను. నా పుట్టుకను తెలుసుకొన్నవాడికి ఇక పుట్టుక లేదు. అంటున్న శ్రీకృష్ణుడు ఒక ప్రక్క పుట్టుకలేదంటూనే, నేను పుడుతున్నానని చెబుతున్నాడు. భగవద్గీతలో చెప్పబడిన యీ వైరుధ్య సంభరితమైన దేవునిపుట్టుక కథనం. దేవుణ్ణి మానవుడే పుట్టించాడని చెబుతూవుంది. శ్రీకృష్ణ

మహా_ర్తి కూడా వ్యాసుని సృష్టియే. ఈ విషయాన్ని చిన్మయానంద ఈ విధంగా ఒప్పుకుంటున్నాడు. "గీత అంతటినీ ఇది వ్యాసుని సాహసమయిన సహజభావన అని చెప్పవచ్చు." వ్యాసుడు శ్రీకృష్ణుని సృష్టిస్తే, వాల్మీకి రాముణ్ణి సృష్టించాడు. మరొకపుల్లయ్య వెంకయ్యను సృష్టించాడు. మొత్తం మీద దేవుడు, దైవభావన, మానవులచే ఊహించబడినాయి, భావించబడ్డాయి, చిత్రించబడ్డాయి, శిల్పించబడ్డాయి. అందుకే చార్వాకులు "ఈశ్వరుడులేడు" అని ఘంటాపధంగా చాటి చెప్పారు.

ఈ దేవుళ్ళ గురించి "ఇంగర్సాల్" "The Gods" అనే వ్యాసంలో ప్రతిభావంతంగా వర్ణించాడు.

"ప్రతి జీవి ఒక దేవుణ్ణి సృజించుకొంది. ఆ దేవుడు సర్వదా తన సృష్టికర్తలను పోలియున్నాడు. వాళ్ళు ప్రేమించిన వాళ్ళనే తాను ప్రేమించాడు. వాళ్ళు ద్వేషించినవాళ్ళనే తాను ద్వేషించినాడు. అధికారంలో వున్నవాళ్ళ కొమ్మే తప్పనిసరిగా కాస్తూవచ్చాడు. ఈ ప్రతి దేవుడు తీవ్రదేశాభిమాని, పరజాతుల్ని ఏవగించుకొన్నాడు. ఈ దేవుళ్ళంతా తమను ప్రశంసించాలని, స్తోత్రం చేయాలని, పూజించాలని కోరారు. వాళ్ళలో ఎక్కువ మంది బలులతో సంతృప్తి చెందారు. అమాయకుల నెత్తురువాసన దేవతా సంబంధమైన ఆఘ్రాణంగా యెంచబడ్డది. ఈ దేవులంతా తమకు పూజార్లు కావాలన్నారు. పూజార్లు తమనాదుకొమ్మని ప్రజల్ని కోరారు. ఈ పూజార్ల ముఖ్య వ్యవహారం తమ దేవుణ్ణి గూర్చి డంబాలు చెప్పుకోవడం, మిగతా దేవుళ్ళందర్నీ తమ దేవుడు చిటికెలో నాశనం చేస్తాడని చెప్పుకోవడం

దేవుళ్ళ ఉత్పత్తి అసంఖ్యాక నమూనాలలో వివిధ ఫ్యాషన్లలో జరిగింది. కొందరికి వెయ్యిచేతులు, కొందరికి వందతలలు, కొందరి సజీవ సర్ప కంఠాభరణాలు, కొందరు గదాధరులు, కొందరు కత్తి, డాలు ధరించారు. కొందరికి రెక్కలుండేవి, కొందరు అదృశ్యులు కొందరు పూర్తిగా గోచరిస్తారు కొందరు వీపులు మాత్రం కనిపింప చేస్తారు. కొందరు అసూయాగ్రస్తులు, కొందరు మూర్ఖులు, కొందరు మానవాకారులు, కొందరు హంసరూపులు. కొందరు వృషభరూపులు, కొందరు పక్షిరూపులు. కొందరు సుందరాంగులైన మానవ పుత్రికల వెంటబడ్డారు. చాలామంది వివాహితులు, కొందరు నిత్యబ్రహ్మచారులు, కొందరికి పిల్లలున్నారు, ఆ పిల్లలు మళ్ళీ తండ్రులు రాగా దేవుళ్లయి పూజలందుకొన్నారు. ఈ దేవుళ్లలో చాలామంది ప్రతీకార పరాయణులు, ఆటవికులు, కామాంధులు, అమాయకులు. వాళ్ళకి సమాచారం కొరకు పూజార్లే గతి కాగా వాళ్ళ అజ్ఞానం మనలో ఆశ్చర్యాన్ని రేకెత్తింపదు."

త్రిపురనేని రామస్వామిగారు ఈ వికృతాకారాలు కల్గిన దేవుళ్లను గూర్చి యిలా వ్యాఖ్యానిస్తున్నాడు.

"చెవిటి దేవుడొక్కడు పాప చెవుల దేవు
డొకడు లోకపాలనఁజేయు చుందురట్టె!
యెటుల ప్రార్థింపవలయునో యెఱుఁగరాదు
భక్తకోటికిఁ బ్రాణాల పైకివచ్చె."

మానవుడే దేవుణ్ణి తనాకారంతో సృష్టించుకున్నాడు, అనే విషయాన్ని వ్యంగ్యసుందరంగా దేవుడితోనే చెప్పిస్తున్నాడు.

"కొసకేమౌనొ యెఱుంగకుండ నుసితో
గోఁజంగిపై నీవుఁ
పుసికన్నుల్ మసి ముక్కు దేబె మొగమున్

బువ్వాడు పెన్ బోరెమున్
తొసినోరున్ గలిగించి వంచకుడపై
దుర్జాతి నన్నొక్కమా
నిసినిం జేసెదవే మనుష్యుని వలెన్
నేనుంటినే మానవా!
కాలుంజేతులు ముక్కు మోములును చం
కల్ చన్నులున్ బేర్లు
కేలా యున్నవో! నాకు నల్లికలవా?
యెందాక సైరింతు ? నిన్
పాలార్తున్ మునుమున్న చెప్పితిని నే
పాట్లన్నియున్ మానవా !"

ఈ విధంగా దేవుడు లేడని ఆధునిక భౌతికవాదులు, కవులు వ్యాఖ్యానిస్తున్న విషయాన్ని చార్వాకులు ఆనాడే నొక్కి వక్కాణించారు.

## నాలుగే భూతములు :

"అత్ర చత్వారి భూతాని భూమి వార్యనలానిలాః
చతుర్భ్యః ఖలు భూతేభ్యః చైతన్య ముప జాయతే."

వీరి సిద్ధాంత ప్రకారం భూమి, నీరు, అగ్ని వాయువు అనేడి నాలుగే భూతములు. ఈ నాలుగు భూతముల నుండియే చైతన్యము వచ్చును.

చార్వాకులు అనుమాన ప్రమాణాన్ని అంగీకరించలేదు. ప్రత్యక్ష ప్రమాణం ఆధారముగా వారు నాలుగు భూతాలనే పేర్కొన్నారు. మూడు వేల సంవత్సరాలనాడు ఆ విధంగా నిర్వచించ గలగడం గొప్ప విషయమే.

ఈ విషయాన్ని దక్షిణ నిరంజనశాస్త్రి రచించిన "చార్వాక దర్శనం" ఆధారముగా M. N. Roy తన Materialism లో విధంగా వివరించాడు.

"All systems of philosophy in India maintain that the soul is totally distinct from the body. They never doubt that there is something in man different from the visible body. But according to the Lokayata system there is no soul apart from the body.

The systems of Indian philosophy generally recognise four sources of knowledge. perception, inference, authority and analogy. The Charvaka system rejects all these sources of knowledge except perception. All systems of Indian philosophy accept inference as a source of knowledge. It is only the Lokayata system, which rejects inference and accepts perception as the sole means of knowledge. to it there is no God, no fate, no world beyond, no final liberation, no recompense for acts goods or evil. All these negations are due to its rejection of inference as a source of knowledge."

భారతదేశంలోని తత్వశాస్త్ర సిద్ధాంతాలన్నీ దేహం నుండి ఆత్మ పూర్తిగా భిన్నమయినదని వాదిస్తాయి. కంటికి కనిపించే దేహంకన్నా భిన్నమయినదేదో మానవుడిలో వుందనే విషయంలో వారికి సందేహమే లేదు. కాని లోకాయత సిద్ధాంత ప్రకారం దేహానికి భిన్నంగా ఆత్మ లేదు.

భారతీయ తత్వశాస్త్ర సిద్ధాంతాలు విజ్ఞానానికి మూలములుగా ప్రత్యక్ష గ్రహణం, అనుమానం. ప్రమాణం, సాదృశ్యం అను నాల్గింటిని సోదాహరణముగా గుర్తిస్తుంది. చార్వాక సిద్ధాంతం వీటిలో ప్రత్యక్ష గ్రహణాన్ని మినహా మిగిలినవేవి విజ్ఞానానికి మూలములు కావని తిరస్కరించినది. భారతీయ తత్వశాస్త్ర సిద్ధాంతాలన్నీ అనుమానాన్ని

విజ్ఞానానికి ఒక మూలంగా అంగీకరిస్తాయి. కాని లోకాయతసిద్ధాంతం మాత్రమే అనుమానాన్ని తిరస్కరించి ప్రత్యక్షగ్రహణం మాత్రమే విజ్ఞానానికి ఏకైక మూలంగా ఆమోదిస్తుంది. లోకాయత సిద్ధాంతం ప్రకారం దేవుడులేడు, కర్మలేదు, పరలోకంలేదు. మోక్షంలేదు, పాప పుణ్యాలకు ప్రతిఫలం అనుభవించడంలేదు. చార్వాకులు విజ్ఞానానికి ఒక మూలంగా అనుమానాన్ని తిరస్కరించిన దాని ఫలితంగానే చార్వాకసిద్ధాంతంపై చెప్పిన వాటినన్నింటిని తిరస్కరించడం జరిగింది.

దర్శనాల్లో ప్రసిద్ధ దర్శనమైన సాంఖ్యముకూడ "అనుమానాన్ని" అంగీకరించింది. అందుకే అది భావవాదంలోకి జారి పోయింది. సాంఖ్యాలు ఈ విధంగా భావించాయి.

దృష్ట మనుమానమాప్తవచనంచ సర్వప్రమాణ సిద్ధత్వాత్
త్రివిధం ప్రమాణ మిష్టం ప్రమేయసిద్ధిః ప్రమాణార్ధి.

దృష్టమ్=ప్రత్యక్షప్రమాణం; అనుమానం=కార్యము నుండి కార్యము నూహించుట; ఆప్తవచనం=మిత్రవచనం

ఈ మూడు ప్రమాణాలుంటే ఇతర ప్రమాణాలు అక్కరలేదు ప్రమాణాలు ఎందుకంటే వాస్తవ విషయాన్ని (ప్రమేయం) తెలుసు కోవడానికి అనేది తెలుస్తుంది.*

ప్రకృతిమూలాన్ని అన్వేషించడానికి అనుమాన కారణాన్ని కాదన్నారు చార్వాకులు. సాంఖ్యాలు అనుమానాన్ని, ఆప్తవచ నాన్నికూడ అంగీకరించినారు. అందుకే వారు ప్రకృతిని గురించి ఎంతో విలువైన వ్యాఖ్యానం చేసినా, కొంత భావవాందలోకి జారారు.

---

* ఈశ్వరకృష్ణుడు సాంఖ్యంలో వ్రాసిన కారికలు—నెం. 4.

పదార్థజ్ఞానం వాస్తవ దృక్కులనుండి పరిశీలించవలసినట్టి
కాని మోక్షజ్ఞానం దానికి భిన్నము, మోక్షజ్ఞానాన్ని నిరూపించడా
ఉపపత్తుల సంఖ్య ఎక్కువదానికి వాస్తవం పునాది కాదు. తర్క
భావన, మీమాంస మొదలగునవి. ఈ ఉపపత్తులను "న్యాయ
దర్శనము"లో గౌతముడు ఈ విధంగా పేర్కొంటున్నాడు.

> "ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత
> సిద్ధాంతావయవ తర్క నిర్ణయ వాద జల్ప వితండా
> హేత్వాభాసచ్ఛల జాతి నిగ్రహ స్థానానాం
> తత్వ జ్ఞానాన్నిః శ్రేయ సాధిగమః"

ప్రమాణములు, ప్రమేయము, సంశయము, ప్రయోజనము
దృష్టాంతము, సిద్ధాంతము, అవయవములు, తర్కము, నిర్ణయము
వాదము, జల్పము, వితండము, హేత్వాభాసములు, ఛలము, జాతు
నిగ్రహస్థానములు అను ఈ పదునారు పదార్థముల యదార్థజ్ఞాన
వలన మోక్షప్రాప్తియగును.

ఈ ప్రమాణాలను ఆధారం చేసికొనే పదార్థవాదులు, భా
వాదులు రెండు తెగలుగా (రెండుశిబిరాలుగా) చీలినారు. భౌ
వాదులకు, భావవాదులకు వారు నిరూపించదలచుకున్న ప్రమాణ
లోను, ఉపనిషత్తులలోను, తీవ్రమయిన వైరుధ్యం తారసిల్లింది. భా
వాదులకు, భౌతికవాదులకున్న స్పష్టమయిన తేడాను "Mauri
Cornforth", ఈ విధంగా వర్ణించాడు.

## భౌతికవాద సూత్రములు

1. Materialism teaches that the world is by its ver
nature material, that everything which exists comes in
being on the basis of material causes, arises and deve
lops in accordance with the laws of motion of nature.

భౌతికవాదం బోధించేదేమంటే - ప్రపంచం సహజసిద్ధంగా పదార్థమయం; ఉనికిలో ప్రతిదీ ఉన్న భౌతిక కారణాల ఆధారంగానే రూపు దాల్చుతుంది, ఉత్పన్నమవుతుంది. ప్రకృతి చలన సూత్రాల ననుసరించి అభివృద్ధి చెందుతుంది.

2. Materialism teaches that matter is objective reality exicting outside and independent of the mind; and that far from the mental existing in separation from the material; everything mental or spiritual is a product of material processes.

పదార్థం బాహ్యమయిన వాస్తవమని, అది మనసుకు వెలుపల స్వతంత్రంగ ఉనికలో ఉంటుందని, భౌతిక ఉనికితో సంబంధం లేకుండా పదార్థంతో విడివడిన మానసిక లేక ఆత్మసంబంధమయిన ప్రతిదీ భౌతిక క్రమంలోని ఉత్పత్తిఅని భౌతికవాదం భోధిస్తుంది.

3. Materialism teaches that the world and its laws are fully knowable, and that, while much may not be known there is nothing which is by nature unknowable.

ప్రపంచం దాని నియమాలు పూర్తిగా తెలుసుకోదగినవేనని, అయితే హెచ్చుభాగం అజ్ఞానం అయివుండవచ్చని ప్రకృతి సిద్ధంగా తెలుసుకోలేనిది ఉండదని భౌతికవాదం బోధిస్తుంది.

## భావవాద సూత్రములు :

1. Idealism asserts that material world is dependent on the spiritual

భౌతిక ప్రపంచం ఆత్మసంబంధమయిన దానిపై ఆధారపడి వుందని భావవాదంచెబుతుంది.

2. Idealism asserts that spirit or mind ro idea can and does exsit in separation from matter. (The most extreme from of this assertion is subjective Idealism which asserts that matter does not exist at all but is pure illusion.)

ఆత్మలేక మనసులేక భావం పదార్థంనుండి విడిగా ఉనికిలో వుండగలదని, వుంటుందని భావవాదం వక్కాణిస్తుంది



చార్వాకదర్శనం

(ఈ వక్కాణపు అత్యంత అంత్యరూపం బాహ్యారహిత భావవాదం. అది పదార్థం ఎంత మాత్రం లేదనీ. అదంతా శుద్ధ భ్రమలనీ వక్కాణిస్తుంది.)

3. Idealism asserts that there exists a realm of the mysterious and unknowable 'above' or 'beyand' or 'behind' what can be ascertained and known by Perception experience and science.

నిగూఢ అజ్ఞాన రాజ్యం "మీద" లేక "అవల" లేక "వెనుక" ఒకటుందని భావవాదం వక్కాణిస్తుంది! ఆవిషయాన్ని మనం జ్ఞానం ద్వారా అనుభవం ద్వారా విజ్ఞాపన శాస్త్రం ద్వారా నిర్థారింపగల మని అంటుంది.

దీనినిబట్టి భావవాదం ప్రకృతి నిజంగా వున్నదని ఒప్పుకోదు. ఆలోచన అనగా ఆత్మ మాత్రమే ప్రధానమని చెబుతుంది. ప్రపంచ ఆత్మనుండి పుట్టి, ఆత్మమీద ఆధారపడివుంటుందని చెబుతుంది. అందు కని భావవాదులు ఆలోచన ప్రధానమని, ఆ తర్వాతనే పదార్థంవచ్చిం దని వాదించుతారు. దీని ప్రకారం దేవుని ఆలోచనద్వారా ఈ సృష్టి అంతా తయారు చేయబడివుందని చెబుతారు.

ఉదా :- మనం ఒక చెట్టును చూశామనుకోండి. అది నిజంగా చెట్టుకాదు. చెట్టుఅనే ఆలోచన మెదడులో జనించింది. కాబట్టి అది చెట్టు అయింది. కాని వాస్తవంగా చెట్టు అచ్చట లేదు. దీని అర్థం మొత్తం ప్రపంచం ఆలోచననుండే పుట్టింది. వాస్తవంగా ఈ ప్రపంచం లేదు. ఇది అంతా భ్రాంతి (కల) మాత్రమేనని చెబుతారు.

భౌతికవాదం ఇట్లుగాక ఈ ప్రపంచానికి మూలం పదార్థం అని చెబుతుంది. ఈ ప్రపంచమంతా నిజంగావుందని చెబుతోంది. ప్రపంచానికి మూలమైన పదార్థాన్ని నాశనం చేయడంకాని, తయారు చేయడంకాని సాధ్యంకాదు. అందువలన దీనిని ఎవరూ సృష్టించాల్సిన అవసరం లేదు. అనగా భగవంతుడు లేడని అర్థం. ఇంతటి మహత్తర మైన భౌతికవాదానికి మూలమయిన సూత్రాలు చార్వాకులుప్రాచీన కాలంలోనే చెప్పి చరితార్థులయ్యారు.

## చైతన్యానికి మూలం పదార్థం :

కిణ్వాదిభ్యః సమేతేభ్యో
ద్రవేభ్యో మదశక్తివత్ ।
అహం స్థూలః కృశోస్మీతి
సామానాధి కరణ్యతః

కొన్ని పదార్థములు కలయికచే మత్తును కల్గించుశక్తి పుట్టుచున్నట్లే భూతముల కలయిక నుండి చైతన్యం పుట్టును.

ఈ విషయమును జైనతత్వ శాస్త్రజ్ఞుడయిన హరిభద్రుడు తనభార
ఆయ తత్వశాస్త్రమను బృహద్గ్రంథములో ఈవిధంగా విశదీకరించాడు.

"సత్కర్మ, దుష్కర్మ, ఫలితములయిన సుగుణ దుర్గుణములు,
ఆత్మజీవన్ముక్తి అనునదేదీ లేదని, లోకాయతులంటారు. గతించినదేదీ
తిరిగిరాదు. నాలుగు భౌతిక భూతములయిన పృథ్వి (మట్టి), జలము
(నీరు), అగ్ని (నిప్పు), వాయువు (గాలి) ల యొక్క సమ్మేళనమే ఈ
దేహమనబడును. ఈ చతుర్భూతములే చైతన్యమునకాధారములు!
అనగా వీటి సమ్మేళనము నుండి చైతన్యముద్భవించును. ఇంద్రియ
గోచరమైనది మాత్రమే జ్ఞానమునకు సరియైన మూలభూతము, మద్య
పానీయము తయారుచేయుటకు ఉపయోగించు వివిధ వస్తువుల సమ్మే
ళనము నుండి మత్తుకల్గించుశక్తి ఉద్భవించునట్లు పృథ్వి, జలము, అగ్ని,
వాయువు అనెడి చతుర్భూతముల సమ్మేళన ఫలితమే ఈ దేహ నిర్మా
ణము. అలాగుననే ఆత్మ (అంతర్వాణి) దేహనిర్మాణమునకావలసిన

పదార్థ భూతములనుండి ఉద్భవించును. కావున గ్రహింపలేనిదాని(స్వర్గ సుఖము) కోసం వెంపరలాడుటకై గ్రహించకల్గినదానిని (ఇహలోక సుఖములను) త్యజించుట మూర్ఖమని చార్వాకులందురు. X

తర్వాత కాలపు హరిభద్రుని (షడ్దర్శన సముచ్చయము) వ్యాఖ్యాతయయినగుణరత్న (తర్కరహస్య దీపికకర్త) ఆత్మనుపూర్తిగా ఖండించు ఉద్దేశ్యముతో లోకాయతుల ఆత్మతిరస్కారమును గురించి సుదీర్ఘమయిన వివరణ ఇచ్చాడు.

(Gunaratna a late commentator of Haribhadra gives the most elaborate account of the Lokayata denial of the soul for the purpose of completely refuting it.) X

ఈ విషయాన్ని దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ వివరణాత్మకంగా ఈ విధంగా వివరించారు.

ఈ దృష్ట్యా చైతన్యం భౌతికమయిన మూలపదార్థాల నుండి మాదకశక్తి ఉత్పన్నమయిన మాదిరిగానే ఉత్పన్న మవుతుంది. సజీవ ప్రాణి నీటిలోని బుద్బుదప్రాయం మానవమాత్రుడు చైతన్యంతో కూడిన దేహి మాత్రమేకాని వేరొకటికాదు. చైతన్యలక్షణముతో పర లోకములకు వలసపోగలిగిన ఆత్మ అనబడునదేదీ లేదు.

చైతన్యం పంచభూత జన్యము. కాగా అది ఈ పంచభూత మిశ్రమం విచ్ఛిన్నం కాగానే ఆ భూతాలతో పాటు నాశనమవుతుంది. కావున మరోలోకానికి వలస పోవడం అసంగతం. మట్టినుండి పుట్టిన ఈ దేహం అనగా నేల, నీరు, నిప్పు, గాలి అనే భూతాల నుంచి జనించిన దేహం అంతర్వాహిని కలిగి వుంటుంది.

మాదకశక్తి చెరకుమడ్డి ధాతువులు మున్నగు వానినుండి జనించిన విధంగా శరీరంతో అంతర్వాణి జనిస్తుంది. ఈ దృష్ట్యా ఆత్మపదానికి అర్థం శరీరమే గాని ఆత్మ కాదు.

---

X What is living and what is dead in Indian philosophy (1977) - By Debi prasad Chattopadhyaya—page - 429.
X Lbid.

దేహం భౌతిక పదార్థముల మిశ్రమం. అట్టి ఈ దేహంలో
అంతర్వాణి ఉనికి గలదు. మాదకశక్తి మత్తుపానీయములో చేర్చ
బడిన భాగస్వామ్య పదార్థాలనుండి ఉత్పన్నమయినరీతిగా, భౌతిక
పదార్థాల మిశ్రమంచే ఉత్పన్నమయిన దేహం నుండి అంతర్వాణి
అహంస్ఫృహపర్చడుచున్నది. బృహస్పతి చెప్పినరీతిని నేల, నిప్పు,నీరు,
గాలి, యివిమాత్రమే వాస్తవం. వీటి కలయికవల్లపుట్టినదే శరీరం. ఇం
ద్రియాలు, ఇంద్రియజ్ఞానాలు, అంతర్వాణి వీటికి మాత్రమేచెందినది.

(In this view, consciousness originates from the material
elements in the way in which originates the intoxicating power
living being is like a bubble in water. The human being is no.
thing but the body endowed with consciousness....There is noth-
ing called soul with the characteristic of consciousness and ca-
pable of migrating to the other world. Consciousness is the
product of the five material elements: hence it is destroyed
with the destruction of (the combination of) these elements
Therefore, migration to the other world is absurd. The
body made of earth etc. -- i.e. of the elements called earth,
water, fire and air-is endowed with consciousness. Just as the
intoxicating power originates only from the molasses,metal,etc.
so also consciousness originates in the body. In this view the
world self or atman means the body and not soul. The
body is made of the combination of the material elements and
in this body exists Consciousness. Just as the intoxicating
power emerges in the ingredients of alcoholic drink, so also
the sense of the self and consciousness emerge in the body
resulting from the combination of the material elements. As
Brhaspathi says Earth, water, air and fire-these alone are real.
The products of their combination are known as body, obje-
cts and senses. Consciousness belongs only to them.) •

చార్వాకులు ఇంకా విలువైన భౌతిక సిద్ధాంత విషయములు
ఆ కాలానికి వారు గ్రహించినంతలో వివరించారు. వ్యాసవిస్తరణ
భీతిచే వాటిని యథాతథంగా ఇస్తున్నాను. పరిశీలించండి.

---

• What is Living and what is Dead in Indian Philosophy —
(1977) By - Debiprasad Chattopadhyaya — page-430.

## దేహమునకు వేరుగా ఆత్మ లేదు.

దేహః స్థౌల్యాది యోగాచ్చ
స ఏవాత్మా వచాపరః।
మమ దేహోఽయమిత్యుక్తిః
సంభవేదౌప చారికీ॥

నేను స్థూలముగా వున్నాను. నేను కృశించి యున్నాను. అను ప్రయోగములందు లావు అగుట, కృశించుట అనునవి రెండు దేహమునందే గోచరించుటవల్ల దేహమే ఆత్మ, దేహముకంటే యాత్మ అనునది వేరేలేదు. అయితే నా శరీరము అనే ప్రయోగము వాడుకలో వచ్చిందేగాని, యదార్థం కాదు. (నేను అంటేనే నా శరీరముతో కూడి అని అందువలన ప్రత్యేకంగా నా శరీరం అని అనవసరం లేదు.)

## కార్యకారణ సంబంధం - శాస్త్రీయత

అవ్యాప్త సాధనోయః
సాధన సమవ్యాప్తి రుచ్యతే స ఉపాధిః।
శబ్దే అనిత్యే సాధ్యా
సకర్తృకత్వం ఘటత్వం అశ్రవతాంచ ॥

పొగవున్న ప్రతి స్థలమునందు నిప్పు వుండవచ్చును గావున పొగకు అగ్ని కారణము. కాని అగ్ని వున్న ప్రతిస్థలమునందును పొగ వుండవలసిన నియమంలేదు. దీనిని "ఉపాధి" అందురు. అంటే కార్య కారణ సంబంధం లేకుండా ఏ సిద్ధాంతాన్నీ ప్రతిపాదించకూడదు. అట్లా ప్రతిపాదించడం దోషం అని చార్వాకులు నిర్దేశించారు.

'శబ్దం బనిత్యం' అన్నపుడు శబ్దానికి కర్త వుంది కాబట్టి కర్త వున్న ప్రతిదీ అనిత్యమని నిరూపించలేము. పుట్టింది గిట్టక మానదు అనేది మాత్రం సరిపోతుంది. కాబట్టి ప్రతి దానికి కార్య కారణ సంబంధాన్ని శాస్త్రీయంగా విశ్లేషించుకొని సమన్వయించాలి. అట్లు గాక సాంప్రదాయ తర్కశాస్త్రం ప్రకారం ఇష్టమొచ్చినట్లు వ్యాఖ్యానిస్తే తప్పుసమాధానాలు వస్తాయని చార్వాకులు చెబుతున్నారు.

హేతువాదానికి మూలం కార్యకారణ సంబంధం- కార్యానికి కారణాన్ని వెదకడం ఏకారణంవల్ల ఏ కార్యం జరుగుతుందో తెలిసికోవడం వలన విజ్ఞానాభివృద్ధి జరిగింది. కార్యకారణ రహితంగా ఆలోచించే వారు భావవాదులయ్యారు. కార్యానికి కారణం తెలియక ఇష్టం వచ్చినట్లు ఊహించి కారణాలు నివేదించడాన్ని చార్వాకులు ఖండించినారు. ఈ విషయంలో సాంఖ్యులు కూడా భావవాదులను త్రోసిపుచ్చి వివేకులను సమర్థించారు.

"దృష్టవత్ ఆనుశ్రవికః
సహ్యవిశుద్ధిక్షయాతిశయయుక్తః ।
దద్విపరీతః శ్రేయాన్
వ్యక్త వ్యక్తజ్ఞ విజ్ఞానాత్ ॥"

కనిపించేకారణాలు పరంపరగా వినబడునవి మాత్రమే. అవి ఈ దుఃఖాన్ని నివారించలేవు. ఎందుకనగా? వాటి నివారణ కర్మలుగా చెప్పబడుతున్న యజ్ఞయాగములన్ని విశదములు కావు. వాటినుండిఏదయినా ఫలము వచ్చినా అది క్షణికమే ఆఫలము పరిమితమే కావున వీటికంటే భిన్నమైన కార్యకారణ పురుష వివేకము వలననే ఈ దుఃఖములు పోగొట్టేమార్గం కలుగుతుంది.

వైశేషిక దర్శనంలో కూడా "కారణాభావాత్ కార్యాభావః" అనిచెప్పబడింది. అంటే కారణములేందే కార్యము లేదు.

ఈ కార్యకారణ సంబంధాన్ని సమన్వయించి విజ్ఞానశాస్త్రాన్ని అభివృద్ధి చేసినందుకీ చార్వాకులను సంఘం వేధించింది ఇక్కడ చార్వాకులు వేధింపబడితే, క్రైస్తవ మతస్తులు, హేతుదృష్టితో విజ్ఞాన శాస్త్రాన్ని వెలిగించిన శాస్త్రవేత్తలను పెక్కుర్ని బాధించింది. కార్యకారణ వివేచన మతానికి శత్రువు. కార్యకారణ విచక్షణకల్గిన వారిని మత కరాళం భక్షిస్తూనే వచ్చింది.

ఈవిషయాన్ని ఫ్రెడరిక్ ఎంగెల్స తన "DialecticsofNature" లో వివరణాత్మకముగా వర్ణించాడు.



చార్వాక దర్శనం

"ప్రకృతిని స్వేచ్ఛగా పరిశీలించిన పరిశోధకులను కాథలిక్కుల కంటే ఎక్కువగా ప్రొటెస్టెంటులు హింసించారు. రక్త ప్రసరణ సిద్ధాంతాన్ని కనిపెట్టిన సర్వెటస్‌ను కొరతవేయించినవాడు కాల్విన్. నిజానికి రెండుగంటలపాటు అతన్ని సజీవంగా దహించినవాడు కాల్విన్. కాథలిక్ మత విచారణ కర్తలు గియార్డనో బ్రూనును జీవంగా దహించివేశారు.

కోపర్నికస్ మరణశయ్యపై నుండి వెనుకాడుతూనే, బహిర్గతమైన అజరామరమయిన గ్రంథం. ప్రకృతి వ్యవహారాలలో మతం జోక్యంకలుగ జేసుకోరాదు, అనే సవాలునువిసిరింది. ప్రకృతిశాస్త్రం తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించిన విప్లవచర్య ఇది. పోప్ ఆజ్ఞాపత్రాన్ని మార్టిన్‌లూథర్ బహిరంగంగా తగులబెట్టిన ఉదంతానికున్నంత ప్రాధాన్యం దీనికున్నది. నాటినుండి మత వ్యవహారాలనుండి సాధారణశాస్త్ర స్వాతంత్ర్యం ప్రకటితమైంది. అయితే ఈపోరాటం ప్రత్యేక విభాగాలలో ఈ నాటికీ కొనసాగుతూనే వున్నది. చాలా మంది మనసులలో ఇది యింకా పూర్తికాలేదు కూడ. కాగా ఆనాటి నుండి విజ్ఞానశాస్త్రాలు పెద్దపెద్ద అంగలువేసుకుంటూ పురోగమించాయి. ప్రయాణం మొదలయిన మజిలీ నుండి ఎంతదూరం గడిచాయో, ఆ దూరానికి ద్విగుణీకృతంగా పురోగమించాయి. సజీవ పదార్థంయొక్క అత్యున్నత రూపమయిన మెదడు అభివృద్ధి సూత్రం నిర్జీవపదార్థ అభివృద్ధి సూత్రానికి విరుద్ధంగాజరుగుతుంది. అని ప్రపంచానికి నిరూపించడానికో అన్నట్లు ఈ పరిణామంజరిగింది. ఆ కాలానికి అందుబాటులోవున్న సమాచారంపై సంపూర్ణ ఆధిపత్యం సంపాదించడం ప్రకృతిశాస్త్ర రంగాలలో నాటి ప్రధాన కర్తవ్యం. చాలా విభాగాలలో ఓనమాల నుండి ప్రారంభించవలసి వచ్చింది. ప్రాచీనవారసత్వంగా యూక్లిడ్ టోలిమల్ నక్షత్రకూటమిలభించాయి. దశాంశ గణితాన్ని, బీజగణితాన్ని, ఆధునిక సంఖ్యావాచకాన్ని, రసవాదాన్ని అరబ్‌లు యిచ్చి వెళ్లారు. క్రైస్తవ మధ్యయుగాలు ఏమీ సమకూర్చలేదు. సహజంగానే ఈపరిస్థితిలో భౌగోళిక, అంతరిక్షగోళాల చలనశాస్త్రం అతి మౌలికమయిన ప్రకృతిశాస్త్రంగా

ప్రథమస్థానం వహిస్తుంది. దాంతో పాటు దాని పనికి తగ్గా గణిత
శాస్త్ర పద్ధతుల ఆవిష్కరణ, పరిపక్వీకరణ - ప్రాముఖ్యతకు వస్తాయి.
ఈ రంగంలో ఘనవిజయాలు లభించాయి. న్యూటన్, లిన్నేయస్ లతో
అంతమైన ఈ యుగంలో ప్రకృతి శాస్త్రాలకు చెందిన ఈ విభాగాలు
ఒక విధమయిన పరిపక్వతకు చేరుకున్నాయి. అతి ప్రధానమయిన
గణిత పద్ధతుల మౌలిక లక్షణాలు ధృవీకరణ పొందాయి. డేకార్టే
విశ్లేషణాత్మక రేఖాగణితం ముఖ్యంగా నేపియర్, లాగరిథంస్, లీబ్నిజ్,
న్యూటన్ ల భేదాత్మక సర్వాంగీన కాల్క్యులస్ -ఇవన్నీ స్థిరపడ్డాయి.
కఠిన వస్తువుల చలనశాస్త్రం విషయంలోను ఇదే వర్తిస్తుంది.ఇందుకు
సంబంధించిన ప్రధాన నియమాలు శాశ్వతంగా స్థిరరూపం ధరిం
చాయి. చివరకు ఖగోళశాస్త్రరంగంలో గ్రహసంచార నియమాలను
కెప్లర్ ఆవిష్కరించాడు. పదార్థం యొక్క సాధారణ చలనసూత్రాల
దృష్ట్యా న్యూటన్ వాటిని తిరిగి నిర్వచించాడు." *

(And it is characteristic that Protestants out did Catholics
in persecuting the free investigation of nature. Calvin had Ser-
vetus burnt at the stake when the latter was on the point of dis-
covering the circulation of the blood, and indeed he kept him
roasting alive during two hours; for the Inquisition at least it
sufficed to have Giordano Bruno simply burnt alive.

The revolutionary act by which natural science declared
its independence and, as it were repeated Luther's burning of
the Papal Bull was the publication of the immortal work by
which Copernicus, though timidly and, so to speak, only from
his death-bed, threw, down the gauntlet to ecclesiastical auth-
ority in the affairs of nature. The emancipation of natural
science from theology dates from this, although the fighting
out of particular mutual claims has dragged on down to our day

* — Dialectics of Nature — (Page - 22-23) — ( మార్క్స్
ఏంగెల్స్ - "మతాన్ని గురించి" అను తెలుగు అనువాద
గ్రంథం నుండి -అనువాద భాగం తీసుకున్నాము)

and in many minds is still far from completion. Thenceforward, however, the development of the sciences proceeded with giant strides, and, it might be said, gained in force in proportion to the square of the distance (in time) from its point of departure. It was as if the world were to be shown that henceforth, for the highest product of organic matter. the human mind, the law of motion holds good that is the reverse of that for inorganic matter.

The main work in the first period of natural science that now opened lay in mastering the material immediately at hand. In most fields a start had to be made from the very beginning. Antiquity had bequeathed Euclid and the Ptolemaic solar system; the Arabs had left behind the decimal notation, the beginnings of algebra, the modern numerals, and alchemy; the Christian Middle Ages nothing at all. Of necessity, in this situation the most fundamental natural science, the mechanics of terrestrial and heavenly bodies, occupied first place, and along side of it, as handmaiden to it, the discovery and perfecting of mathematical methods. Great things were achieved here. At the end of the period characterised by Newton and Linnaeus we find these branches of science brought to a certain perfection. The basic features of the most essential mathematical methods were established; analytical geometry by Descartes especially, logarithms by Napier, and the differential and integral calculus by Leibniz and perhaps Newton. The same holds good of the mechanics of rigid bodies, the main laws of which were made clear once for all. Finally in the astronomy of the solar system Kepler discovered the laws of planetary movement and Newton formulated them from the point of view of the general laws of motion of matter.

ఈ విధంగా కార్యకారణ వివేచనా రహితమయిన మత శక్తుల ధాటికి తట్టుకుంటూ విజ్ఞాన వేత్తలు ఏవిధంగా ముందుకు సాగారో ఎంగెల్స్ ప్రతిభావంతమయిన విశ్లేషణలో చూశాము.

# బలి స్వర్గ మార్గమా ?

శ్లో॥ పశుశ్చేన్నిహతః స్వర్గం
జ్యోతిష్టోమే గమిష్యతి ।
స్వపితా యజమానేన
తత్రకస్మాత్ నహింస్యతే ?॥

అర్థం :- జ్యోతిష్టోమ యజ్ఞంలో చంపబడిన పశువు స్వర్గమునకు వెళ్ళేట్లయితే యజమానుడు తన తండ్రిని ఎందుకు బలి ఈయడు ?

వ్యాఖ్య : వైదిక సంస్కృతిలో జంతుబలులు చాలా ప్రాధాన్యత వహిస్తున్నాయి. జంతువులను బలి యివ్వడం వలన స్వర్గానికి వెళతామనే నమ్మకం వలన ఈ బలులు రకరకాల పేర్లతో అభివృద్ధి చెంది మానవ సంస్కృతిని కలుషితం చేశాయి. ఈ వైదిక ఆచార కర్మకాండను వందలాది సంవత్సరాలు విస్తృతంగా కొనసాగించిన వైదిక ఋషులు గోమాంస భక్షణకు మిక్కిలిగా అలవాటుపడ్డారు. బలివ్వడం వల్ల, ఇచ్చినవారే కాదు- యివ్వబడ్డ జంతువు కూడా స్వర్గానికి పోతుందనే వంకతో రకరకాల యజ్ఞాల పేరుతో జంతుబలులు సాగించారు. అసలు చారిత్రక దృష్టితో చూసినప్పుడు ఆర్యఋషులు ఈ దేశంలోకి పశు పాలకులుగా ప్రవేశించారు. గోపాలకులు (గోవులను పాలించేవారు), గవేషణ (గోవులను వెదకడం), గోపతి (గోవుల కధిపతి), గోమేధం (గోవులతో చేయు యజ్ఞం), గోఘ్నుడు (అతిధిగా వచ్చి గోవులను చంపించువాడు), గోత్రం (గోశాల) అని వారిని పెన్నాడుతూ వచ్చిన ఈ విశేషణాలే వారి వృత్తిని ప్రకటిస్తున్నాయి. * అస్పృశ్యులుగా కొన్ని వేల సం॥రాలు [illegible] గా [illegible] ఉండి, గత్యంతరం లేక గోమాంస భక్షణ చేస్తున్న అంటరాని వారిని, [illegible] కాలంలో బౌద్ధ ప్రభావం వల్ల గోమాంసాన్ని మానివేసిన [illegible] కేవలం గోమాంస భక్షణ వల్లనే అంటరాని వారిని [illegible] ఋషులు [illegible] దూరంగా ఉంచుతున్నా మంటున్నారు. వారి పురాతన [illegible] హేయమైనదో వారే పరిశీలించుకోవలసి యున్నది. ఈ విషయాన్ని [illegible] అంబేద్కర్ తన పరిశీలనాత్మక గ్రంథము (The untouchables who were they, and why they became untouchables) "అస్పృశ్యులెవరు ? [illegible]" వివరణాత్మకంగా వివరిస్తాడు.

---

* కులం పునాదులు, రచయిత కత్తి పద్మారావు.

ఆర్యులు ఆహారార్థం గోవుని వధించారనీ, గోమాంస భక్షణ చేశారనీ ఋగ్వేదంలోనే వుంది. ఋగ్వేదంలోని ఒక ఋక్కులో ఇంద్రుడు "నా కోసం యజ్వలు 35 వృషభాలను వండుతారు" అంటాడు. మరొకచోట అగ్నిదేవునికి గుర్రాలు, ఎద్దులు, వృషభాలు, వట్టిపోయిన ఆవులు, పొట్టేళ్ళు బలియివ్వబడ్డాయని చెప్పబడింది. ఋగ్వేదాన్ని బట్టి, గోవు గొడ్డలితో గానీ, కృపాణంతో గానీ వధింపబడ్డట్లు తెలుస్తుంది.

శతపథ బ్రాహ్మణంలో కనిపించే సాక్ష్యం కడపటిది కావాలడు. ఇతర బ్రాహ్మణాలు వేరొక అభిప్రాయం కలిగిస్తాయి.

ఒక్క ఉదాహరణ చెప్తాను. తైత్తరీయ బ్రాహ్మణంలో చెప్పిన కామ్యేష్టి యజ్ఞాలలో గోవృషభాలను బలి యివ్వటమే కాకుండా, బ్రాహ్మణంలో చెప్పిన పంచమేష్టి యజ్ఞంలో గోవృషభాలని బలి యివ్వాలని కూడా వుంది. అంటే- విష్ణువుకి పొట్టి వృషభాన్ని, ఇంద్రుడికి వాలిన కొమ్ములు ఎర్రని రంగుగల సుడిగల వాటినీ, పోషనీ దేవుడికి నల్ల ఆవును, రుద్రుడికి ఎర్రగోవుని- ఆ రకంగా బలి యివ్వాలని నిర్దేశింపబడింది. అందులోనే పంచశరదీయ సేవ అనే మరొరకమైన బలిని గూర్చి కూడా ప్రస్తావించబడింది. అందులో ముఖ్యాంశం ఏమంటే- 5 ఏళ్ళ వయస్సువి 17 పొట్టిగిత్తల్ని, అదే సంఖ్యలో మూడేళ్ళు నిండని పొట్టిపెగల్ని బలి యివ్వాలని చెప్పబడింది.

ఆపస్తంభ ధర్మసూత్రంలో ఉల్లేఖింపబడింది అని మనం ఇంతకు పూర్వం చెప్పుకున్న ప్రకటనకు ప్రతికూలంగా ఈ క్రింది అంశాలు గమనించాలి. మొదటి అంశం- అదే సూత్రంలో 15, 14, 29 భాగాల్లో విరుద్ధ ప్రకటన ఉంది. "గోవు, వృషభం పవిత్రమైనవి. అంచేత వాటిని భుజించాలి".

రెండవది- వివిధ గృహ్య సూత్రాలలో మధుపర్కం ఎలా ఉండాలో వివరింపబడింది. ఆర్యుల్లో యింటికెవరైన ముఖ్యఅతిధి వచ్చినపుడు అతనికి గృహస్థు మధుపర్కాన్నివ్వాలి. ఇది వాళ్ళకొక ఆచారపరమైన వాడుకగా ముఖ్య అతిథుల ఆహ్వానానికి మర్యాదగా పరిణమించింది. ఆ విందులో ముఖ్యంగా వడ్డన చేయవలసింది మధుపర్కం. ఆ మధుపర్కం ఎలా తయారుచెయ్యాలో వివిధ గృహ్య సూత్రాలలో వివరించబడింది. ఆ సూత్రాల ప్రకారం మధుపర్కం పొందే హక్కు 1) ఋత్విజునికి, 2) గురువుకు, 3) వరునికి, 4) రాజుకు, 5) స్నాతకునికి అంటే- గురుకులంలో విద్య ముగింపు చేసుకున్న విద్యార్థి 6) గృహస్థుడు

ఋష్టుడైన వ్యక్తికి వుంది. కొందరు అతిథిని కూడా ఈ జాబితాలో చేర్చారు. ఋత్విజుడు, రాజు, ఆచార్యుడు వీరికి వచ్చినప్పుడల్లా మధుపర్కాన్ని అర్పించ వాల్సి వుంటుంది. మిగతావారికి ఏడాదికొకసారి పెట్టాలి.

మధుపర్కం దేనితో తయారు చేస్తారు అనే అంశం మీద ఏకాభిప్రాయం లేదు. ఒక్కొక్క గృహ్యసూత్రం ఒక్కొక్క మాదిరిగా చెప్పింది. ఈ సూత్రాలలో చాలావరకు మధుపర్కం వంటకంలో, తేనె, పెరుగు, వెన్న, నెయ్యి మరిన్ని పాలు, కాయధాన్యాలు ఉపయోగించాలని నిర్దేశింపబడింది. మాంసం లేని మధుపర్కం సమర్పించకూడదని వేదాలు చెప్పాయని మాధవ గృహ్యసూత్రంలో వుంది. గోవుని వదిలేస్తే గోమాంసానికి బదులు మేక మాంసాన్ని గాని, పంది మాంసాన్ని గాని పెట్టవచ్చునని కూడా చెప్పబడింది. ఇంకా తదితర గృహ్యసూత్రాల్లో కూడా గోవును వదిలేస్తే ఏదో మాంసం- మేక, పొట్టేలు అడవి జంతువు, లేదా వీటి మాంసం వుండాలని చెప్పబడింది. అంటే- మాంసం లేకుండా మధుపర్కం లేదని చెప్పాయి. కాబట్టి మధుపర్కంలో ముఖ్యంగా ముఖ్యమైనది మాంసం. అందునా గోమాంసం.

అతిథి వచ్చినప్పుడల్లా గోవును చంపడమనేది ఎంతవరకు వెళ్ళిందంటే అతిథి "గోఘ్న" అని పిలవబడసాగాడు. "గోఘ్న" అంటే గోవును చంపే వాడు అని అర్థం. గోవధ తప్పించడానికి అశ్వలాయన గృహ్యసూత్రంలో ఒక చిట్కా చెప్పబడింది. అతిథి వచ్చినపుడు, ఆవును వదిలివేసినట్లయితే ఆ ధర్మం నుంచి తప్పించుకోవచ్చు.

మూడు- మృతదేహానికి జరిపే అంత్యక్రియలు, కర్మకాండ ఆపస్తంబ ధర్మసూత్రంలో చెప్పిన దానికి ప్రతికూలంగా వుంది.

అశ్వలాయన గృహ్యసూత్రాలలో అంత్యక్రియలు, బలి మొదలైన వాటిని గురించి సుదీర్ఘంగా చర్చించబడింది. దాని ప్రకారం ప్రాచీన ఇండో ఆర్యన్ ప్రజలలో ఒక వ్యక్తి మరణించినప్పుడు ఒక జంతువును చంపేవాళ్ళు. ఆ జంతువు యొక్క వివిధ అంగాలను మృతుని దేహం మీద ఆ అవయవానికి ఆ అవయవం పెట్టేవాళ్ళు. ఆ తరువాత మాత్రమే దహనక్రియ చేసేవాళ్ళు.

పై లోతైన పరిశీలనను బట్టి జంతుబలి, జంతుహననం, జంతుమాంసం పొందడం జరిగింది. మాంసాన్ని పవిత్రంగా భావించడం, దీనినే స్వర్గమార్గంగా తన ఆహారార్థం ఉపయోగించడంలో తప్పులేదు. కాని, ఇంద్రాది దేవతల కోసంగా

చెప్పి వాటిని బలి యివ్వడం వల్లనే స్వర్గానికి వెళతామని భావించడాన్ని, బలి ఇవ్వబడ్డ జంతువులు కూడా స్వర్గానికి వెళతాయనే కట్టుకథని చార్వాకులు అనాదే తర్కబద్ధంగా విమర్శించారు. ఇప్పుడీ బలిచ్చేవాడు మహా పురుషుడుగా చలామణీ అవుతున్నాడు. ఆహారార్థం జంతువును వధించేవాడు నీచుడుగా భావింప బడుతున్నాడు. మానవుడు వాడి ఆకలిని తీర్చుకొనడానికి ధనయులు అందుబాటులో లేని పరిస్థితులలో జంతుమాంసం తినడం తప్పుకాదు. కాని స్వర్గం ఒకటుందని, దానికి జంతు బలిదానంవల్ల బలియిచ్చినవాడు, బలియివ్వబడ్డ జంతువు ఆ స్వర్గానికి వెళతారనే భావాలన్నీ తప్పుడువే అని చార్వాకులు చమత్కారంగా ఈ ప్రశ్న వేశారు. ఒకవేళ జ్యోతిష్టోమం అనే యజ్ఞంలో చంపబడ్డ పశువు స్వర్గానికి వెళ తుందనే నమ్మకం నీకుంటే నీ తండ్రి స్వర్గానికి వెళ్ళాలని భ్రమిస్తున్న నీవు నీ తండ్రిని యజ్ఞములో వధించి ఏల స్వర్గానికి పంపవు ? అని ప్రశ్నించారు. ఈ ప్రశ్న యజ్ఞయాగాదుల పునాదులు కదిల్చివేసే ప్రశ్న. ఈ ప్రశ్నకు సమా ధానం ఇంతవరకు లేకపోగా ఏదో ఒక పేరుతో భారతదేశ వ్యాప్తంగా ఈ యజ్ఞ యాగాది కర్మకాండయిప్పటికీ సాగుతుంది. వర్షాలు లేవంటే యజ్ఞాలు, పిల్లలు పుట్టడం లేదంటే యాగాలు, కోర్కెలు తీరడానికి బలులు నిరంతరం కొనసాగు తూనే వున్నాయి. అందుకే చార్వాకులు అనాది నుండి ఈ అనాగరిక చర్య మీద తిరగబడుతూనే వున్నారు.

## చార్వాకులు - కాపాలికులు :

చార్వాకులకు, కాపాలికులకు వున్న సంబంధాన్ని హెచ్. పి. శాస్త్రి ఈ విధంగా వివరించారు.

"But the most important piece of information the Brhaspati Sutras give us is the close connection of the Lokayatas with the Kapalikas. He says for the production of wealth Lokayata is the Sastra; at the same breath he says, for 'Kama or earthly enjoyments Kapalika is the Sastra. At the same time he says for religious merit, Arhata is the Sastra. If Brhaspati says so he is sure to be denounced by the orthodox people as Nastika. But that is not our present purpose, our present purpose is the Kapalika. These are always looked down upon by all classes of people. They are fond of cruel rites. None can forget the fierce Kapalika bent upon woman sacrifice in Bamkim chan-

dra's most charming novel, Kapalakundala. The scenes in that work are laid in the Bengal coast in the early Seventeenth Century. In the year 1092, Krisna Misra, in his wonderful allegorical drama the 'Prabodha candrodaya' introduces a Kapalika. and a Kapaliki to test the character for continece of a Buddhist monk and of a digambara Jaina friar. The pair is bent upon Kamasadhana. Bhavabhuti speaks of a Kapalika Aghoraghanta and a Khapaliki, Kapalakundala ;bent upon the Seduction of Malati and upon her destruction. But the Brhaspati Sutras tell us that the Kapalikas are an ancient sect at least as ancient as the Lokayatas, and that as the Lokayatas with the Materialistic Philosophy made the beginning of the Science of Economics, so the Kapalikas with what system of philosophy we do not know, made the beginning of the Science of Erotics. Brhaspati considers them as distinct sects, but 'Gunaratna' identifies the Kapalikas with the Lokayatikas.

The influence of the Lokayatikas and of the Kapalikas is still strong in India. There is a sect and a numerous one too, the followers of which believe that deha or the material human body is all that should be cared for, and their religious prac- tices are concerned with the union of men and women and their success (Siddhi) Varies according to the duration of the union. These call themselves Vaisnavas, but they do not believe in Visnu or Krisna or his incarnations. They believe in deha, They have another name Sahajia which is the name of a sect of Buddhists which arose from Mahayana in the last four centuries of their existence in India. But Brhaspati Sutra gives the idea that there are more Kapalikas bent on Kamasadhana than Buddhists. *

బృహస్పతి సూత్రాలు లోకాయతులకు, కాపాలికులకు మధ్య సన్నిహిత సంబంధం ఉన్నట్లు వివరణ ఇస్తున్నాయి. బృహస్పతి లోకాయత శాస్త్రం ఉత్పత్తి సృష్టికి మూలమైనదిగా చెప్పాడు. అదే సమయంలో కామము (దేహ) భూలోక సౌఖ్యాలకు కాపాలికమొక శాస్త్రమని [illegible] అంటున్నాడు. 'లోకాయ[illegible]

* Studies in the History of Indian philosophy Vol II Editor deviprasad Chattopadhyaya (1978) Lokayata (Essay) H. P. Sastry (Page, 30 31)

తులు' ఎంత ప్రాచీనశాఖకు చెందినవారో కాపాలికులు కూడా అంతే ప్రాచీనమైన వారని ఆయనన్నాడు. తమ భౌతికవాద సిద్ధాంతంతో చార్వాకులు 'అర్థిక శాస్త్రానికి' పునాదులు వేశారని కూడా ఆయన వ్యాఖ్యానించాడు.

అందువల్లనే చార్వాకుల భౌతిక సిద్ధాంతాలకున్న స్పష్టత, శాస్త్రీయత ఇతర సిద్ధాంతాలకు వాటి అనుచరులకు లేదు. చార్వాకాన్ని భావవాద ఛాయలున్న ఏ సిద్ధాంతంతో సమన్వయం చేయాలన్నా కుదరదని దానిలోని స్పష్టత, శాస్త్రీయత, చారిత్రకత మనకు ప్రకటిస్తున్నాయి. కాపాలికులు తర్వాత కాలాల్లో మత చాందస కర్మకాండలోకి జారిపోయిన విషయం గుర్తించదగినది.

'చార్వాకం' ఏ చారిత్రక కాలంలోను మతభావాలకు ప్రభావితం కాకుండా, స్వతంత్రంగా తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొంది. భారతదేశంలో అవైదిక సిద్ధాంతాలన్నింటినీ ముందుకు తీసుకువెళ్ళే జీవగర్ర అయ్యింది.

## శ్రాద్ధం:

శ్లో॥ మృతానామపి జంతూనాం
శ్రాద్ధంచేత్ తృప్తి కారణం।
నిర్వాణస్య ప్రదీపస్య
స్నేహః సంవర్ధయేత్ శిఖాం॥

మరణించినవారికి శ్రాద్ధమే తృప్తిని కలిగించినచో ఆరిపోయిన దీపమును నూనె ఏల వెలిగించదు.

వైదిక సంస్కృతిలో అతిప్రధాన స్థానాన్ని వహిస్తున్న శ్రాద్ధమంటే ఏమిటో తెలిసికొంటే గాని దాన్ని ఖండించిన చార్వాకుల అభిప్రాయం మనకు బోధపడదు.

గౌతమధర్మ సూత్రాల్లో శ్రాద్ధమంటే ఈ విధంగా చెప్పబడినది.

606 అథశ్రాద్ధం (౨-౨-౧)

ఈ సూత్రమునకు హరిదత్తుని వ్యాఖ్య ఈ విధంగా వున్నది.

అథేతి: అథశబ్దోఽధికారార్థః శ్రాద్ధం నామ కర్మాధిక్రియతే.

హరదత్త మితాక్షరా- అథేతి: అథశబ్దోఽధికారార్థః శ్రాద్ధం నామ కర్మాధిక్రియతే. శ్రద్ధా యత్ర విద్యతే తచ్ఛ్రాద్ధంత చ్ఛ పంచవిధమ్. శ్లో॥ నిత్యం

స్థితి నొందఁ గూర్చుటకై శ్రద్ధతో చేయబడునట్టి కర్మకలాప మెయ్యది గలదో అది శ్రాద్ధమని యనంబడును.

ఆ శ్రాద్ధము అయిదు విధములు. ౧) నిత్యశ్రాద్ధము ౨) నైమిత్తిక శ్రాద్ధము ౩) కామ్య శ్రాద్ధము ౪) వృద్ధి శ్రాద్ధము ౫) పార్వణ శ్రాద్ధము అని శ్రాద్ధమైదు విధములని తెలియదగునని యందురు. అందు నిత్యశ్రాద్ధము విషయమై మనువిట్టులు చెప్పెను. ప్రతిదినమును ద్విజుడగువాడు అన్నము- తిలలు- వ్రీహి ధాన్యములు మొదలయిన వానితో గాని, ఉదకముతో గాని యథా సంభవముగా శ్రాద్ధముల నాచరించుచుండగా వలయును. అథవా పయోమూల ఫలాదులతో నైనను శ్రాద్ధముల నొనర్చి పితరులకు ప్రీతి కల్గింపవలయును. దీనినే పంచ యజ్ఞములలో నొకటిగా చెప్పెడి పితృ యజ్ఞమని యెఱుంగగా వలయును. మఱియును ఇట్టి పితృ ప్రయోజకమైన- పంచయజ్ఞములలో నొకటైన శ్రాద్ధము నందు, అధమమొక బ్రాహ్మణునైనను భుజింపజేయవలయును. కాని విశ్వే దేవార్థమై యిచ్చుటఁ అనగా నిట్టి శ్రాద్ధమునందుఁ ఎవ్వరిని గూడనే మించి భుజింప జేయరాదు- అని.

ఇకను గ్రహణములు మొదలగు పర్వకాలములను నిమిత్తముగా చేసికొని చేయునట్టి శ్రాద్ధములు నైమిత్తికములని యనంబడును. వానిని పార్వణ విధానము వలె నాచరింపదగును. మఱియును ఏకోద్దిష్ట శ్రాద్ధము సపిండీకరణము- అష్టకా శ్రాద్ధము ఇత్యాదులన్నియును నైమిత్తిక శ్రాద్ధములే యగుచున్నవి. అందు ఏకోద్దిష్ట శ్రాద్ధము పదునాఱు తెఱగులు. ఈ ఏకోద్దిష్ట విషయమునందు యాజ్ఞ వల్క్యుడిట్లు చెప్పెను- "ప్రేత మరణించిన మృతాహస్సునాడు ప్రతి నెల యందును ప్రతి వత్సరమును శ్రాద్ధమును చేయుచుండవలయును. అందు తొలు దొల్తటిది పదునొకండవ రోజున నాచరింపదగినది. దీనినే ఏకోద్దిష్టమని యందురు అని, అనగా ఏకోద్దిష్టమున పైన చెప్పిన కాలమున జేయవలయునని లోగాక్షి అనెను.

వ్యాఘ్రస్మృతి యందును ఇట్టులు చెప్పంబడి యున్నయది. మరణించిన పదునొకండవ రోజునందును త్రిపక్షము నందును ఆరవనెల యందును ఏకోద్దిష్ట మును చేయుచు రావలయును. ఇట్లు సంవత్సరము గాని, త్రిపక్షము గాని పూర్ణము కాగానే సపిండీకరణమును ఒనర్పగా వలయును- అని.

జాతూకర్ణ్యుడన్నాడు- "నాలుగవ- అయిదవ- తొమ్మిదవ- పదునొకండవ దినములలో పితృ ప్రీత్యర్థమై చేయు అన్న ప్రదానము నవ శ్రాద్ధమనంబడును-

అని యిట్లు చెప్పుచుందురు. పైని చెప్పిన యీ నాలుగు శ్రాద్ధములను నాల్గు వర్ణములకు నానుపూర్విగా చెందినవని వ్యవస్థ నెఱుంగవలయును. ఇట్లు వర్ణాను పూర్విగా చేయబడు నా శ్రాద్ధమే పదునొకండవ నాడాచరింపదగును. ఇచ్చట ఏకాదశ శబ్దమును గ్రహించుట అశౌచము ముగిసిన పిమ్మట నాచరింపదగునని సూచించుటకని యెఱుంగవలయును. ఆ నెలలో కెల్ల నదియే తొలి మాసికమగును. ఇకను సపిండీకరణము నొనర్చునపుడు ప్రేతకు ఏకోద్దిష్టము అనియును, పిత్రాదు లకు పార్వణమనియు నెఱుంగదగును. అందులో గూడ నదియే మాసికమగును. ఇట్లు సంవత్సరకాలంలో పది మాసికములును త్రిపక్ష షాణ్మాసికములను వెనుకటి రెండును, ప్రతి సంవత్సర శ్రాద్ధమును మఱియొకటియు గలసి ఇట్లు ఏకోద్దిష్ట ములు పదునారగుచున్నవని తెలిసికొనవలయును.

ఈ విషయమునందు పెద్దలిట్లు ప్రమాణములను చెప్పుచున్నారు. నవశ్రాద్ధ త్రైపక్షిక శ్రాద్ధ షాణ్మాసిక శ్రాద్ధ సాంవత్సరిక మాసికములు- అను నీ పదు నారేకోద్దిష్టముల చేతను ప్రేతయగువాడు ప్రేతత్వమును వదలిపోగలడు. ఏ ప్రేతకు ఏకోద్దిష్ట శ్రాద్ధములను పదునారింటిని చేయింపరో, ఇట్టివారికి తక్కిన శ్రాద్ధముల నెన్నిటి నాచరించినను ప్రేతత్వము వదలజాలదని యెఱుంగగా వలయును- అని. ఇకను "హేమంత శిశిరర్తువుల యందును నాల్గు పక్షములలో వచ్చెడి అష్టమీ తిథులందొక్కొక్క దానియందు గాని లేకపై పక్షములలో ప్రతి పత్తులందు గాని శ్రాద్ధము చేసిన యెడల స్త్రీ సంతానం కల్గును. అనెడి కోర్కెతో (అనగా కామనతో) చేయబడునట్టి శ్రాద్ధముల కామ్య శ్రాద్ధములనంబడును. ఇవియును పార్వణ విధానము చొ॥ ఆచరింపగా దగును. ఇక్లే వివాహము ఉప నయనము మొదలయిన (మంగళ కర్మలు) వృద్ధి కార్యముల సందర్భములో నంతకు తొలిరోజున చేయబడు శ్రాద్ధములు వృద్ధి శ్రాద్ధములనంబడును. ఇందులకు ఆధారము- తస్మాత్పిత్రేభ్యః పూర్వేద్యుః క్రియతే- అని బ్రాహ్మణమందలి వాక్యము ప్రమాణము. అట్టి శ్రాద్ధములందు నియ్యేది బ్రాహ్మణులండదగును. తక్కిన క్రియలు పార్వణములందు వలెనేయని యెఱుంగ వలయును. పార్వణము లను గూర్చి మున్ముందు చెప్పబడగలదు."

ఈ వివరణను బట్టి చనిపోయిన వారికి శ్రద్ధతో చేసే కర్మ శ్రాద్ధమని తెలియుచున్నది.

ఈ శ్రాద్ధకర్మకు త్రైవర్ణికులు చాలా ప్రాధాన్యాన్ని ఇస్తున్నారు. చని పోయిన వారికి రకరకాల శ్రాద్ధాల పేరుతో పిండ ప్రదానాలు చేయడం అవివేక

పైన విషయముగా చార్వాకులు ఖండిస్తున్నారు. ఒకవేళ శ్రాద్ధం పెట్టడం వలన మరణించువాడు తృప్తుడైతే, ఆరిపోయిన దీపమును కేవలము నూనె వెలిగింపలేముగదా? అని ప్రశ్న వేస్తున్నారు. అంటే, నూనె వున్నప్పటికీ మరలా దీపాన్ని వెలిగిస్తేనే ఆ నూనె ఆ వెలుగుకు ఊపిరి అవుతుంది అని చార్వాకుల భావము. ఈ శ్రాద్ధకర్మలన్నిటికి మూలం మానవుని జన్మను గురించి, మరణాన్ని గురించి వైదికతత్వం సరియైన నిర్వచనం ఇవ్వలేక పోవడమే. మరణించడమంటే దేహమే మరణించడం అనే ఆలోచన, దేహంలోపల దేహానికి ఏదో వేరుగా మేదోవుంది అని భావన. ఈ అసంబద్ధమైన క్రియలకు మూలమయింది. అంతేగాక అదే జీవిత పరమార్థమై యెంతో కాలం, యెంతో మానవ శ్రమ వ్యర్థమైంది. ఎంతో ధనం వ్యర్థంగా నాశనమయింది. ఈ శ్రాద్ధ కర్మలను గురించి పరిశీలించారు కాబట్టే చార్వాకులు యీ శ్రాద్ధాన్ని గూర్చి తీవ్రంగా ఖండించారు. అందుకే శ్రాద్ధమనేది మహాన్న భుక్కుల కూటక సృష్టి తప్ప మరేమీ లేదని యీ క్రింది విధంగా నుడివి యున్నారు.

## శ్రాద్ధం అబద్ధం :

శ్లో॥ గచ్ఛతామిహ జంతూనాం
వ్యర్థం పాథేయ కల్పనమ్ ।
గేహస్థకృత శ్రాద్ధేన
పథితృప్తిరవారితా ॥

మరణించినవారికి శ్రాద్ధము తృప్తిని కలిగించినచో లోకంలో దూరదేశం వెళ్ళేవాళ్ళకు కూడా ఇంటిలో పెట్టిన శ్రాద్ధం తృప్తిని ఇవ్వాలి కదా!

చనిపోయినవాడికి శ్రాద్ధపిండం ఎలా తృప్తిని కలిగిస్తుంది. ఒకవేళ అలా కలిగించినట్లయితే దూరదేశం వెళ్ళినవాడికి ఇక్కడ ఇంటిలో నుండే అన్నం పెట్టవచ్చుకదా! అని తర్కబద్ధంగా చార్వాకులు ఖండించారు. ఈ సంబంధమైన శ్రాద్ధాన్ని పెట్టడానికి ఎన్ని నియమాలు, నిష్ఠలు? ఒకసారి పరిశీలించండి.

గౌతమధర్మ సూత్రాల్లో ఈ విధంగా వివరింపబడింది.

607. సూ॥ అమావాస్యాయాం పితృభ్యో దద్యాత్ [౨-౬-౨]

హరదత్త మితాక్షరా- అమావాస్యేతి:- సూర్యాచంద్రమసౌ యస్యాం సహవసతః సా అమావాస్యా పితృభ్య ఇతి బహువచనా త్పితృపితా మహాప్రపితా

మహేభ్యో దద్యాద్దాన ప్రకారో గృహ్యేష్యుక్తః హోమో బ్రాహ్మణ భోజనం పిండ నిర్వపణమ్- ఇతి- ఇహ తు బ్రాహ్మణ భోజనే విశేషః-

ఆంధ్రవివరణము: అమాయనునది సహ అను నర్థమును (అనగా కూడ- అను అర్థమును) చెప్పునట్టి అవ్యయము. అమా కూడా, వసతీతి సూర్యచంద్రులు కలిసి, ఒక్కటిగా నీదినము ఉందురు గనుక, "అమావాస్య" యనబడును.

ఇట్టి అమావాస్య యందు పితరులకు (అనగా పితృపితామహ ప్రపితామహులకు) తిలోదకమును శ్రాద్ధమును ఒసంగ వలయునని సూత్రార్థము. దీని నాచరించు క్రమము గృహ్య సూత్రములలో చెప్పిన రీతిగాయని యెఱుంగదగును. హోమ బ్రాహ్మణ భోజన పిండ ప్రదానముల నొసంగదగునని గృహ్య సూత్రము లందు గలదు. కాని అమావాస్య యందు పితృ ప్రీత్యర్థమై బ్రాహ్మణ భోజనము చేయుటయే విశేషమని యెఱుంగవలయును.

608. సూ. పంచమీ ప్రభృతిషువా అపరపక్షస్య [ -- ]

హరదత్త మితాక్షరా- పంచమీతిః- అపరపక్షః కృష్ణపక్షస్తస్య పంచమీ ప్రభృతి వా దద్యాత్.

ఆంధ్ర వివరణము: మాసమునకు రెండు పక్షములుండును. పదునైదు దినములొక పక్షము. అందు మొదటి పక్షమునకు శుక్లపక్షమనియును, రెండవ పక్షమునకు కృష్ణపక్షమని గాని, అపరపక్షమని గాని, కొన్ని యెడల పితృపక్షమని గాని పేరు. వెనుక జెప్పినట్టులుగా అమావాస్యయందు గాని, లేదా అపరపక్షము యొక్క పంచమి మొదలుకొని యయ్యేడు తిథులందు గాని, పితరులకు హోమ బ్రాహ్మణ భోజనపిండ ప్రదాన తర్పణాదుల నొసంగుచుండవలయునని సూత్రార్థము. ఇచ్చట మస్కరీయ భాష్యమునందు అష్టకా శ్రాద్ధమును కృష్ణపక్షపు అష్టమి తిథి మొదలుకొని చేయవలయునని యభిప్రాయము తెల్పబడినది. మఱియు వందు ఈ సూత్రమును పై వచ్చు సూత్రమునందలి "యథాశ్రాద్ధం" అనునంతవరకు నొక్కటిగానే పఠింపబడియు నున్నది.

609. సూ. యథాశ్రాద్ధం సర్వస్మిన్వా [ -- ]

హరదత్త మితాక్షరా: యథేతి సర్వస్మిన్వా అపరపక్షే దద్యాద్యథా శ్రాద్ధం యథా శ్రద్ధాభవతీతి.

ఆంధ్ర వివరణము: మఱియును నా కృష్ణపక్షము నందలి తిథులన్నిటి యందును, తమ శ్రద్ధాభక్తుల ననుసరించి శ్రాద్ధములను చేయగా వచ్చునని

సూత్రార్థము. ఇయ్యది ధనద్రవ్యాదులు పుష్కలముగా నున్నట్టి వారిని గురించి చెప్పునట్టి విషయమని మస్కరి వ్రాసెను.

610. సూ. ద్రవ్యదేశ బ్రాహ్మణ సన్నిధానేవా కాలనియమః [౨-౭-౩]

హరదత్త మితాక్షరా- తిలమాషేత్యాదరభ్య వక్ష్యమాణం తత్ప్రశస్తం ద్రవ్యం దేశో గయా పుష్కరాదిః శ్లో॥ పుష్కరేష్వక్షయాం శ్రాద్ధం కురుక్షేత్రే తథైవచ, దద్యాన్మహోదధౌ చైవ హ్రదగోష్ఠే గిరౌ తథా ఇతి వ్యాసః- శ్లో. యద్దదాతి గయాస్థశ్చ సర్వమానన్త్య మశ్నుతే ఇతి యాజ్ఞవల్క్యః బ్రహ్మ పంక్తి పావనా వక్ష్యమాణాః షడంగ విదాదయః ఏతేషాం ద్రవ్యాణాం సన్నిధి రేవకాల ఇతివాశబ్దో వికల్పార్థః.

ఆంధ్ర వివరణము: ద్రవ్యము అనగా శ్రాద్ధము నాచరించుట కనువగు వెండి మున్నగునవి. దేశములనగా గయాక్షేత్ర పుష్కరాదులగు శ్రాద్ధాచరణార్హ ప్రదేశములు. బ్రాహ్మణులనగా పంక్తి పావనులయిన బ్రాహ్మణులును, యతులు మున్నగువారు. ద్రవ్య సన్నిధానము కల్గినప్పుడు గాని, దేశ సన్నిధానము గల్గినపుడు గాని, బ్రాహ్మణ సన్నిధానము గల్గినపుడు గాని, శ్రాద్ధమును నాచరించు టకు కాలనియమమని సూత్రార్థము.

ద్రవ్య సన్నిధానము గూర్చి, పెద్దలిట్లు చెప్పుననుదురు. శ్లో. రజతం కాల శాకం చ ఖడ్గమత్స్య మిషం మధు, ఆనంత్యాయైవ కల్ప్యంతే మున్యన్నానిచ సర్వశః- అనగా శ్రాద్ధము చేయుట కనుకూలమగు రజితమును (అనగా వెండి మున్నగు ధనము) కాలశాకమును ఖడ్గమృగ మాంసమును మత్స్య మాంసము లను, తేనెయును, పవిత్రములై మునిభక్షణార్హములయిన నీవారాన్నములను- అను నియ్యవి శ్రాద్ధకాలమునందు పితరులకు సంతృప్తిని గూర్చునవి యగుటయే గాక, అక్షయములగు పరలోక సుఖములం గూర్చుటకు గూడ నునువగుచున్నవి- యని భావము.

ఇట్లే దేశ సన్నిధానమును గూర్చియు నిట్లు చెప్పిరి. "మహానదుల యొక్క (పండ్రెండేసి యేండ్ల కొకమారు చొప్పున వచ్చెడి) పుష్కర కాలములందును, గయాదులగు క్షేత్రములందును, అర్థోదధి మహోదధి మొదలైన కాలములందును, ప్రభావము మొదలయిన తీర్థములందును, సత్రయాగాదులగు గోష్ఠములందును పవిత్ర పర్వతములందును అంజనము కాలకూటము మొదలయిన కులపర్వతము లందని యర్థము. శ్రాద్ధము చేయబడినచో పితృదేవతల కక్షయమగు సుఖము

నిచ్చును". అని వ్యాసుడు చెప్పియున్నాడు. ఇట్లే యాజ్ఞవల్క్యుడును- గయా క్షేత్రము న దిచ్చెడి పిండదానాదు లన్నియును పితరుల కానంత్యమును గూర్చున వగును- అనెను.

పంక్తిపావనులనగా- మున్ముందు చెప్పబడబోయెడి షడంగవేత్తలు మున్నగువారిని- ఇచ్చట బ్రాహ్మ శబ్దము చేత పేర్కొనగాదగును. ఈ పైని చెప్పినట్టి ద్రవ్యముల యొక్కయును, ప్రదేశముల యొక్కయును, బ్రాహ్మణుల యొక్కయును సన్నిధానము లభించినపుడెల్లను శ్రాద్ధముల నాచరించుచునే యుండి తీరవలయునని సూత్రమునకు తాత్పర్యము. కనుకనే వ్యాసుడు- శ్లో. స్వధాచ రాజతం ప్రాతం దౌహిత్ర; కుతవిస్తిలాః వస్త్రంచ పావనీయాని త్రిదండీ యతి రేవచ- అని చెప్పినాడని యెఱుంగదగును.

611. సూ. శక్తితః ప్రకర్షేద్గుణసం
స్కార విధి రన్నస్య [౨-౭-౬]

హరదత్త మితాక్షరా- అన్నస్య భక్ష్యభోజ్యాదేర్గుణ విషయః పాయసత్వ విశదసిద్ధత్వాదయః సంస్కార విధయో భర్జన మరిచి జీరకలవణాదిభిః సురభీక రణాదయః ఏతాని యథాశక్తి ప్రకర్షేత్ప్రకృష్టాన్కుర్యాత్.

ఆంధ్రవివరణము : ఇచ్చట శ్రాద్ధము నందుపయోగింపబడదగిన భక్ష్యములు భోజ్యములు, లేహ్యములు, చోష్యములు అను నాల్గు తెఱగులైన భోజన పదార్థ ములును అన్న శబ్దము చేత గ్రహింపగా వలయును. గుణ విధులనగా రుచులు ఏర్పడునట్లు చేయు రీతులు. సంస్కార విధులనగా- వేపుడు, పోపులు (తిరగ బోతలు) మున్నగు వానిచే భక్ష్యములను సంస్కరించెడి విధానములు.

తమ తమ శక్తి ననుసరించి శ్రాద్ధకాలమునందు బ్రాహ్మణ వినియోగ మునకై సిద్ధము చేయునట్టి యన్నమును, గుణ విధులతోను, సంస్కార విధుల తోను మిక్కిలి యొప్పునట్టులుగా సిద్ధము చేయవలయునని సూత్రార్థము.

612. సూ. నవావరాన్భోజయే దయుజః [౨-౭-౭]

హరదత్త మితాక్షరా- నవేతిః- నవసంఖ్యా అవరాయేషాంతే నవావరా స్తావతో బ్రాహ్మణా న్భోజయేత్. అయుజో అయుగ్మ సంఖ్యాన్. నవపక్షేతు పితు స్త్రీన్పితామహస్య త్రీన్ప్ర పితామహస్యత్రీన్. అవర గ్రహణా దధికా అపిభవన్తి. పఞ్చదశ ఏక వింశతి రిత్యాదయః అయుజ ఇతి వచనా ద్వాదశా దివ్యావృత్తిః

ఆంధ్ర వివరణము - తొమ్మండుగురికి తక్కువ గాని బ్రాహ్మణులను శ్రాద్ధకాలము నందు పితృర్థమై భుజింపగా జేయవలయును: లేదా అయుగ్మసంఖ్య గల (అనగా బేసి సంఖ్య గల) బ్రాహ్మణులనైనను భుజింప జేయవలయును. అని సూత్రార్థం. తొమ్మిండుగురనెడి పక్షములో పితరున (తండ్రి) కు ముగ్గురి నిన్నీ, పితామహునకు (తండ్రియొక్క తండ్రి) ముగ్గురినిన్నీ ప్రపితామహునకు (ముత్తాత) ముగ్గురినిన్నీ అని క్రమము నెఱుంగనగును.

మూలసూత్రము నందు అవర శబ్దమును గ్రహించుట చేత నెక్కువ మందిని గూడ, అనగా పదునేనుగురు- ఇరువదియొక్కరు- ఇత్యాది పక్షములు గూడ గలవనియును, అయుజ్- అని చెప్పుటచేత పంద్రెండు- మొదలయిన సమసంఖ్యలతో బనికిరాదనియును ఎఱుంగ వలయును.

ఇన్ని నియమాలు, నిష్ఠలు చేసే పితృకర్మలు వ్యర్థమైనట్టివని చార్వాకులు తెలుసుకున్నారు- బోధించారు. కాని యీనాటికి కూడా ఈ శ్రాద్ధకర్మలు హిందూ సమాజం మీద తీవ్రమైన పెత్తనాన్ని చేస్తూ వున్నాయి. పేదరికంలో కూడ ఈ కర్మలు నిర్వర్తించ వలసిన పట్టుల అప్పులు చేసి తిప్పలు పడుతూ వున్నారు. బ్రతికి యున్నప్పుడు గొంతులో గుక్కెడు నీళ్ళుపోయని కౌటింబికులు, చనిపోయిన తరువాత యీ శ్రాద్ధ కర్మలు మాత్రం ఇష్టమున్నా, లేకున్నా చేస్తున్నారు. సుమారు రెండువేల సంవత్సరాలు నిరాఘాటంగా సాగిన, సాగుతున్న యీ శ్రాద్ధ కర్మలు, ఎంతో మానవ శ్రమను, ప్రజాధనాన్ని ధ్వంసము చేసినాయి. చార్వాకులు యిటువంటి మూఢ విశ్వాశాల మీద యే విధమైన తర్కం చేశారో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ యీ విషంగా వివరిస్తున్నారు-

ఆత్మ దేహము నుండి వేరు అని తలప నవసరములేదు. ఆత్మ చైతన్యముతో కూడిన దేహమే. "బుద్ధితో కూడిన దేహమేఆత్మ, "నేను లావుగా వున్నాను," "నేను యువకుడను," "నేను వృద్ధుడను". "నేను పెద్దవాడను" మున్నగు వాక్యములలో స్ఫురించునదే ఆత్మ". (సర్వ సిద్ధాంత సారసంగ్రహము) ఆత్మయు, దేహమును విడిగా నున్నట్లు మనకు సాక్ష్యము లేదు. "దేహము నుండి విడిగానున్న ఆత్మనెవరు చూచినారు? ప్రాణము పదార్థము యొక్క రూపాంతరము కాదా?" (ప్రబోధ చంద్రోదయం, అంకం - 4) చైతన్యం శరీరముతో సంబంధించి యుండునదే. అందుచే అది శరీరమే. •

• భారతీయ తత్త్వశాస్త్రం, వాల్యూం II పేజి 16.

ఆత్మ బండారాన్ని బయటపెట్టి శరీరతత్వాన్ని వివరించిన చార్వాకులు 'శ్రాద్ధాన్ని' విమర్శించి మానవ జీవితానికి వెలుగుబాటలు వేశారు. చార్వాకుల సిద్ధాంతాలు చారిత్రక క్రమంలో ప్రచారమైతే మూఢవిశ్వాసాల ఉక్కు సంకెళ్ళలు పెట్టిపోక మానవు.

## దానవం - స్వర్గవం:

శ్లో॥ స్వర్గస్థితా యదా తృప్తిం
గచ్ఛేయుః తత్ర దానతః ।
ప్రాసా దస్యోపరిస్థానాం
అత్ర కస్మాత్ నదీయతే ॥

దానాల వలన స్వర్గంలో వుండే వాడు తృప్తి పొందేటట్లయితే ఇక్కడ యిచ్చే దానాల వలన మేడ పైన వాళ్ళకు తృప్తి కలగాలి కదా!

చనిపోయినవారు స్వర్గానికి వెళతారనే ఆలోచన విశ్రాంతి వర్గం సృష్టి. శ్రమజీవిని దోచుకోవడానికి విశ్రాంతి వర్గం సృష్టించిన ఒక అభూతకల్పన స్వర్గం. ఈ స్వర్గంలో వుండే వాడికి దానం ద్వారా ఇక్కడ నుండి యెలా ఆహారాన్ని సరఫరా చేయగలడు, తృప్తిపరచగలడు. ఒకవేళ అట్లు తృప్తిపరచ గలిగే టట్లయితే మేడపైన వున్నవాడికి క్రింది అంతస్తులో భోజనం పెడితే, తృప్తి పొందాలి కదా! అని చార్వాకులు ప్రశ్నించారు. చార్వాకులు శ్రామికవర్గ ప్రతి నిధులు. వారి తర్కం సహేతుకమైంది. చార్వాకుల శరీరం పదార్థ సమ్మేళనం, పదార్థంలోనే అది తిరిగి కలిసిపోతుంది- వేరుగా ఆత్మగాని, శరీరంగాని స్వర్గానికి వెళ్ళే ప్రసక్తిలేదు అని అన్నారు. స్వర్గం లేదు. స్వర్గానికి వెళ్ళడానికి ఆత్మలేదు. కాబట్టి పితృ దేవతల పేరుతో యిస్తున్న దానాలన్నీ వ్యర్థమైనవే. కనుక చార్వాకుల పదార్థవాదం యీ అసంబద్ధ విషయాలను ఖండిస్తుంది. చార్వాకుల పదార్థవాదాన్ని "భారతీయ తత్వశాస్త్రం- అవైదిక దర్శనాలు" లో పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి యిలా వివరించారు-

మన అనుభూతిలో కన్పించునని పృథివి, జలము, తేజస్సు, వాయువు అను నాలుగు భూతములు. వివిధ పదార్థముల కలయిక వలన క్రమములో మత్తు కల్గించు శక్తి ఏర్పడు చున్నట్లు ఈ నాలుగు భూతముల కలయిక ద్వారా శరీరములు త్పన్నములగు చున్నవి. ఈ కలయిక నష్టము కాగా శరీరము మృతమను

చున్నాము. అప్పుడాయా భూతములకు చెందిన భాగము లాయా భూతంలో సంలీనములగుచున్నవి. "విజ్ఞాన ఘన ఏవైతేభ్యో। భూతేభ్యః సముత్థాయ- తాన్యేవాను వినశ్యతి। నప్రేత్య సంజ్ఞాస్తి" అని బృహదారణ్యక శ్రుతి (2, 4, 12) ఈ విషయమునే పరామర్శించినది. నాలుగు భూతముల కలయికతో దేహము చైతన్యవంతముగా భాసించును.

ఈ చైతన్య విశిష్టమైన దేహమే ఆత్మ, దేహముకన్నా భిన్నమైన ఆత్మ కలదని చెప్పుటకు సరిపోవు నిర్దుష్ట ప్రమాణమేమియు లేదు. కొందరు చార్వాకులు దేహమే ఆత్మ అని, వేరొక కొందరు ప్రాణమే ఆత్మ అని పల్కిరి.

అర్థ కామముల ద్వారా గాని, ధర్మార్థ కామముల ద్వారా గాని కలుగు సుఖమే పురుషార్థము. ఈ సుఖమున దుఃఖము కూడా కన్పించవచ్చును. అట్టి దుఃఖము తప్పని సరియగుటచే దుఃఖమును వదలి, సుఖమునే అపేక్షించి అనుభవింప నెంచుట, మానవ సహజము. మట్టితోను, రాళ్ళతోను కలసిన ధాన్యమును శుభ్రపరచి ఉపయోగింతుము. అట్లే దుఃముతో కూడిన సుఖమును అనుభవించుటలో దుఃఖమును వేరుచేయక తప్పదు. కనుక దుఃఖముతో కూడ కలసియున్నదను భయముతో అనుకూల వేదనీయమగు సుఖమును వదలుట అవివేకము. పశువులు పంటలనూ పాడుచేయగలవని పండించుట మానము గదా !

పరలోకమునకు చెందిన స్వర్గమే లేనపుడు నరకము కూడ లేదు. మనకు సంభవించు దుఃఖమే నరకము. దేహమునకు కలుగు మరణమే మోక్షము. దేహం కన్నా వేరగు ఆత్మలేదు. ఇది నా శరీరమని పల్కుట కేవల మౌపచారికమైన ప్రయోగము. రాహువుకున్నది ఒక్కతల ఐనను రాహువు యొక్క శిరస్సు అని వాడుచున్నట్లే నా శరీరము అని వాడుచున్నాము.

ఈ సజీవమైన సిద్ధాంతమే ఆ తరువాత అభివృద్ధి చెందిన గతితార్కిక భౌతికవాదానికి పునాదిరాయి అయ్యింది. భావవాద వికృతరూపాన్ని ప్రకటించిన వైదిక దోపిడీ సంస్కృతికి వ్యతిరేకంగా చార్వాకులు ప్రకటించిన సిద్ధాంతాలు ప్రపంచ భౌతిక తాత్విక దృక్పధానికి కూడా జీవగర్రలు. ఆ తరువాత వచ్చిన ఎన్నో తాత్విక సిద్ధాంతాలలో చార్వాకానికి పోలికలు వున్నవి.

ప్రాక్పశ్చిమ తత్వశాస్త్ర చరిత్రలో ఎపిక్యూరస్‌కు చార్వాక సిద్ధాంతానికి వున్న పోలిక చర్చింపబడింది.

ఎపిక్యూరియన్ తత్వము చార్వాక మతమును పోలియున్నది. రెండును

శరీరము ఆత్మ ఒకటే అన్నవి. ఎపిక్యూరియన్ మతమున ఆత్మ భౌతిక అణువులచే నయినదే- హృదయ ప్రవేశమున ఆ అణువుల కలయిక గాఢమగును. చార్వాకుల మతమునందు ఉండుగా అదియే. నాలుగు భూతముల కలయికయే శరీరము.

చార్వాకులతో పాటు ఎపిక్యూరస్ కూడ మానసికానందములన్నియు శరీరమందలి ఇంద్రియములకు సంబంధించినవే. జీవిత పరమావధిలో కూడ ఇరువురు ఏకీభవించిరి. మన మాచరించు కర్మల లక్ష్యము సుఖ దుఃఖములే. ఆనందము. బాధ, అగ్నియందు వేడిమి, మంచున చల్లదనము అన్నంత సత్యముగనే బాధను చేరనీయరాదు. సుఖమునే కోరవలె అను వారి మతము సూత్రము కలదు. సుఖమును కోరుట దుఃఖము వలదనుట జంతు సామాన్య స్వభావము. మన యత్నము, ఇచ్ఛ క్రియ ఇట్లు సంతోషమునకు దుఃఖమునకు సంబంధించినవి గాన సుఖము ఉత్తమము, బాధ అధమము అగును. సుఖేతరమే- దుఃఖమే నరకము. ఆనందము జీవిత లక్ష్యము. స్వర్గమే అరిస్టిప్పసు సైరీన్ మతమున చార్వాక సిద్ధాంతమును పోలినవే. అరిస్టిప్పసు మతమున లోకమున ముఖ్యమైనది మరి అనునది వ్యక్తి ఆనందమే. ఇప్పటి సౌఖ్యము భావి సౌఖ్యమునకై విడువరాదు. ఈ క్షణమున తిని, త్రాగి ఆనందింతుము. ఉత్తర క్షణమున మనము మరణింప వచ్చును. చార్వాకుల మతమిదియే రేపటి నెమలికై ఈనాటి చేతి పావురము విడువదగదు. ఉన్నంతకాలము సుఖపడుము. శరీరము పోయినరాదు. అప్పుచేసి నెయ్యి త్రాగుము. (అప్పుచేసి పప్పుకూడనుట సామాన్యజన నుడికారము) *

చార్వాకులు కేవలం ఐహిక సుఖాన్నే కోరారు అనే తప్పుడు అభిప్రాయాలు చేశారు. భౌతికతత్వాన్ని నివేదించే క్రమంలో వారు సుఖజీవనం యొక్క ఆవశ్యకతను కూడా నొక్కి చెప్పారు. అంతమాత్రాన వారు అప్పుచేసి పప్పుకూడు తినమని ప్రజలకు బాధ్యతలేని సిద్ధాంతాలు బోధించినట్లు చెప్పుకోవడం వాస్తవం కాదు- చార్వాకులు జీవనసారాన్ని మొట్టమొదట నివేదించిన తాత్వికులు.

## పరలోక యాత్ర అబద్ధం :

శ్లో॥ యదిగచ్ఛేత్ పరంలోకం
దేహాదేష వినిర్గతః ।

* "ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర" చార్వాక సిద్ధాంతం, పేజీలు 128 నుండి 129 వరకు.

కస్మాత్ భూయోనచాయాతి
బంధుస్నేహ సమాకులః ?॥

దేహముకన్న ఆత్మ భిన్నమైనచో, దేహమును విడిచి ఆత్మ వెళ్ళిన తరు వాత పరలోకము చేరి అచ్చటనుండి బంధు ప్రేమ వలన తిరిగి యెందులకు వెనుకకు వచ్చుటలేదు ? కావున దేహమున కన్న ఆత్మ వేరు కాదనుట నిర్వి వాదాంశము.

దేహమునకన్న ఆత్మ వేరుకాదు అనే సిద్ధాంతాన్ని నిర్దుష్టంగా చార్వాకులు చెప్పినట్లు మరే భారతీయ తత్త్వవేత్తలు వివరించలేదు.

"తమ సిద్ధాంతమును సమర్థించుటకే చార్వాకులు ఉపనిషత్తును ఉదహరింతురు." "ఈ భూతముల నుండి ఉదయించి అది నశించును. అది నశించిన వెనుక, అనగా మరణానంతరము బుద్ధియు మిగలదు". దీనిననుసరించి యింకొక జన్మలో తన కర్మల ఫలితము ననుభవించును. 'ఆత్మ' యొక్క యున్నదని యూహించుట మూర్ఖత్వం. దీనికంటె పైన స్వర్గము కాని, నరకముకాని లేదు. స్వర్గ నరకములు దుర్బుద్ధులచే కల్పితములు. మతమొక మానసిక దోషము, లేక రోగము. లోకమునకు కర్తగా నొకదేవుడు అవసరము లేదు. మతమందలి కుతర్కముచే మానవులు వేరొక లోకము, దేవుడు నుండె నని నమ్మి, అట్టి విశ్వాసము నిర్మూలింప బడినపుడు, వారేదో లోపము తటస్థించిన దని భావించి, దానివలన నష్టమున్నదనియు, కష్టము కలుగుననియు నూహింతురు. మనుష్యులు కల్పించుకొనిన విలువలు ప్రకృతి విరుద్ధములు. మంచి చెడ్డలు ప్రకృతిలో లేవు. సూర్యుడు మంచివానికిని చెడ్డవానికిని సమానముగా ప్రకాశించు చున్నాడు. ప్రకృతికొక గుణమున్నది. అదియే అతీతమైన శాశ్వతత్వము. మానవులలో బహుసంఖ్యాకులు దుర్బల హృదయులగుటచే తమ్ము స్తోత్రము చేయు అమాయకులను కాపాడుచు, నిరసించు వారిని నాశన మొనర్చుచు నుండు దేవతలున్నారని నమ్ముదురు. ఇట్టి నమ్మకమునకు కారణము అవివేకమే. ప్రపం చమున నెచటగాని దేవతలు వచ్చి దర్శనమిచ్చిన సందర్భము ఏమియును లేదు. ప్రకృతి శక్తులను చూచి, దేవతలనియు, దయ్యములనియు మనము ఊహా కల్పన మొనర్చుచున్నాము."

"ఏ దేవతల ప్రమేయము లేకుండగనే ప్రకృతి తన కార్యములను నెర వేర్చుచున్నది. ప్రపంచంలోని నానాత్వము ప్రకృతి సంజాతము. అగ్ని వేడిగ

నుండుట, జలము చల్లగ నుండుట ప్రకృతి స్వభావ లక్షణములు. నెమలిఫించము లోని రంగుల నద్భుతముగ ఎవడు చేసినాడు? దీనికి ప్రకృతి తప్ప వేరొక కారణము లేదు." *

ఈ ప్రకృతి సూత్రాల మీద వైదిక సంస్కృతి తీవ్రమైన దాడిని చేస్తూ వచ్చింది. చార్వాకుల సిద్ధాంత ప్రభావము కొంత బౌద్ధ, జైన దార్శనికుల మీద ఉన్నది. అవైదిక దర్శనాల మీద తీవ్రమైన దాడిచేసిన వైదిక సిద్ధాంతం శంకరాద్వైతం. శంకరుని మాయావాదం భారతీయ భౌతికవాదాన్ని నిరసించి, అనంత అశాస్త్రీయ సిద్ధాంతాలను ప్రచారం చేసింది. అందుకే శంకరుని మాయావాదాన్ని పరిశీలిద్దాం.

## శంకరుని మాయావాదం:

శంకరుడు తన సిద్ధాంతమును ప్రతిపాదించుటకు ముఖ్యంగా భగవద్గీత, ద్వాదశోపనిషత్తులు, వేదాంత సూత్రములు అనే ప్రస్థానత్రయమునకు భాష్యము వ్రాశాడు. ఇంకా అనేక రచనలు, భాష్యాలు వ్రాశాడు. శంకరుని పేర మీద అనేకమైన గ్రంథాలు వచ్చాయి. వాటినుండి అద్వైతాన్ని నిరూపించే శంకరుని సిద్ధాంత సూత్రాలు యథాతథంగా ఇస్తున్నాను.

శ్లో॥ అక్షిదోషా ద్యథైకోపి ద్వయవద్భాతి చంద్రమాః ।
ఏకోఽప్యాత్మా తథా భాతి ద్వయవత్ మాయయా మృషా॥

శ్లో॥ అక్షిదోష విహీనానా మేక ఏవ యథా శశీ ।
మాయాదోష విహీనానా మాత్మైవైక స్తథా సదా॥

శ్లో॥ ద్విత్వం భాత్యక్షిదోషేణ చంద్రే స్వీమాయయా జగత్ ।
ద్విత్వం మృషాయథా చంద్రే మృషా ద్వైతం తథాఽఽత్మని॥

శ్లో॥ ఆత్మనః కార్య ఆకాశో వినాఽఽత్మానం నసంభవేత్ ।
కార్యస్య పూర్ణతా సిద్ధా కిం పునః పూర్ణతాఽఽత్మనః॥

శ్లో॥ కార్యభూతో యథాఽఽకాశ ఏక ఏవనహి ద్విధా ।
హేతుభూత స్తథాఽఽత్మాఽయ మేక ఏవ విజానతః॥

తా॥ కాచకామలాది దోషగ్రస్తమైన నేత్రమునకు ఒకే చంద్రుడు ఇద్దరు

* భారతీయ తత్త్వశాస్త్రము (1953) వాల్యూం II పేజి 16.

చంద్రులు వలె కనిపించునట్లు, మాయావృత్తమైన బుద్ధికి అద్వయాత్మ ద్విధాగా భాసించును. ఇది మిథ్యాజ్ఞానమని తెలియవగును.

దోషరహితమైన చూపుగలవారు ఒకే చంద్రుని దర్శించు రీతిగా, మాయచే అనావృత్తమైన చైతన్యము గలవారు నిరంతరము ఏకాత్మదర్శనమునే చేయుదురు.

కంటిదోషము చేతనే చంద్రుడు రెండుగా భాసించుచున్నాడు. అదేరీతిగా, మాయావృతుడగుటచే తనయందు అనగా, అఖండమగు ఆత్మ పదార్థమునందు ద్వైత ప్రపంచ భ్రాంతి కలుగుచున్నది. కాన చంద్రునియందు సద్వితీయత్వము, ఆత్మయందు ద్వైతము- రెండును మిధ్యయే.

ఆత్మ కార్యమగు ఆకాశము ఆత్మ లేకుండా ఉనికి కలిగియుండుట అసంభవము. కార్యమగు ఆకాశమునకును పూర్ణత్వము అనగా సర్వవ్యాపకత్వము కలుగుచుండగా కారణమగు ఆత్మయొక్క స్థితి వేరే చెప్పవలసిన పని యేమున్నది? అనగా ఆత్మ పదార్థమునకు పూర్ణత సిద్ధించుచునే యున్నది అని గ్రహింపనగును.

ఆత్మకార్యమగు ఆకాశము ఏకమే గాని, రెండుగాదు. అదే విధముగా కారణభూతమైన ఈ యాత్మగూడ ఒక్కటియేయని తెలిసికొనదగును.

శ్లో॥ ఏకోఽపి ద్వయవద్భాతి యథాఽఽకాశ ఉపాధితః ।
ఏకోపి ద్వయవత్ పూర్ణస్తథాఽఽత్మాఽయ ముపాధితః ॥

శ్లో॥ కారణోపాధి చైతన్యం కార్యసంస్థచితోఽధికమ్ ।
నఘటాభ్రాత్ మృదాకాశః కుత్రచిత్ నాధికోభవేత్ ॥

శ్లో॥ నిర్గతోపాధి రాకాశః ఏక ఏవ యథాభవేత్ ।
ఏక ఏవ తథాఽఽత్మాయం నిర్గతోపాధికస్సదా ॥

శ్లో॥ ఆకాశా దన్య దాకాశ మాకాశస్యాస్తి యథానహి ।
ఏకత్వా దాత్మనో నాన్య ఆత్మా సిధ్యతి చాత్మని ॥

శ్లో॥ మేఘయోగాత్ యథానీరం కరకాకారతా మియాత్ ।
మాయాయోగాత్ తథైవాత్మా ప్రపంచాకారతా మియాత్ ॥

ఆకాశము ఏకమయ్యు ఘటమఠాది ఉపాధి భేదము వలన ఇది ఘటాకాశం, ఇది మఠాకాశము అని భిన్నముగ గన్పడునట్లు పూర్ణమగు ఆత్మయు దేహేంద్రియ బుద్ధ్యాది ఉపాధి భేదము ననుసరించి అనేక రూపముల భాసించుచుండును.

మృడాకాశము ఘటాకాశము కంటె ఎచ్చటను, ఎన్నడును అధికమై భిన్నముగాని యట్లు కారణోపాధి చైతన్యమగు ఈశ్వరుడు కార్యోపాధి సంఘాత చైతన్యమగు జీవునికంటె అధికమును గాదు; భిన్నమును గాదు. మృడాకాశ భిన్నమైన ఘటాకాశము లేని యట్లు కారణోపాధి చైతన్యమగు ఈశ్వరుని కంటె భిన్నమగు కార్యోపాధి సంఘాత చైతన్యమగు జీవుడును లేడు. ఆ ఇరువురును ఒక్కరే.

ఘటమఠాది ఉపాధులు నశించినంతనే ఆకాశము అఖండమై ఏకరూపమున భాసించుచున్నట్లుగా శరీర దేహేంద్రియాది ఉపాధులు తొలగినంతనే ఆత్మయు ఏకమై అద్వితీయమై యొప్పారును.

ఏకమైన ఆకాశము కంటె భిన్నమగు ఆకాశము మరొకటి యుండ జాలదు. దాని యందలి భేదము ఉపాధి కల్పితముగాని వాస్తవము గాదు. అట్లే ఏకత్వ హేతువు వలన ఆత్మాన్యమైన యాత్మ యుండనేరదు.

మేఘ సంబంధము వలన జలము మంచు గడ్డ రూపమును పొందుచున్నది. అదే విధముగ మాయా సంపర్కముచేత ఆత్మ ప్రపంచా కారమును భజించు చున్నది.

శ్లో॥ వర్షోపల ఇవాభాతి నీరయేవా ప్రయోగతః ।
వర్షోపల వినాశేవ నీరనాశో యథా నహి ॥

శ్లో॥ ఆత్మైవాయం తథాభాతి మాయా యోగత్ ప్రపంచవత్ ।
ప్రపంచస్య వినాశేవ స్వాత్మానాశో న హి క్వచిత్ ॥

శ్లో॥ జలాదన్య ఇవా భాతిజలోత్థో బుద్బుదో యథా ।
తథాఽఽత్మనః పృథగివ ప్రపంచోఽ యమనే కథా ॥

శ్లో॥ యథా బుద్బుదనా శేన జలనాశో న హి క్వచిత్ ।
తథా ప్రపంచ నాశేన నాశస్స్యా దాత్మనో నహి ॥

శ్లో॥ అహి ర్నిర్ణయినీ జాతః శుచ్యాదిర్నా అహిమాప్నుయాత్ ;
తథా స్థూలాది సంభూతః శుచ్యా దిర్నా ప్నుయా దిమమ్ ॥

తా॥ మేఘ సంపర్కము చేత ఉదకము ఘనీభవించి వడగళ్ళు రూపమున భాసించును. వడగళ్ళు మరల ద్రవీభవనము చెందినను జలమునకు నాశనము లేదు.

అదేరీతిగ మాయ యొక్క సంసర్గము వలన ఈ ఆత్మయే ప్రపంచముగ భాసించు చున్నది. ఆ ప్రపంచము నాశమొందినను ఆత్మకు నాశమెన్నడును సంభవించదు.

జలము నుండి ఆవిర్భవించిన బుద్బుదము జలముకంటె భిన్నముగ కన్పట్టి నట్లు ఆత్మకంటె భిన్నమైన దానివలె ఈ ప్రపంచము అనేక రూపముల అభాసించుచున్నది.

బుద్బుద నాశము వలన జలమెన్నడును నష్టము కాదు. అట్లే ప్రపంచము వినష్టమైనను, ఆత్మనాశనము ఎన్నడును సంభవించదు.

పాము కుబుసము యొక్క శుద్ధత్వ మాలన్యాదులు సర్పమును స్పృశింప జాలని రీతిగా, స్థూలాది శరీర గుణములైన స్వచ్ఛత, మాలిన్యము మున్నగునవి ఈ ఆత్మను స్పృశించజాలవు.

శ్లో॥ త్యక్తాం త్వచ మహిః యద్వత్ ఆత్మత్వేన న మన్యతే ।
ఆత్మత్వేవ తథా జ్ఞానీ త్యక్త దేహత్రయం సదా ॥

శ్లో॥ అహి నిర్ల్వయినీనాశాత్ అహేర్నాశో యథావహి ।
దేహత్రయ వినాశేన నాత్మనాశ స్తథాభవేత్ ॥

శ్లో॥ తక్రాది లవణోపేత యజ్ఞైః లవణవ దధ్యా
ఆత్మా స్థూలాది సంయుక్తో దృశ్యతే స్థూలకాదివత్ ॥

శ్లో॥ అయఃకాష్ఠాదికం యద్వత్ వహ్నివ దహ్నియోగతః ।
భాతి స్థూలాదికం సర్వ ఆత్మవత్ స్వాత్మయోగతః ॥

శ్లో॥ దాహకోనైవ దాహ్యం స్యాత్ దాహ్యం యద్వత్ న దాహకః ।
న చాత్మాఽఽయ మనాత్మా స్యాత్ అనాఽత్యాయం న చాత్మకః ॥

తా॥ సర్పము తాను వదలిన కుబుసమును తాను అనుభవించదు. అట్లే జ్ఞాని తనచే పరిత్యజించబడిన స్థూలాది శరీరత్రయమును ఆత్మ భావమున జూడడు.
పాము కుబుసము నాశమొందినను పాము నష్టము కాదు. అదే విధముగ, దేహత్రయము వినష్టమైనను ఆత్మ నాశమందదు.

ఉప్పు వేసిన మజ్జిగను అజ్ఞానులు లవణమయమని భావించు రీతిగ, స్థూలాది ఉపాధి యుక్తమైన ఆత్మను అజ్ఞులు స్థూలాదులుగనే భావింతురు.

వహ్ని సంసర్గముచే లోహకాష్ఠములు వహ్ని వలెనే అనిపించునట్లు ఆత్మ సంసర్గము వలన ఈ స్థూల సూక్ష్మాది ప్రపంచమంతయు ఆత్మగా భాసమానమగు

చున్నది. దాహకమగు అగ్ని దాహ్యవస్తువు కాజాలదు; దాహ్యవస్తువును దాహకమగు అగ్ని కానేరదు. అదేరీతిగా ఆత్మ అనాత్మయు గాదు; అనాత్మ ఆత్మయును కానోపదు.

శ్లో. ప్రమేయాదిత్రయం సాక్షిం భానువా ఘటకుడ్యవత్ ।
యేన భాతి స ఏవాహం ప్రమేయాది విలక్షణః ॥

శ్లో. భాను స్ఫురణతో యద్వత్ స్ఫురతీవ ఘటాదికమ్ ।
స్ఫురతీవ ప్రమేయాది స్వాత్మా స్ఫురణ తస్తథా ॥

శ్లో. పిష్టాదిః గుడ సంయోగాత్ గుడవత్ ప్రీతిమాన్ యథా ।
ఆత్మయోగాత్ ప్రమేయాదిః ఆత్మవత్ ప్రీతిమాన్ భవేత్ ॥

శ్లో. ఘటనీరాన్న పిష్టానా ముష్ణత్వం వహ్నియోగతః ।
వహ్నిం వినా కథంతేషా ముష్ణత్వం స్యాత్ యథాక్వచిత్ ॥

శ్లో. భూత భౌతిక దేహానాం స్ఫూర్తిత్వం స్వాత్మయోగతః ।
వినాఽఽత్మానం కథం తేషాం స్ఫూర్తితాస్యాత్ తథాక్వచిత్ ॥

తా॥ సూర్యుని వలన ఘటము కుడ్యము మున్నగు వస్తుజాలమంతయు ప్రకాశించుచుండును. అట్లె పరమాత్మవలన ప్రమేయ- ప్రమాణ ప్రమాతృ త్రయము ఇంద్రియ సహితముగ భానమాన మగుచుండును. అట్టి ప్రమేయాదిత్ర యాతీతడగు పరమాత్మను నేనే.

సూర్యప్రకాశము వలన ఘటకుడ్యములు అవభాసించు రీతిగా, స్వాత్మ ప్రకాశము వలన ప్రమేయాదిత్రయము భాసించుచుండును.

పిష్టము మున్నగు భోజ్యపదార్థములు గుడసహితమైనప్పుడు [illegible] మధురమై ప్రీతిని గొల్పుచుండును. అట్లే, ప్రమేయాదికము ఆత్మ సహితమై ఆత్మ వలెనే ప్రీతిదాయకమగుచున్నది.

అగ్ని సంపర్కము వలన ఘటము, జలము, అన్నము, పిష్టము మున్నగు పదార్థములకు ఉష్ణత్వము కలుగుచున్నది. వహ్ని సంయోగము లేకుండా వాటికి ఉష్ణత్వము కలుగనేరదు. అదేరీతిగా స్వాత్మ సంబంధము వలననే భూత, భౌతిక శరీరములకు స్ఫురణము కలుగుచున్నది. ఆత్మ లేకుండిన వాటికి స్ఫూర్తి ఎట్లు కలుగును? అవి ప్రకాశింపజాలవు. *

* శ్రీ మచ్ఛంకర భగవత్పాద చరిత్ర, -డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి పేజీలు 448 నుండి 455 వరకు.

## శంకరాద్వైత ఖండనము :

పైన పేర్కొనబడిన శంకరాద్వైత సిద్ధాంతంలో మాయావాదాన్ని అశాస్త్రీయ, అభూతకల్పనలతో వ్యాఖ్యానించటం జరిగింది. మాయావాదం చెబుతున్నట్లు ప్రకృతి, ప్రపంచం భ్రాంతికాదు- వాస్తవం. అవాస్తవమైన ఆత్మను వాస్తవమైనదిగాను, వాస్తవమైన ప్రపంచాన్ని అవాస్తవమైనదిగాను వ్యాఖ్యానించి, దానిని ప్రచారం చేసి భౌతిక దర్శనాల మీద బురదజల్లి భౌతిక దార్శనికుల మీద దాడులు చేశారు. శంకరుని మాయావాదం భారతీయ తాత్విక దర్శనాలకు వ్యాఖ్యానాలు చేసి వాస్తవాంశాన్ని మసిబూసి మారేడుగాయ చేసింది.

అంతకుముందు ప్రత్యేకస్థానాన్ని వహిస్తున్న భౌతిక దర్శనాలను అవాస్తవమైన భ్రాంతివాదంతో ఖండించి శంకరుడు "మాయా"వాదాన్ని ప్రచారం చేశాడు. భ్రాంతి, మాయ, భ్రమ, వేదాంతం వంటి పదాలకు అస్తిత్వం కల్పించి భౌతికశాఖల మీద గొడ్డలివ్రేటు వేశాడు.

అందుకే శంకరాచార్యుల మాయావాదానికి తత్వశాస్త్ర గౌరవం రాలేదు. శంకరుని మాయావాదాన్ని అనుసరించినవాళ్ళు శాంతిని, దాంతిని గాక క్రౌర్యాన్ని, ద్వేషాన్ని బూని చార్వాకులను, సాంఖ్యులను, జైనులను, బౌద్ధులను తుద ముట్టించారు. అద్వైతం ముసుగులో ప్రాభవాన్ని కోల్పోయిన బ్రాహ్మణ సంస్కృతికి పట్టం కట్టారు. చారిత్రకంగా ప్రాధాన్యతను పొందుతున్న అవైదిక దర్శనాలన్నింటి మీద అత్యంత క్రౌర్యమైన విధ్వంసనాన్ని సాగించారు. చార్వాక దర్శన ప్రభావంతో వర్ధిల్లిన జైన బౌద్ధాలు క్షత్రియుల ద్వారా బ్రాహ్మణాధిపత్యాన్ని ప్రశ్నించటం, యెదిరించటం జరగటమే గాక బ్రాహ్మణులు చాతుర్వర్ణాల్లోని అగ్రభాగం నుండి క్రిందికి నెట్టబడుతున్న కాలంలో శంకరుణ్ని ఆసరాగా తీసికొని బ్రాహ్మణ వర్గాలు మాయావాద పీఠాలస్థాపనకు పూనుకొన్నాయి. అయితే శంకరుడు కూడ అనేక సందర్భాలలో తాను నిర్మించిన సిద్ధాంతాలకు సమాధానాలు చెప్పలేక పోయాడు. ఒక ఏనుగు తన మిదకు, తన శిష్యుల మీదకు ఉరికినప్పుడు ఈ శరీరం అశాశ్వతం అని బోధించే శంకరుడు పలాయనం చిత్తగించినపుడు, ఇదేమిటని ప్రశ్నిస్తే, "గజం మిధ్య పలాయనం మిధ్య" అని సమాధానం చెప్పి శంకరుడు తప్పుకున్నాడని సమకాలికులే ఎద్దేవా చేశారు.

శంకరుని గొప్పతనం మీద చాల అభూత కల్పనలు ప్రచారమైనాయి. అతడు శివరూపమని, మూడు సంవత్సరాల వయస్సుకే వేద, వేదాంగల నభ్య

సించాడని ప్రచారం చేశారు. ఒకరోజు భిక్షకు వెళ్ళితే దరిద్రురాలైన బ్రాహ్మణ కేవలం ఉసిరిగాయనే భిక్షగా వేయగా శంకరుడు కనకధారా స్తుతి చేసి ఆమె ఇల్లంతా బంగారు ఉసిరికాయల మయం చేశాడని అభూత ప్రచారం చేశారు. ప్రతి రోజు శంకరుని తల్లి నదీ స్నానానికి వెళ్ళేదని, ఒకరోజు మార్గమధ్యంలో పడి పోయెనని, యోగబలంచే శంకరుడు నదిని తన తల్లి దగ్గరకు రప్పించాడనేది మరొక ప్రచారం. ఈ విధమైన అవాస్తవ ప్రచారాలతో శంకరుణ్ని దేవుణ్ని చేశారు. అతడు వాక్రుచ్చిన "ప్రజ్ఞానం బ్రహ్మ", "అహంబ్రహ్మాస్మి", "తత్వ మసి", "అయమాత్మా బ్రహ్మ" వంటి మాయావాద సూక్తులు క్రొత్తవేమీ కావు. ఇవి బృహదారణ్యక ఛాందోగ్యోపనిషత్తు నుండి గ్రహించినవే. అంతేగాక మండన మిశ్రుని భార్యతో కామశాస్త్రం మీద వాదించటానికి 'పరకాయ ప్రవేశం'తో ఒక రాజు శవంలో ప్రవేశించి నూరుమంది రాజుల భార్యలతో విహరించాడని చెప్పబడే కథలన్నీ ఇప్పటికీ ప్రచారంలో వున్నాయి.

శంకరునికి సంబంధించిన మరొక సంఘటన ఇలా ప్రచారంలో వున్నది.

వేదాలనే కుక్కలతో నడిచి వస్తున్న మాలవాణ్ణి దూరంగా తొలగిపొమ్మన్నప్పుడు అతడు ఇలా ప్రశ్నించాడు.

"అన్నమయా దన్నమయ మధవా చైతన్యమేవ చైతన్యాత్
ద్విజవీర దూరీకర్తుం వాంఛసికుం బ్రూహిగచ్ఛగచ్ఛేతి"

భావం: అన్నమయమైన శరీరం నుండి అన్నమయమువన శరీరమును వేరుచేయ జూచు చుంటివో, లేదా చైతన్యమునే చైతన్యమునుండి వేరు చేయుటకు చెప్పుచుంటివో! వెళ్ళు వెళ్ళుమని చెప్పితివే! వెళ్ళు వెళ్ళుమని చెప్పుట ఏ అభిప్రాయముతోనో చెప్పుము.

"కింగంగాంబుని బింబితేంబరమణౌ చండాల వాటీపయః
పూరే వాంతర మస్తికాంచన ఘటీ మృత్కుంభయోర్వాంబరే"

భావం: గంగాజలమందు, చండాల వాటిక యందలి నీటియందు ప్రతిబింబించిన సూర్యునకు భేదమేమున్నది? బంగారు కుండ యందలి నీటిలో మట్టి కుండ యందలి నీటిలోను ఆకాశమునందున్న సూర్యుడొక్కడే కదా!

"ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజానందావ బోధాంబుధౌ
విప్రోయం శ్వపచోయ మిత్యపి మహాన్ కోయం విభేద భ్రమః"

భావం: ఎట్టి చాంచల్యమూలేక సహజమయిన ఆనంద బోధ యనెడి సముద్రము వంటి బ్రహ్మము నందు విప్రుడని, శ్వపచుడని ఇట్టి గొప్ప బేధము భ్రమ ఎందులకు ?

ఈ విధంగా అతడు వడ్డించిన తరువాతగాని శంకరునికి జ్ఞానం రాలేదట. ఆ తరువాత చెప్పిన మనీషా పంచకం నేతిబీర సూక్తులయ్యాయి. ఆచరించిన వారు లేరు.

## మనీషా పంచకం :

శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్తి షుస్ఫుటతరా యాయాసం విదుజ్జృంభతే
యాబ్రహ్మాది పిపీలికాన్తతనుషు ప్రోతా జగత్సాక్షిణీ,
సైవాహం నచ దృశ్య వస్త్వితి దృఢ ప్రజ్ఞాపి యస్యాస్తిచేత్
చణ్డాలో ఽస్తుసతుద్విజో ఽస్తుగురురిత్యేషా మనీషా మమ.

భావం: జాగ్రత్స్వప్నసుషుప్తుల యందే చైతన్యము అత్యంత స్ఫుటముగా ప్రకాశించు చున్నదో, ఏది ఆ బ్రహ్మ పిపీలికా పర్యంతము సర్వదేహముల సాక్షియై నెలకొనియున్నదో నేనా చైతన్య స్వరూపమను నేను జడదృశ్యమును గాను, అను దృఢజ్ఞాన మెవనికి గలదో అతడు చండాలుడే యగుగాక, ద్విజుడే యగు గాక- అతడు నాకు గురువు. ఇది నా మనీష అనగా నిశ్చయము.

శ్లో॥ బ్రహ్మవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం
సర్వం చైతదవిద్యయా త్రిగుణయా శేషం మయా కల్పితమ్.
ఇత్థం యస్వ దృఢామతిః సుఖతరే సత్యేసరే నిర్మలే
చణ్డాలోఽ స్తుసతుద్విజోఽ స్తుగురురిత్యేషా మనీషామమ.

భావము : నేను బ్రహ్మ స్వరూపుడను. ఈ జగత్తు కేవలం మాత్ర చైతన్యము వలన అవభాసించుచున్నది. త్రిగుణాత్మకమగు అవిద్య వలన నా యందు కల్పితమై యున్నది- అను దృఢ బుద్ధి ఎవనికి సచ్చిదానంద రూపమును, నిష్కళంకమును, నిత్యమును అగు పరబ్రహ్మమున నిలచినదో, అతడు చండాల ద్విజులలో నెవడైనను నాకు వందనీయుడే: అని నా నిశ్చయము.

శ్లో॥ శశ్వన్నశ్వ మేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాబాగురో
ర్నిత్యం బ్రహ్మనిరన్తరం విమృశతా నిర్వ్యాజ్యశాన్తాత్మ,

భూతం భావిచ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే
ప్రాతద్ధాయ సమర్పితం స్వవపురిత్యేషా మనీషామమ

భావం : గురు వాక్యమున శ్రద్ధా విశ్వాసముల నుంచి విశ్వమంతయు అనిత్యమని నిశ్చయించి నిష్కపట చిత్తముతో నిరంతరము నిత్యమగు బ్రహ్మము ధ్యానించుచు; భూత భవిష్యద్వర్తమానముల నేనార్చిన దుష్కృతము లన్నిటిని దగ్ధమొనర్చితిని, ఇక సంవిన్మయాగ్ని యందు ప్రారబ్ధభోగ (హోమ) మొనర్ప ఈ శరీరము నర్పించితిని. ఇదియే నా నిశ్చయము.

శ్లో॥ యాతిర్యఙ్ నరదేవతా భిరహ మిత్యన్తః స్ఫుటాగృహ్యతే
యద్భాసా హృదయాక్ష దేహ విషయా భాన్తిస్వతోఽచేతనాః
తాంభాస్యైః పిహితార్కమణ్డలని భాస్ఫూర్తిం సదాభావయన్
యోగీ నిర్వృతమాన సోహి గురురిత్యేషా మనీషామమ

భావం : దేనిని దేవమానవ మృగాదులు "నేను" అని అంతఃకరణమున అత్యంత స్పష్టముగ గ్రహించుచున్నవో, దేనివలన అచేతనములగు శరీరేంద్రి యాతఃకరణములు ప్రకాశము నందుచున్నవో, ఏది సూర్యునివలన ప్రకాశింపబడి మేఘముల వలననే కప్పబడిన సూర్యమండలమును బోలుచు స్వయం ప్రకాశమై యున్నదో, ఆ చైతన్యమును ఏ యోగి పురుషుడు సదా భావించుచు, శాంత చిత్తుడై యుండునో, అతడే గురువు, గొప్పవాడు అని నా మనీష అనగా నా అభి ప్రాయము.

శ్లో॥ యతో సౌఖ్యాంబుధి లేశ లేశత ఇమేశ క్రాదయా నిర్వృతా
యచ్చిత్తే నిరతాం ప్రశాన్త కలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః
యస్మిన్నిత్య సుధామ్బుధే గలిత ధీర్బ్రహ్మైవన బ్రహ్మవిద్
యః కశ్చిత్సురేన్ద్రవన్దిత పదో నూనం మనీషామమ

భావం : ఏ సుఖ సముద్రకణ లేశమును బొంది ఇంద్రాది దేవతలు ఆనంద తుందిలు లగుచున్నారో, ప్రశాంత చిత్తుడగు ముని స్వచిత్తమున దేనిని బొంది ఆనందించుచున్నాడో, ఆ నిత్య సుధా సముద్రమున ఎవని చిత్తము కరిగిపోయినదో, అతడు బ్రహ్మవేత్తకాదు, బ్రహ్మయే. అట్టి మహాపురుషుని పాదములకు దేవేంద్రుడు కూడ నమస్కరించును- అని నా నిశ్చితాభిప్రాయము.

చార్వాకులు దేహమున కన్న ఆత్మ వేరు కాదన్న అంశాన్ని విస్తారం శంగా నిరూపించి రానున్న కాలాల్లో వచ్చే భ్రాంతివాదాలకు సమకాలంలోనే సమా

ధానం చెప్పారు. శంకరాచార్యుల వంటి అశాస్త్రీయవాదులు, భ్రాంతివాదులు, మాయావాదులు ప్రచారంలోనికి రావటానికి కారణం, చార్వాకుల శాస్త్రీయ సిద్ధాంతాలను ప్రజల్లోకి తీసుకొని పోవక పోవటమే. చార్వాకుల సిద్ధాంతాలే సరిగా ప్రచారం జరిగివుంటే మాయావాదుల బూజులు భారతీయుల బుర్రలకు పట్టి వుండేవి కావు.

## జీవనం కోసం ప్రేతకర్మలు :

శ్లో॥ తతశ్చ జీవనోపాయో
బ్రాహ్మణై ర్విహిత స్త్విహ ।
మృతానాం ప్రేత కార్యాణి
నత్వన్యత్ విద్యతే క్వచిత్ ॥

కావున బ్రాహ్మణులు జీవనోపాయముగా చచ్చిన వారలకు ప్రేత కార్యములను విధించియున్నారు. ఇతర ప్రయోజనమిందు ఏమియులేదు.

వ్యాఖ్య : విశ్వానికి, మానవునికి మూలాల్ని చెప్పలేని బ్రాహ్మణ వేదాంతులు జీవనోపాయం కోసం ప్రేతకర్మలను నిర్ణయించుకున్నారు. చనిపోయిన వారి పేరు మీద దానకర్మాలను నిర్ణయించారు. ఇదంతా అబద్ధమని నిరీశ్వర దార్శనికుడు అసితకేశ కంబళుడు ఈ విధంగా విన్నవిస్తున్నాడు- చూడండి.

"దానం- యజ్ఞం- హోమం వ్యర్థం. పాపం- పుణ్యం తాలూకు ఫలితాలు ఉండవు. పరలోకం లేదు. దేవతల్లేరు. ఈ లోకంలో సత్యాన్ని చేరుకోగలవారు బ్రాహ్మణ శ్రమణులు కాదు. ఈ లోకం, పరలోకం ఎవరూ స్వయంగా చూసి చెప్పడం లేదు. మానవుడు నాలుగు మహాభూతాల చేత నిర్మింపబడ్డాడు. అతడు చనిపోయాక శరీరంలోని పృధ్వి- పృధ్విలో కలిసిపోతుంది. నిప్పు నిప్పులో కల్సిపోతుంది. వాయువు వాయువులో కలిసిపోతుంది. ఇంద్రియాలు ఆకాశంలో కలిసిపోతాయి. చనిపోయిన వారిని మంచంలో పడుకోపెడతాము. కాల్చేస్తాము. అతడి మాంసం అదృశ్య మవుతుంది. ఎముకలు పావురం రంగుకు వస్తాయి. ఆహుతులు బూడిద అవుతాయి. కనుక చచ్చినవారి కోసం దానం చేయమనడం మూర్ఖుల మాట ఆస్తికవాదులు చెప్పేదంతా అబద్ధం; తుచ్ఛమైనవి. మూర్ఖుడు కానీ, పండితుడు గానీ చనిపోవడంతో ఉచ్ఛిన్నమౌతాడు; నాశనమౌతాడు. చనిపోయిన తరువాత ఇంక ఏమియు వుండదు.

(రాహుల్ సాంకృత్యాయన్ "దర్శన్ దిగ్దర్శన్"- పేజి 112)

ఈ సిద్ధాంతాల్ను ఆనాటి వైదిక ఋషుల దగ్గర నుండి ఈనాటి సర్వేపల్లి రాధాకృష్ణ పండితుని వరకు ముక్తకంఠంతో అందరూ నిరసించారు. సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు తన భారతీయ తత్త్వశాస్త్రంలో చార్వాకాన్ని సప్రమాణంగా ఖండించలేక ఈ సిద్ధాంతాన్ని ప్రమాణంగా మాత్రం స్వీకరించవద్దని వ్రాయుచు చున్నాడు.

"పూర్వ మతాచారములు, ఐంద్రజాలిక విద్యలు నాస్తికవాద ప్రచారమునకు కొంత కారణములైనవి. చార్వాక సిద్ధాంతము వంటి విప్లవాందోళన మనేక శతాబ్ది వ్యాప్తమైయున్న మూఢవిశ్వాస మాంద్యముల నొక్కపరి కదల్చివైచిన గాని, నాటికి సజీవములై కాలము, జనము నాదరించిన అభ్యాసములను, సాంఘికవ్యవస్థ లను, విశాల భావముతో పునర్నిర్మాణ మొనర్చు ప్రయత్నమంతగా జయప్రదము కాజాలదు. మానవ వ్యక్తిగతమైన ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమును, బాహ్యప్రమాణ శాసన తిరస్కారమును నాస్తికవాదము ప్రకటించిన ముఖ్య భావములు. సహేతు కము గాని దాని నెవడును ప్రమాణముగా నంగీకరింప నవసరము లేదు. మానవు డాత్మశక్తి యందలి విశ్వాస సీమకు మరల తిరిగివచ్చి, పరాధార బాహ్య శాసనము లను తిరస్కరించుటయే జరిగినది. యుగమునకు దుర్భరమైన గత సంప్రదాయా చారము నుండి లోకమును గాపాడుటకై చేయబడిన ఉగ్ర ప్రయత్నమే చార్వాక ప్రచారము. ఈ మూర్ఖ సిద్ధాంత విశ్వాసములను నిర్మూలింపనిదే విజ్ఞాన వికాస ముతో గూడిన పునర్నిర్మాణ కార్యక్రమమున కవకాశము లేకుండెడిది."

అయితే ఈ చార్వాక సిద్ధాంతాన్ని గూర్చి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారే "ప్రబోధ చంద్రోదయం" లో వివరించిన విధానాన్ని ఈ విధంగా ఉదహ రిస్తున్నాడు.

"లోకాయత శాస్త్రమొక్కటే నిజమైన శాస్త్రము. ఇందు ప్రత్యక్షమొక్కటే ప్రమాణము. భూమి, జలాగ్ని వాయువులు నాలుగు భూతములు. మానవ జీవితము నకు ధనము, భోగము రెండే వస్తువులు. జడపదార్థమున కాలోచనా శక్తి కలదు. ఇంకొక లోకము లేదు. చావుతో నన్నియు బోవును." లోకాయత శాస్త్రమనుటకు కారణమది యీ లోక మొక్కటే యున్నదని చెప్పును. వారిని చార్వాకులనియు పిలుతురు. చార్వాకుడు మత స్థాపకుడు.

ప్రత్యక్షముగా గోచరించుచున్న దొక్కటే సత్యము. అది యొక్కటే యున్నది. ప్రత్యక్షము కానిది లేనిదే. ఏలన, ఉండిన కనపడెడిది. అనుమానము

లేదు. మనము పొగను జూచినప్పుడు నిప్పు జ్ఞాపకము వచ్చును. కారణమ్ము రెండును కలిసి యుండునని మనమిదివర కెరుగుదుము. అందుచే అనుమానమ్ము అనుమానింప దగినదే. ఏలన, అది ఒకప్పుడు నిజమగును, మరొకప్పుడు కాదు. తరువాత వచ్చిన చార్వాకులు దీనికి ఇతర కారణముల నిచ్చిరి. సర్వవస్తు సంబంధ జ్ఞానమున్నా కాని మన కనుమానము లేదు. ప్రత్యక్ష ప్రమాణమట్టి జ్ఞానమును మనకీయదు. అనుమానము నీయదు. ఏలన- ఒక అనుమానము మరొక అనుమానమును గోరును. దానికి అంతముండదు. ఇతరుల సాక్ష్యమంగీకార యోగ్యం కాదు. సామ్యము అనుమానమును ఋజువు చేయదు. అందుచే అనుమానమ్ము ప్రమాణము కాజాలదు. అనుమానము కేవల వ్యక్తిగత భావముల పొందిక. అందుచే ఎప్పుడైననది నిజమై తటస్థింపవచ్చును.

ఇంద్రియానుభవ మొకటే జ్ఞానము కావున జడపదార్థ మొకటే పరమ సత్యము. ఇంద్రియములు తెలియునది దొక్కటే. భూమి జలాగ్ని వాయువులే మనకు గల భూతములు, ఇవి శాశ్వతమైనవి. జీవాణువు మొదలు తత్త్వవేత్త వరకు గల సర్వప్రాణి కోటియు జడపదార్థ కల్పితములు. నాలుగు భూతముల సమ్మేళనముచే నుదయించునదే బుద్ధి. బుద్ధిలేని నుండి వచ్చినదో ఆ భూతములు విడిపోయినపుడు అదృశ్యమగును. బుద్ధి జడపదార్థములైన భూతముల నుండి వచ్చిన భూత రూపమే. తమలపాకులు, సున్నము, పోకచెక్క కలిసిన ఎరుపు రంగు వచ్చునట్లే, భూతముల కలయికచే బుద్ధివచ్చును. *

## సాంఖ్య దర్శనం - భౌతికవాదం

చార్వాక దర్శన ప్రభావం సాంఖ్యదర్శనం మీద ప్రగాఢంగా వుంది. సాంఖ్య దర్శనంలో నిరీశ్వరవాద ఛాయలు మిక్కుటంగా వున్నాయి. ఈ తత్త్వ శాస్త్రం కూడ వైదిక దార్శనికుల పాశవికమైన దాడులకు గురియైనది. ఈ విషయాన్ని దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ తన "ఇండియన్ ఎథీజం" (Indian Atheism) లో ఈ విధంగా వివరించారు.

"Samkhya atheism seems to have a unique interest in the history of phylosophy because of a number of important reasons one of these is its great antiquily. The others are the tremendous prestige which it once evidently enjoyed and the

* భారతీయ తత్త్వశాస్త్రం- వాల్యూం II పేజి 14, 15.

distinct possibility of it being motivated by scientific or proto-scientific considerations. Yet, excepting perhaps the Lokayata, no other philosophy in this country suffered such a general wreck as Samkhya did. What actually survives today of this extremely ancient and once influential philosophy is only a heap of broken pieces." *

తత్త్వశాస్త్ర చరిత్రలో సాంఖ్య నాస్తిక సిద్ధాంతానికి అపమాన్యమైన ఉత్తేజం వున్నట్లు కనిపిస్తున్నది. అందుకు అనేకమైన కారణాలున్నాయి. అందులో ఒక కారణం దాని ప్రాచీనత్వం. మిగిలినవి ప్రాచీన శాస్త్రీయ ప్రత్యేకత కలిగి అత్యంత ప్రతిష్ఠను పొంది వుండటం. అయితే, లోకాయత మినహాయించి, ఈ దేశంలో సాంఖ్య తత్త్వశాస్త్రం ధ్వంసం చేయబడినంతగా, మరి యే యితర తత్త్వశాస్త్రం ధ్వంసం చేయబడలేదు. చాలా ప్రాచీనకాలం నుండి శాస్త్రీయంగా యెనలేని గౌరవాన్ని పొందిన సాంఖ్య తత్త్వశాస్త్ర శిథిల శకలాలు మాత్రమే వాస్తవంగా ఈనాడు దొరుకుతున్నాయి.

సాంఖ్య దర్శనానికి ఇప్పుడు దొరుకుతున్న ఆధారాలు.

సాంఖ్యదర్శన ద్రష్ట కపిలుడు. కపిలుడు "సాంఖ్య సూత్రములు" ను మొదట వెలువరించి "సాంఖ్య ప్రవచన సూత్రములు" అను మరొక గ్రంథమును తరువాత మరింత విపులముగా విరచించెను. సాంఖ్య దర్శనమును ప్రవచించు గ్రంథములు ఇప్పుడు లభ్యమగుచున్నవి ఇవి-

1) ఈశ్వర కృష్ణుడు రచించిన "సాంఖ్య కారిక"
2) గౌడ పాదకృత "సాంఖ్యకారికా భాష్యము"
3) వాచస్పతి విరచిత "తత్త్వ కౌముది"
4) విజ్ఞాన భిక్షు గ్రథిత "సాంఖ్య ప్రవచన భాష్యము", 'సాంఖ్య సారము'

## సాంఖ్యుల ప్రకృతి సిద్ధాంతం

జగత్తున కంతటికిని మూలము, అవ్యక్తమునగు కారణము ప్రకృతి. ఈ ప్రకృతి నిత్యము నిత్య పరిణామి. సత్వ, రజస్సు, తమస్సుల సామ్యావస్థయే ప్రకృతి. ఈ మూడింటిని గుణములందురు. కాని, నిజమునకివి గుణములు కావు.

* "Indian Atheism"- Page 69,
—By Deviprasad Chattopadhyaya.

మూడు పాయలు కలిసి త్రాడగునట్లు ఇవి ప్రకృతి స్వరూపాంశములే! జగత్తులోని వస్తువులన్నియు కార్యములు. వీటిలో సుఖము, దుఃఖము, మోహము అను గుణములు కనిపిస్తున్నాయి. అందుచే ఈ కార్యము లన్నిటికి చరమ కారణమైనది ప్రకృతి.

ప్రకృతి, పురుష సంయోగము వలన జగత్తు ఆవిర్భవించినదని సాంఖ్యుల మతము. ప్రకృతి నుండి మహత్తు పుడుతుందని, ఈ మహత్తే ఈ మహా విశ్వమునకు మూల బీజమని, దీనికే బుద్ధి అని నామాంతరమని సాంఖ్యులు పేర్కొన్నారు. పురుషుని చైతన్యము దీనిలో ప్రతిబింబితమై, దీనిని చేతన సదృశ్యముగా కనిపించినట్లు చేయును గనుక "బుద్ధి" అను పేరు దీనికి వచ్చిందని వారు సిద్ధాంతీకరించారు. నేను, నాది అను అభిమానమే అహంకారం. ఈ అహంకారం నుండి సత్వగుణము పాలు అధికమైనప్పుడు ఐదు జ్ఞానేంద్రియములును, ఐదు కర్మేంద్రియములను ఈ ఉభయేంద్రియములను కైవసమొనర్చుకొన్న మనస్సును పుట్టుచున్నవని వారు వ్యాఖ్యానించారు. ఇట్లే తమో గుణాంశం అధికమైనపుడు ఈ అహంకారము నుండియే శబ్ద, స్పర్శ, రూప, రసగంధములను పంచతన్మాత్రలు పుట్టుచున్నవని, ఆ పంచతన్మాత్రల నుండి వరుసగా ఆకాసము, వాయువు, తేజస్సు, నీరు, భూమి అను సాంఖ్యులు పేర్కొన్నవి 25 సిద్ధాంతములు. వీటిలో పురుషునిలో తప్ప మిగిలిన అన్నింటిలోను ప్రకృత్యాంశము ప్రధానము. వారి తాత్విక ఆలోచనకు ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అనునవి ప్రమాణములుగా వున్నవి. ఈశ్వరుని యొక్క అస్తిత్వాన్ని ఏ విధంగానూ రుజువు చేయలేమని సాంఖ్యులు పేర్కొన్నారు. సాంఖ్యానికి ఈశ్వరత్వాన్ని, ఆత్మను, తరువాత కాలంలో సమన్వయించటానికి ప్రయత్నించి సేశ్వర సాంఖ్యాన్ని వైదికులు సృష్టించారు. అది వైదికుల కల్పనమేనని దార్శనికులు రుజువుచేశారు.

## చార్వాకులు - సాంఖ్యులు :

దీనినిబట్టి చార్వాకుల ప్రభావం సాంఖ్య దార్శనికుల మీద చాలా ప్రగాఢంగా వున్నదని వ్యక్తమవుతున్నది. సాంఖ్యుల పంచభూతాల్లోని "నీరు"ను చార్వాకులు పేర్కొనలేదు. నీరు అనేది రెండు వాయువుల సంయోగమే గాని మూలభూతం కాదని చార్వాకుల సిద్ధాంతం. చార్వాకులు ప్రత్యక్ష ప్రమాణాన్ని అంగీకరిస్తే నీరు వాటికి "అనుమానము"ను జోడించారు. చార్వాకులు తమ సిద్ధాంతాన్ని సూటిగా చెప్పారు. సాంఖ్యులు వారి సిద్ధాంతాలను తర్కబద్ధంగా చెప్పారు.

సాంఖ్యుల దార్శనిక దృక్పథములోని విశాలత, అభివృద్ధి శాస్త్రీయత చార్వాకుల ప్రభావము నుండే సంక్రమించినవి. చార్వాకుల మీద, సాంఖ్యుల మీద వైదికులు చేసిన క్రూరమైన దాడులు వారిని, వారి శాస్త్రాలను కూడా ధ్వంసం చేశాయి. అయితే వాటికున్న జవము, జీవము, శాస్త్రీయతా వాస్తవము అవి ఇంతకాలం బ్రతకటానికి మూలమైనవి.

చార్వాకుల, సాంఖ్యుల శాస్త్రీయ సిద్ధాంతాలను బ్రాహ్మణులు ఖండించ డానికి ప్రధాన కారణం, వారు జీవనోపాధి కొరకు సృష్టించుకొన్న అశాస్త్రీయ పరికల్పనలన్నీ చార్వాకుల, సాంఖ్యుల అగ్నిసూత్రాలకు దగ్ధమైపోతాయి. ఆనాడే చార్వాకులు జీవనోపాధి కోసరమే బ్రాహ్మణులు ప్రేత కార్యాలను విధించారని సత్య సూత్రాలను ప్రవచించారు. వాటి యాథార్థ్యం యెదుగుతున్న శాస్త్రీయ యుగంలో మరింత రుజువవుతున్నది.

## వేదాలు - చార్వాకులు

శ్లో॥ త్రయోవేదస్య కర్తారః
భాండధూర్త నిశాచరాః ।
జర్భరీ తుర్ఫరీ త్యాది
పండితానాం వచఃస్మృతమ్ ॥

మూడు వేదములు వ్రాసినవాళ్ళు కపటులు, రాక్షసులు. అందుకే జర్భరీ, తుర్ఫరీ (చార్వాకులను వేద పండితులు ఇలా పిలుస్తారు) అను పండితుల మాటలు పీరికి అర్థంకావు.

వేదాలు భారతీయ సంస్కృతికి మూలమని, వేదాలు తాత్త్విక, సైద్ధాంతిక గ్రంథరాజాలని ఒక పెద్ద ప్రచారం జరిగింది. అందుకే, వేదాల మీద చార్వాకులు ఆనాడే ధ్వజమెత్తారు. చార్వాకుల బాటలో అసలు వేదాలు భారతీయమా? వేదాల రచయిత లెవరు? వేదాలలో ఏమున్నది? కొంత పరిశీలిద్దాం.

## వేదాలు - ఒక పరిశీలన

భారతదేశంలో లిఖిత గ్రంథాల్లో మొదట లభిస్తున్నవిగా చెప్పబడుతున్న వేదాల్ని గురించి పరిశీలించడం అవసరం. వేదాలు నాలుగు 1) ఋగ్వేద సంహిత 2) యజుర్వేద సంహిత 3) సామవేద సంహిత 4) అథర్వణ సంహిత పీటిలో మొదటిది ప్రాచీనమైనదీ, ప్రసిద్ధిమైనదీ కూడా. ఈ ఋగ్వేదంలో 1028 ఋక్కు-

బడ్డాయి. ఈ వేదాలు ఆర్యులు రచించడం వలన ఇవి భారతీయం కాదు, అనేది మనం తెలుసుకోవాలి. ఈ వేదకాలాన్ని గురించి కాలనిర్ణయం చేసేందుకు పండితులు తీవ్రమైన చర్చలు చేస్తున్నారు. సహజంగానే వేదాల్లో అన్నిటికీ పూర్వమైనదిగా చెప్పబడుతున్న ఋగ్వేదంతోనే ఈ చర్చ మొదలౌతుంది. కొందరు పండితులు భాషాపరంగానో, అలెగ్జాండర్, బుద్ధుడు, మొదలగువారి కాలాలకు సంబంధించి, చరిత్ర పూర్వానికి తార్కిక నిగమాలతో వెళుతూ వాదించడం జరిగింది. బొగాజుకో ఫలకాలు, సింధులోయ నాగరికత త్రవ్వకాలు కొత్త విషయాలను వెలుగులోకి తెచ్చాయి.

ప్రాచీనకాలంలో ఆసియా మైనరు ద్వారా, యూఫ్రటిస్, టైగ్రిస్ నదీ తీరాల్లో హిటైట్ (ఆసియా మైనరు), మెటన్నీ, మెసపుటోమియాల్లో రాజ్యాల్ని స్థాపించుకున్నారు. ఇక్కడ నుంచి ప్రష్య ప్రవేశించి, మాషాద్, బాక్ట్రియాలకు పోయినారు. భారతీయ ఆర్యులు, ఇరానియన్ల పూర్వులు చిరకాలం ఈ ప్రాంతంలోనే కలిసిమెలిసి ఉన్నారు. తర్వాత భారతీయ ఆర్యుల పూర్వులు హిందూకుషాన్ పర్వతాలు దాటి భారతదేశంలో ప్రవేశించారని ఒక వాదం. అయితే ఉత్తరధృవ ప్రాంతాల్నుంచి ఆర్యులు భారతదేశానికి వచ్చారని తిలక్‌గారి వాదన. ఈ విధంగా రకరకాల వాదాలున్నా, మొత్తం మీద ఆర్యులు భారతీయులు కారు. భారతదేశానికి వలసవచ్చినవారే. ఈ విషయాన్ని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు ఇలా వివరించారు.

"ఆర్యులు తమ తొలి నివాసముల నుండి భరతవర్షమునకు వచ్చిన నాటి బుద్ధివికాస యుగమునకు చెందినవే నేడు మనకు తెలిసిన వేదములు." * (భారతీయ తత్త్వశాస్త్రము - 73 వ పేజీ)

---

* Chronology of Vedic-texts : The problem of the chronology of Vedic texts has engaged the serious attention of scholars throughout the history of Vedic studies. The starting point of all the discussions in this connection was naturally to determine the age of R. V. which was universally regarded as the oldest Vedic-text. Some scholars have approached this problem from the linguistic stand point, while others believe that the only way of arriving at a reasonable solution is to go backwards from the more or less definitely fixed dates of Buddha and Alexander. The discovery of the Boghazkoi inscription (Bog. ins.) an and the recent excavation in the Indur

ఆర్యుల వలసను గురించి రొమిల్లా థాపర్ ఇలా వివరించారు. "ఆర్యులు భారత దేశీయులు కారు. విదేశీయులు. వారు ఈశాన్య ఇరాన్ ప్రాంతం కాస్పియన్ సముద్రానికి చుట్టూ వున్న ప్రాంతం- (ప్రస్తుతం యు. యస్. యస్. ఆర్. లోని ఆసియా రిపబ్లిక్‌ల ప్రాంతం) నుంచి వలస వచ్చారు. మొత్తం మీద భారత దేశానికి వలస వచ్చిన ఆర్యుల ఆలోచనల సముచ్చయమైనవే వేదాలని తెలుస్తోంది.

ఇవి అపౌరుషేయాలని వీరి వాదన. అనగా ఈశ్వర ప్రోక్తాలు గాని, మానవులచే చెప్పబడినవి గావని, ఇది అసంబద్ధమైన విషయమని తత్వశాస్త్ర పరిశీలకులందరూ భావించారు. వేదకాలం చాలా వివాదస్పదమైనది.

దయానంద సరస్వతి వేదాల పుట్టుకను గూర్చి—

ఒక వృందము, తొంబదియారు కోట్ల, యెనిమిది లక్షల, ఏబది రెండువేల తొమ్మిది వందల డెబ్బదియారు .(1,96,08,52,976) సంవత్సరములైనవి. వేదములు, జగత్తున ఉత్పన్నములై ఇప్పుడు డెబ్బది ఏడవ సంవత్సరము గడచు చున్నది " (వేదతత్వ ప్రకాశము - 31వ పేజీ) ఇది చరిత్రకు విరుద్ధం. చరిత్ర కారులైన జాకోబీ, తిలక్‌లు క్రీ. పూ. నాల్గువేల అయిదువందలని, మాక్స్‌ముల్లర్ క్రీ. పూ. 1200 అనీ, దాస్‌గుప్త క్రీ. పూ. 1000 సం॥రాలనీ, రాధాకృష్ణన్ క్రీ. పూ. 1500 సం॥రాలనీ, హిరయాన క్రీ. పూ. 1600 సం॥రాలనీ రకరకాలుగా

---

Vally have again given all together novel turn to the whole problem. Scholars are generally of the opinion that the question of the age of R. V. is closely related to that of the entry of the Aryans into India. Geological, Astronomical and religio-historical considerations have also played their own part in this engrossring field. The result of this is the enunciation of a large number of theories, admirable resume and review of which have been attempted by Hiliebrandt (ZDMG, 81), dela vallee Poussin (Indo-Europ. at Indo-Ir, Paris, 1930) and Keith (Woolner comm. Vol, 1940) Indeed one is some times inclined to feel that in this veritable plethora of hypothesis, interesting as they might be, one hypothesis would easily cancel the other.

(Twenty five years of Vedic Studies -by R. N. Dandedkar from the book "Studies in History of Indian philosophy" Edited by the Debiprasad Chattopadhyaya - Page-76)

వ్యాఖ్యానించారు. మొత్తం మీద రొమిల్లా థాపర్ వంటి చరిత్రకారులు క్రీ.పూ. 1500 సం॥రాలుగా కాలనిర్ణయం చేశారు. దీన్నిబట్టి ఆర్యుల రాకతోటే భారతీయ చరిత్ర, తత్త్వశాస్త్రాలు ఆరంభమయాయనడం అసంబద్ధమవుతుంది. ఆర్యుల రాక మునుపు క్రీ.పూ. 5000 సంవత్సరాల నాటికే వున్న హరప్పా, మొహంజదారో సంస్కృతుల్లో కనిపిస్తున్న స్త్రీ మాతల బొమ్మల్నిబట్టి ఆనాటికే ఏదో ఒక రూపంలో తత్త్వశాస్త్రం ఉండి ఉంటుందనేది సత్యం. దీన్నిబట్టి వేదాలు భారత దేశపు మొదటి తాత్త్విక గ్రంథాలు కావు. అంతేగాక ఇవి యే వ్యక్తో ఒకనాడు కూర్చుని రచించినవి కావు.

ఎన్నో కాలాలలో ఎందరో రచయితలు అనేక భాషాభేదాల్తో, అనేక వాతావరణ పరిస్థితుల్లో వెలువరించిన క్రుతులు. అవి మొదటి లిఖితరూపం ధరించక పోవడం వలన శిష్యపరంపరలో ఒకరి నుండి ఒకరికి చెప్పబడినవి గాబట్టి వీటిని శ్రుతులని గూడా అన్నారు. వేదాలు ఎన్ని అనే దానిలో కూడా వాదోపవాదాలున్నాయి.

ప్రాచీన వాఙ్మయంలో మూడు వేదాలనే గ్రహించుట జరిగినది. చార్వాకులు గూడా 3 వేదాలనే నిరసించారు. భాండ, ధూర్త, నిశాచరులనే ముగ్గురు రాక్షసులు మూడు వేదాలను రచించినారని, జర్ఫరీ, తుర్ఫరీ మొదలగు పండితులు కల్పించిన ధూర్తాలాపనలనీ వారు నిందించారు !

త్రయో వేదస్య కర్తారో భాండా, ధూర్త, నిశాచరాః
జర్ఫరీ, తుర్ఫరీత్యాది పండితానాం వచః స్మృతమ్॥

"వేదః" అనే పదాన్ని కొందరు ఋగ్వేదానికే పరిమితం చేస్తారు. కొందరు వైదిక సాహిత్యానికంతకూ ఆ పదాన్ని అన్వయిస్తారు. వేదంలో నాలుగు భాగాలున్నాయనుకోవడం కంటే, వైదిక వాఙ్మయంలో మంత్రాలు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులనే నాలుగు భాగాలున్నాయని అనడం సబబని కొందరంటున్నారు. వేదాల్లో మొదటిదైన ఋగ్వేదంలోని మంత్రాలే యజుర్వేదంలో యజ్ఞానుక్రమంగా రూపొందించారు. ఆ మంత్రాలను గానం చేసే పద్ధతినే సామవేదం వివరిస్తోంది. అంటే అసలు వేదమనేది ఒకటిగావే భావించడం కూడా సబబని తోస్తుంది.

ఋగ్వేదంలోని ఋషులను, ఛందస్సును వారు కొనియాడిన దేవతలను ఈ క్రింది పట్టికలో పరిశీలించండి.

| సూక్తము | ఋషి - అతని వివరాలు | దేవతలు వారి పేర్లు | ఛందస్సు |
|---|---|---|---|
| 1 | విశ్వామిత్ర పుత్రుడగు మధుచ్ఛన్దస్సుడు | అగ్ని | గాయత్రి |
| 2 | ,, ,, ,, | వాయువు, ఇంద్రమిత్ర వరుణులు | గాయత్రి |
| 3 | ,, ,, ,, | అశ్వనీ దేవతలు, ఇంద్రుడు, విశ్వేదేవతలు, సరస్వతీ దేవత | గాయత్రి |
| అను 2 | | | |
| 4 | ,, ,, ,, | ఇంద్రుడు | గాయత్రి |
| 5 | ,, ,, ,, | ఇంద్రుడు | గాయత్రి |
| 6 | ,, ,, ,, | ఇంద్రుడు, మరుత్తులు | గాయత్రి |
| 7 | ,, ,, ,, | ఇంద్రుడు | గాయత్రి |
| అను 3 | | | |
| 8 | ,, ,, ,, | ఇంద్రుడు | గాయత్రి |
| 9 | ,, ,, ,, | ఇంద్రుడు | గాయత్రి |
| 10 | ,, ,, ,, | ఇంద్రుడు | అనుష్టుపు |
| 11 | మధుచ్ఛన్దనుడు అనువాని కొడుకు జేతయనువాడు | ఇంద్రుడు | అనుష్టుపు |
| అను 4 | | | |
| 12 | కణ్వపుత్రుడగు మేధాతిధి | అగ్ని | గాయత్రి |
| 13 | ,, ,, ,, | ప్రతిరుక్కువందు చెప్పబడు ఆయా దేవతలు | గాయత్రి |
| 14 | ,, ,, ,, | అగ్ని | గాయత్రి |
| 15 | ,, ,, ,, | ఇంద్రదులు | గాయత్రి |
| 16 | ,, ,, ,, | ఇంద్రుడు | గాయత్రి |
| 17 | ,, ,, ,, | ఇంద్రావరుణులు | గాయత్రి |
| అను 5 | | | |
| 18 | ,, ,, ,, | బ్రాహ్మణస్పతి, చదసస్పతి | గాయత్రి |
| 19 | ,, ,, ,, | అగ్ని వాయువులు | గాయత్రి |

# ద్వితీయాధ్యాయము

| | | | |
|---|---|---|---|
| 20 | కణ్వపుత్రుడగు మేధాతిథి | ఋభువులు | గాయత్రి |
| 21 | ,, ,, ,, | ఇంద్రాగ్నులు | గాయత్రి |
| 22 | ,, ,, ,, | అశ్వనీదేవతలు, సూర్యుడు, | |
| | | అగ్ని, ఇంద్రాణి, | |
| | | వరుణాని, అగ్నాయి, | |
| | | భూమ్యంతరిక్షములు | |
| | | పృధివి, విష్ణువు | గాయత్రి |
| 23 | ,, ,, ,, | వాయువు, ఇంద్రాణి, | గాయత్రి |
| | | మిత్రవరుణులు, మరుద్గణ | ఉష్ణిక |
| | | వశిష్టుడగు ఇంద్రుడు | అనుష్టుపు |
| | | పౌష్టునుడు, ఉదకదేవత, | |
| | | అగ్ని | |
| అను 6 | | | |
| 24 | అజీగర్తపుత్రుడు శునశ్శేపుడు | ప్రజాపతి, అగ్ని, సవిత | త్రిష్టుప్ |
| | | వరుణుడు | గాయత్రి |
| 25 | ,, ,, ,, | వరుణుడు | గాయత్రి |
| 26 | ,, ,, ,, | అగ్ని | గాయత్రి |
| 27 | ,, ,, ,, | అగ్ని, విశ్వేదేవులు | గాయత్రి |
| 28 | ,, ,, ,, | ఇంద్రుడు, ఉలూఖలము | |
| | | ముసలములు, హరిశ్చంద్ర, | అనుష్టుప్ |
| | | అధిష్టావశర్మ, సోముడు | గాయత్రి |
| 29 | ,, ,, ,, | ఇంద్రుడు | పఙ్క్తి |
| 30 | ,, ,, ,, | ఇంద్రుడు, | త్రిష్టుప్ |
| | | అశ్వనీదేవతలు, ఉషస్సులు | గ్రాయతి |
| అను 7 | | | |
| 31 | అంగీరస పుత్రుడగు హిరణ్యా స్థూపుడు | అగ్ని | త్రిష్టుప్ జగతి |
| 32 | ,, ,, ,, | ఇంద్రుడు | త్రిష్టుప్ |

ఋగ్వేదం ప్రథమ మండలంలోని ప్రథమ ద్వితీయా ధ్యానములలోని ఈ పట్టిక ద్వారా అగ్ని, వాయు, ఇంద్ర, మిత్ర వరుణాది దేవతలను మధుచ్ఛందుడు, మేధాతిథి, శునశ్శేపుడు, హిరణ్యస్తూపుడు మొదలుగా గల ఋషిపుత్రులు, గాయత్రి, అనుష్టుపాది ఛందస్సులలో చెప్పినట్లు తెలుస్తుంది. ఈ విధంగా వారు అతిధి, వరుణ, మిత్ర, అగ్ని, అర్యమా, సవిత, భగ, రుద్ర, వసుగణ, మరుత్, రోదసి, ద్యౌ, పృధివి, అశ్వనీ దేవతలు, నాసతవ, సరస్వతి, వాయువు, ఋభుక్, పర్జన్యులను కొనియాడారు. వారి పూజావిధానాన్ని తెలుసుకోవడం కోసం అగ్ని పూజను కొంత పరిశీలిద్దాం.

## అగ్ని

అగ్నిమీళే పురోహితం। యజ్ఞస్యదేవమృత్విజమ్
హోతారం రత్నధా తమమ్ ॥ (ఋ-1-1)

పురోహితునివలె యజ్ఞమును నడిపించువాడును, (దేవతలను) పిలుచుకొని వచ్చువాడును, ఋత్విజుడై (యజ్ఞమును సాధించువాడును) రత్నములను (యజ్ఞ ఫలములను) ధరించువాడువగు అగ్నిదేవుని స్తుతించుచున్నాము.

అగ్నినా రయి మశ్నవ త్పోషమేవ దివేదివే। యశసం
వీరవత్తమమ్। (ఋ-1-3)

ఆ యగ్నిచేతనే (యజమానుడు) ధనమును పొందుచున్నాడు. ప్రతి దినమును తప్పక పుష్టిని పొందుచున్నాడు. కీర్తిని, వీరులైన పుత్రపౌత్రాదుల పొందుచున్నాడు.

ఉపత్వాగ్నే దివేదివే దోషావస్తర్ధియా వయమ్।
నమో భరంత ఏమసి ॥ (ఋ-1-8)

ఓ యగ్ని! ప్రతిదినమును రాత్రింబవళ్ళు మనస్సుతో నిన్ను నమస్క రించుచున్న మేము నీ సమీపమునకు వచ్చుచున్నాము.

సనః పితేవ సూనవేగ్నే సూపాయనో భవ। సచస్వానః
స్వస్తయే ॥ (ఋ-1-9)

ఓ యగ్ని! కుమారుని కొఱకు తండ్రివలె నీవు మా కొఱకు [illegible] గూర్చువాడవును, మా మేలు కొఱకై ప్రయత్నించువాడవును [illegible]

అగ్నిని వారానాడు ఈ విధంగా పూజించారు. అగ్ని ఆనాడు వారి జీవితంలో ప్రధానపాత్ర వహిస్తుంది. ప్రతి యింటిలోను అగ్ని నిత్యం జ్వలిస్తూ వుండేది. ఆ విషయాన్నే ఋగ్వేదంలో—

అశ్వో న క్రందన్ జనభిః సమిధ్యతే
వైశ్వానరః కుశిభిరుగ్వే యుగే ।
సనో అగ్నిః సువీర్యం, స్వశ్వ్యం దధాతు
రత్నమమృతేషు జాగృతిః ॥

వైశ్వానర అగ్ని అశ్వమువలె సకిలిస్తూ, కుశికులచే యుగయుగములందు (సదా) ప్రజ్వలింప బడుతున్నది. అమృతములందు జాగరూకమైన ఆ అగ్ని మాకు బలమును, మంచి అశ్వములను, మంచి రత్నములను ప్రసాదించు గాక— అని విశ్వామిత్రుడు తన వంశీకులకు చెప్పుకొన్నాడు. ఇలకా భరద్వాజుడు అగ్ని మహిమను గూర్చి చెప్పాడు.

ఆ వ్రత పాలకుడగు అగ్ని పరమ వ్యోమమందు పుట్టి వ్రతములను కాపాడుతున్నాడు. ఆ సుకర్ముడు ఆకాశాన్ని కొలుస్తున్నాడు. వైశ్వానర అగ్ని తన మహిమచేత నాకమును (స్వర్గమును) తాకుతున్నాడు.

మహిషులు (గొప్పవారు) అంతరిక్షమందు అతన్ని ధరించారు. విశులు (ప్రజలు) పూజ్యుడైన రాజు అని గౌరవించారు.

వివస్వాన్ (సూర్యుడు) దూతయగు వైశ్వానర అగ్నిని వాయువు దూరము నుండి తెచ్చి ధరించినది.

భరద్వాజుడు అగ్నిని, "యుగయుగాల అమరదూత" అన్నాడు.

త్వాం దూతమగ్నే అమృతం యుగేయుగే
హవ్యవాహం దధిరే పాయుమీడ్యం
దేవాసశ్చ మర్తాసశ్చ జాగృవిం విభుం
విశ్పతిం నమసా విషేదిరే ॥

హవ్యవాహకుడును, రక్షకుడును, పూజ్యుడైను అయిన ఓ అగ్నీ! అమర దూతవైన నిన్ను ప్రతి యుగంలోను ధరిస్తారు. నీవు విభుడవు, జాగరూకుడవు, ప్రజాపతివి. నిన్ను దేవులు, మానవులు నమస్కరించి స్థాపన చేస్తారు.

విశ్వామిత్రుడు కూడా అగ్నిని స్తుతించాడు. హవిస్సు కల్గిన ధనము కోరుచున్న కుశికులమైన మేము సత్యానువర్తియు, స్వర్గవేత్తయు, సుదాతయు, అశ్వసారధియు, అణు (సూక్ష్మ) రూపియు, అయిన వైశ్వానర అగ్నిని మనస్సుతో తెలుసుకొని ఆహ్వానిస్తున్నాం. (3-26-1)

సకిలిస్తున్న స్త్రీల ద్వారా వెలిగించబడిన వైశ్వానర అగ్ని కుశికులచే యుగయుగముల నుండి పోషింపబడుచున్నాడు. అమరులందు జాగరూకుడైన అగ్ని మాకు అందమైన వీరులను, అశ్వములను, రత్నములను ఇచ్చుగాక.

అగ్ని రస్మి జన్మనా జాతవేదా ఘృతంమే
చక్షురమృతం మే ఆసన్
అర్కస్త్రిధా తూ రజసో విమానోఽజస్రో
దర్మోహ విరస్మినామ ॥ (3-26-7)

నేను అగ్నిని పుట్టుకతోనే అంతా ఎరుగుదును. నెయ్యి నా కన్ను. అమృతం నా నోటిలో ఉంది. నేను త్రివిధ అర్కుడను (సూర్యుడను). లోకాలను కాలిచేవాడను. సదా వేడిగా వుండేవాణ్ని. హవి పేరు కలవాణ్ని, అగ్నిని.

వాయుదేవుడు అగ్నిని స్తుతించాడు.

"పిడుగుపాటుతో చనిపోయే ముందు నీవు, రుద్రుడును, ద్యావృథ్వీ హోతలకు నిజమైన యజమానియు, సువర్ణరూపుడును, యజ్ఞరాజును అగు అగ్నిని రక్షకునిగా చేసికొనుము." (4-3-1)

"ఓ అగ్ని! పతిని కోరుతూ సుందరమైన వస్త్రముల నలంకరించుకొన్న పత్నివలె మేము నీ కొరకు ఈ స్థానమును ఏర్పాటు చేస్తున్నాం. తేజోవంతుడవై ఎదుటకు వచ్చి, ఇక్కడే కూర్చొనుము. స్వాహాకము వెనుకవైపున ఉన్నది".

సప్తసింధులోని భరతుని సంతానమైన దేవశ్రవా, దేవవాతులు అగ్నిని స్తుతిస్తున్నారు. (3-23-4)

ఓ అగ్ని! మేము అన్న స్థానము కల ఉత్తమ భూమియందు మంచి దినములకై నిన్ను స్థాపన చేస్తున్నాము. నీవు దృషద్వతీ (ఘగ్గరా) ఆపయా (మరవకుండ) సరస్వతీ తటమున ధనయుక్తుడవై ప్రజలందు ప్రకాశించుము.

కుశికులు ప్రతి యింటిలోనూ అగ్నిని సేవిస్తున్నారు. (3-29-15) మా యొక్క ప్రతి యింటిలోనూ అగ్ని ప్రతిష్ఠితమైనది. అందరు అగ్నిదేవుని భక్తులు అని సరస్వతీ ఉపత్యకలో ఉన్న ఈ ఆర్యులు గర్వపడేవారు.

ఈ విధంగా అగ్నిని పూజించడం జరిగింది. అగ్నిని పురోహితుడుగా, అగ్నినే దేవతగా, యజ్ఞఫలము నిచ్చువాడిగా అనేకవిధముల కొనియాడారు. ఆనాడు అగ్నిని మానవుడు కనుగొని వేల సంవత్సరాలైంది. మానవుడు ఆటవిక దశను దాటే స్థితిలో కనుగొన్నట్టిది. ఆర్యులు ఇంకా నిప్పును ధ్యానించే స్థితిలోనే వున్నారంటే, ఆర్యుల రాకకుముందే వున్న హరప్పా సంస్కృతికి చాలా వెనుక బడి వున్నారు. రాహుల్ సాంకృత్యాయన్ గారు ఈ విషయమై యిలా అంటున్నారు.

"ఆర్యులు రాకముందు భారతదేశంలో, వారికంటే ఎంతో ఉన్నతమైన, ప్రాచీనమైన సంస్కృతి యిక్కడ వుండేది. ఆ సంస్కృతి యొక్క అవశేషాలు మొదట్లో హరప్పా, మొహంజదారో ప్రదేశాల్లో దొరికినవి. ఇప్పుడు గంగా, యమునా తీరాల్లోనూ, సౌరాష్ట్రాది ప్రదేశాల్లోనూ దొరుకుతున్నవి. సప్తసింధు లోని ఆర్యులకు తమ పశుపాలక సంస్కృతిలోను, జీవితంలోను, అంటిపెట్టుకొని వుండాలనే గట్టిపట్టు వుండకపోతే వారు ఆ నగర సంస్కృతికి అధిపతులయ్యే వారు".

("ఋగ్వేద ఆర్యులు" 7 వ పేజీ)

పశుపాలక సంస్కృతికి సంబంధించిన ఆర్యులు, అగ్ని మొదలగు దేవతలను ఉపాసించిన తీరునుబట్టి, వారి ఆలోచన, సంస్కృతి వారు వచ్చేనాటికి భారతదేశంలో వున్న సంస్కృతి కంటే గొప్పదేమీ కాకపోగా, వారు ఉపాసించిన తీరునుబట్టి ప్రకృతిశక్తులను గూర్చి వారికి ప్రాథమిక జ్ఞానం కూడా వున్నట్లు కన్పించదు. అందుకే "వేదాలు తత్త్వశాస్త్రం కాదు, శాస్త్రం కాదు, చరిత్ర కాదు, కవిత్వమూ కాదు. వేదాలు భారత భూమిలో పుట్టినవి, అందులో సమస్త విజ్ఞానముంది" అనే మతవాదుల వ్యాఖ్యానం. అయితే పరిశీలనలో వేదాలు భారతదేశపు రచనలు కాదని, వేదాల్లోని భావాలకు గాని, వేదాలభాషకు గాని, భారతదేశానికి వెలుపల వారితోనే ఎక్కువ సంబంధాలున్నట్లు తెలుస్తుంది.

"ఋగ్వేదాన్ని నిర్ణయించేటప్పుడు ఋగ్వేద ఆర్యులకు కేవలం భారత దేశంతోనే కాదు, భారతదేశానికి వెలుపలి కూడా భాషలోను, భావాల్లోను వారికి సంబంధమున్నవారు కలరన్న సంగతి గుర్తుంచుకోవాలి." భారత దేశానికి వెలుపలున్న వారిలో అందరికంటే వారికి దగ్గరివారు ఇరానీయులు. అదృష్టవశాత్తు వారి మతాచారాలను తెలుసుకొనుటకు "అవెస్తా" ఉంది. పార్శీ మతస్థులు ఇప్పటికీ ఉన్నారు. వేదాన్ని, అవెస్తాను పోల్చుకొని అధ్యయనం చేస్తే, భాష లోను, మతంలోను, ఆర్యులు, పారశీకులు, ఒకరికొకరు చాలా దగ్గర అని

తోస్తుంది. పారశీకుల తర్వాత 'స్లావుల' తో ఆర్యులకు దగ్గరి సంబంధముంది. 'స్లావు' శబ్దం 'శ్లావు' (శకులు, లావులు) శబ్దం యొక్క అపభ్రంశ రూపం. రష్యనులు, ఉక్రేనియన్లు, బైలో రష్యన్‌లు, బల్గారులు, యుగోస్లోవులు, చెకోస్లోవ్రులు, పోలులు- అందరూ స్లావు జాతివారే.

"పారశీకులు, శకులు తర్వాత భారతీయ ఆర్యులకు విధువానియనులతో దగ్గర సంబంధం కలదు. ఈ రెండు భాషలు సొంతచెల్లెళ్ళు".

"తర్వాత పశ్చిమ ఐరోపాలోని ప్రాచీన గ్రీకు, లాటిను భాషలకు, నేటి జర్మను, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలైన భాషలకూ వైదిక భాషలతో సంబంధముంది." (ఋగ్వేద ఆర్యులు- రాహుల్ సాంకృత్యాయన్)

భారతీయ భాషా కుటుంబాలపై సంస్కృత ప్రభావం వుందేకాని జన్యజనవ భావం లేనేలేదు. ఋగ్వేద రచయితలు భారతీయులు కాకపోవడమే కాక భారతీయ సింధూ సంస్కృతిని వీరే ధ్వంసం చేసినట్లుగా చరిత్రకారులందరూ వివరిస్తున్నారు. ఈ విషయమై దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ్ వివరణ ఇలా ఉంది—

"ఋగ్వేదాన్ని సంకలనం చేసినవారు, భారతదేశంలో ప్రవేశించి సింధులోయ నాగరికతా చిహ్నాలైన ఆయా పట్టణాలను ధ్వంసంచేసినారనే విషయాన్ని పురాతన వస్తుతత్త్వ శాస్త్రజ్ఞులు బాగా విశ్వసిస్తున్నారు. అనేకమైన యుద్ధాల్లో ఆరితేరిన యుద్ధవీరుడగు ఇంద్రుని అతిశయోక్తులతో 'త్రిపురాంతకు'డని పొగడిన పొగడ్తలు ఋగ్వేదంలో అనేకం కనిపిస్తాయి. ఈ సింధులోయలోనే ఆటవిక జాతివారు నాశనం చేసిన పట్టణాల శిధిలాలు కూడా లభిస్తున్నాయి." (భారతీయ తత్త్వశాస్త్రం, సులభ పరిచయం- పేజీ 55) దీనినిబట్టి వేదాలు భారతీయ సంస్కృతీ విధ్వంసకుల గ్రంథాలే కాని భారతీయ సంస్కృతీ రక్షకుల రచనలు కావనేది తేలుతుంది.

ఈ విధంగా మనం వేదాలను పరిశీలించినట్లయితే ముఖ్యంగా వేదవాఙ్మయానికి మూలమైన ఋగ్వేదాన్ని పరిశీలించినట్లయితే భాషలో కాని, భావంలో కాని భారతీయం కాకపోగా భారతీయ నగర సంస్కృతిని ధ్వంసం చేసిన ఆటవికుల ఆలోచనలే వేదాలని అర్థమవుతోంది. ఈ వేదాలు భారతదేశానికి తలమానికాలని, ఈ వేదాల్లో సైన్సు వుందని, మన సంస్కృతి అంతా దాగివుందని ఈనాటికి ప్రచారం చేస్తున్నవారు జాతీయవాద ముసుగులో అబద్ధాన్ని ప్రచారం చేస్తున్నారని

ఈ పరిశీలన వలన తేలుతుంది. ఈ ఆలోచనలకు పునాదులు చార్వాకులు నిర్మించారు. కాబట్టి ఈనాడు భౌతికవాదం విజయభేరి మ్రోగిస్తుంది.

## చార్వాకుల ప్రాచీనత :

వేద సంస్కృతిని నిరసించి భౌతిక సంస్కృతిని ప్రతిష్ఠాపించిన చార్వాకుల సిద్ధాంత ప్రాచీనతను గూర్చి, ఔన్నత్యాన్ని గూర్చి లిక్రపిలిన్ జన గతి తార్కిక భౌతికవాదం అంటే ఏమిటి? అనే గ్రంథంలో ఈ విధంగా వివరించారు.

ప్రపంచం పట్ల భౌతికవాద దృక్పథం వేళ్లు ప్రాచీనకాలంలోనే వున్నాయి. క్రీస్తు శకానికి ముందు మూడు సహస్రాబ్దం చివరిలోనూ, రెండవ సహస్రాబ్దం ప్రారంభంలోనూ, ఈజిప్టులోనూ బాబిలోనియాలోనూ భౌతికవాద దృక్పథం రూపు తీసుకుంది. బానిస యజమానుల ప్రపంచ దృక్పథానికి వ్యతిరేకంగా ప్రగతిశీల మేధావులు కొట్టిన తొలిదెబ్బలు- చావు తర్వాత జీవితం వున్నది అన్న మత మౌఢ్యానికి వ్యతిరేకంగానూ, ఆనాటి సామాజిక వ్యవస్థలోని అన్యాయానికి వ్యతిరేకంగానూ ఉద్దేశించబడినవి. ప్రకృతి విషయాలకు సంబంధించిన భౌతికవాద మూలాలను కొంతమంది చింతకులు వూహించడం ప్రారంభించారని ప్రాచీన ఈజిప్టు సంస్కృతికి సంబంధించిన కట్టడాలు స్పష్టం చేస్తున్నాయి. జీవకోటికి, మరికొన్నింటికి మూలం చల్లనినీరు అని కొంతమంది అన్నారు. మరికొంతమందేమో రోదసీలోనూ ఇతరచోట్లా గాలి నిండివుందని అన్నారు.

ప్రాచీన ఈజిప్టులోనూ, బాబిలోనియాలోనూ అప్పుడప్పుడే రూపు తీసుకుంటున్న తొలినాటి అయత్నకృత భౌతికవాద అభిప్రాయాలతోనూ, నాస్తిక భావాలతోనూ పోల్చితే మతపరమైన భావవాద దృక్పథాలే ప్రాబల్య స్థితిలో వున్న మాట వాస్తవమే అయినప్పటికీ ఉత్తరోత్తరా అభివృద్ధి చెందిన విజ్ఞాన శాస్త్రంపైనా, భౌతికవాద భావాలపైనా తొలినాటి భౌతికవాద భావాలు, నాస్తిక భావాలు ఫలప్రదమైన ప్రభావాన్ని కలిగించాయనడం నిస్సందేహం; అట్టి ప్రభావం చాలా ముఖ్యమైందనడమూ నిస్సందేహమే ప్రాచీన భారతదేశంలోనూ, చైనాలోనూ, తత్వశాస్త్రంలో భౌతికవాద ధోరణులు, భావవాద ధోరణులు మరింత సమగ్ర రూపం తీసుకున్నాయి.

ప్రాచీన భారతదేశంలో తత్వశాస్త్రం క్రీస్తు శకానికి ముందు ప్రథమ సహస్రాబ్దం మధ్యలో ఆవిర్భవించింది. వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ ప్రతిబింబించినట్టి మతపరమైన భావాలు- పౌరాణిక భావాలు ఆ దశలో ప్రాబల్య స్థితిలో

పున్న విషయం వాస్తవమే అయినప్పటికీ, ఆనాడే తాత్త్విక చైతన్యం యొక్క తొలి లక్షణాలు ఆవిర్భవించటం ప్రారంభమైంది. తొలినాటి తాత్త్విక సిద్ధాంతాలు భౌతిక, భావవాద సిద్ధాంతాలు రెండు రూపు తీసుకుంటూ ఉండినాయి.

భారతదేశంలోని అత్యంత ప్రాచీన భౌతికవాద తాత్త్విక ధోరణి లోకాయత (లేక చార్వాకుల భావ వ్యవస్థ) దీని వ్యవస్థాపకులు బృహస్పతి. ప్రపంచం భౌతికమయమైందనీ ఇందులో అగ్ని, జలం, వాయువు, భూమి అనే నాలుగు ప్రధాన భౌతిక పదార్థాలున్నాయని చార్వాకులు విశ్వసించారు. మానవులతో సహా సర్వప్రాణికోటిలోనూ ఈ నాలుగు పదార్థాలు వున్నాయనీ వారు విశ్వసించారు. మరణించిన తర్వాత జీవులు ఈ పదార్థాల్లోకి చివికిపోతాయని నమ్మారు. దేవుడు, మరణం లేని ఆత్మ, ఆముష్మిక ప్రపంచం వగైరా మతపరమైన భావాలను చార్వాకులు విమర్శించారు. శరీరం మరణించగానే చైతన్యం అదృశ్యమై పోతుం దని నిరూపించడానికి ప్రయత్నించారు. అందుచేతనే వారు పునర్జన్మ సిద్ధాంతాన్ని కూడా తిరస్కరించారు.

## అనాగరికమైన అశ్వమేధం పురోహితుల సృష్టి:

శ్లో॥ అశ్వస్యాత్రహి శిశ్నంతు
పత్నీ గ్రాహ్యం ప్రకీర్తితం
ఖండైః తద్వత్ పరంచైవ
గ్రాహ్యజాతం ప్రకీర్తితం
మాంసానాం ఖాదనంతద్వత్
నిశాచర సమీరితం॥

గుర్రం యొక్క మర్మావయమును స్త్రీ పట్టుకోవాలని చెప్పారు. ఇంకా చేయవలసిన పనులు కూడా చెప్పారు. ఇట్లే మాంసం తినవలయునని చెప్పారు. అందుకే ఇదంతా (ఈ వైదిక సంస్కృతి అంతా) రాత్రించరులచే (పురోహితులచే) కూర్చబడినవి.

అశ్వమేధ యాగాన్ని రామాయణంలో కౌసల్య ఆచరించిన విధానం ఇలా వ్రాయబడింది.

శ్లో॥ పశూనాం త్రిశతం తత్ర యూపేషు నియతం తథా,
అశ్వరత్నో త్తమంతస్య రాజ్ఞో దశరథస్యచ;

కౌసల్యా తం హయం తత్ర పరిచర్య సమంతతః,
కృపాణై ర్విశసాసైనం త్రిభిః పరమ యాముదా;
పతిత్రిణా తథాసార్థ సుస్థితేనచ చేతసా,
అవసద్రజనీ మేకాః కౌసల్యా పుత్రకామ్యయాః
హోతాఽ ధ్వర్యు స్తదోద్గాతా హయేన సమయోజయన్,
మహిష్యా పరివృత్త్యాచ వాతాతాంచ తథాపరామ్

పై శ్లోకాల తాత్పర్యం:

మూడువందల బలిపశువుల్ని, మూడు వందల పథ్య స్తంభాలను, రాజైన దశరథునికి బదులుగా మంచి గుర్రాన్ని బంధించాడు. ఆ గుర్రంతో పవళింపు నిమిత్తం చేత కత్తి ధరించి దాన్ని మూడు దెబ్బలతో కౌసల్య నరికింది. ఆ రాత్రి యావత్తు తన భర్తతో సమానుడైన ఆ గుర్రంతో క్రీడించింది. హోత, అధ్వర్యు ఉద్గాతలు అను వైదిక పురోహితులు కౌసల్యాదేవికి సహాయం చేశారు.

ఆర్య రాజుల్లో పెక్కుమంది ఈ అశ్వమేధ యాగాన్ని ఆచరించారు. సముద్రగుప్తుడు, రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని కుమారుడైన కుమార గుప్తుడు ఈ యాగాన్ని చేసినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. 'పుష్యమిత్రుడు' ఈ యాగాన్ని చేసినట్లు 'మాళవికాగ్నిమిత్రం'లో వర్ణింపబడింది. సాంఖ్యాయన శ్రౌత సూత్రంలో "జనమేజయ పారిక్షితుడు, ఉగ్రసేన పారిక్షితుడు, భీమసేన పారిక్షితుడు, శ్రుతసేన పారిక్షితుడు, ఋషప యజ్ఞాతురుడు, వైదేహాల హారుడు, మరుత్తా ఏక్షితుడు" ఈ యాగం చేసినట్లుగా చెప్పబడింది. పద్మ పురాణంలో "మనువు, సగరుడు, మరుత్తుడు, యయాతి" ఈ యాగాన్ని ఆచరించినట్లు పేర్కొనబడింది. అగ్నిపురాణంలో "పృథుడు, దిలీపుడు, భరతుడు, మల్లుడు, కకుత్సుడు, యువనాశ్వుడు, జయద్రథుడు, మాంధాతుడు, ముచికుందుడు, పురూరవుడు" ఈ యాగాన్ని ఆచరించినట్లు చెప్పబడింది. ఐతరేయ బ్రాహ్మణంలో "దుష్యంతుని కొడుకు భరతుడు, మనుపుత్రుడు చార్యాతుడు, సాత్రాజితుడగు శతానీకుడు, అంబష్ఠ్యుడు, ఉగ్రసేనుని పుత్రుడగు యుధాశ్రేష్ఠి, భువను పుత్రుడు అగు విశ్వకర్ముడు, పిజవనుని పుత్రుడైన సుదాసుడు, అవిక్షితుని కుమారుడైన మరుత్తుడు" ఈ యాగాన్ని ఆచరించినట్లు చెప్పబడింది. లింగ పురాణం "శశిబిందుడు, వుళనుడు" ఈ యాగమును చేసినట్లు పేర్కొనగా, రామాయణం "ఇంద్రుడు, కుబేరుడు, యముడు, వరుణుడు, శ్రీరాముడు" ఈ యాగాన్ని ఆచరించినట్లు చెప్పబడింది.

ఆర్యరాజులందరూ ఈ జుగుప్సాకరమైన యాగాన్ని ఆచరించినట్లు వైదిక వాఙ్మయంలో అనేక ఋజువులున్నాయి.

అశ్వమేధయాగాన్ని * చార్వాకుల కాలం నాటికే ఆచరిస్తున్నారు. అశ్వమేధంలో ఉన్న నాగరికతని చార్వాకులానాడే తిరస్కరించారు. అనార్యజాతులని తుదముట్టిస్తూ తమ సామ్రాజ్యాధిపత్యం కోసం నిర్వహించే యజ్ఞయాగాల్లో అశ్వమేధం జుగుప్సాకరమైనది, అనాగరికమైనది. అశ్వం యొక్క శిశ్నమును రాణి ధరించడం అనే ఈ అనాగరిక చర్యను చార్వాకులు నాగరిక సమాజానికి ప్రతినిధులుగా నిలబడి ఆనాడే తీవ్రంగా ఖండించారు. ఈ అమానుష కర్మకాండను కూర్చిన ఆర్య పురోహిత వర్గాన్ని వారు శాస్త్రీయంగా నిలదీశారు. ఈ జుగుప్సాకరమైన కర్మకాండలను చార్వాకులు ఇంత శాస్త్రీయంగా పరిశీలించబట్టే ఆ తరువాత వచ్చిన వైదికసూత్రాలు, కారికలు, భాష్యాలు, టీకాలు, ఖండనలు చార్వాకాన్ని ఖండించడానికి, చార్వాకుల మీద బురదజల్లడానికి తీవ్రంగా ప్రయత్నించారు. వైదిక సాహిత్యం మొత్తంలో చార్వాకుల్ని ఎండగట్టడానికి ప్రయత్నించి, దాని శాస్త్రీయమైన నిశితవాదానికి ఓడిపోయారు. అయితే ఈనాటికీ వైదిక వారసులు- చార్వాక వారసులపై దాడులు చేస్తూనే ఉన్నారు. ఆర్యుల రాజ్యకర్త, ధర్మరాజు సింహాసనం ఎక్కడంతోటే చార్వాకుల్ని ఉరితీయడం దీనికి నిదర్శనం. అతి ప్రసిద్ధమైన పూర్వగాథాలహరిలో చార్వాకుల్ని గురించి చెప్పిన భారత కథనాన్ని ఇలా పేర్కొన్నారు.

"చార్వాకుడు ఒక రాక్షసుడు. బ్రహ్మను గూర్చి తపస్సుచేసి దేనివలనను చావు లేకుండునట్లు వరము కోరెను. బ్రహ్మ సరేయనెను గాని భూసురులకు కోపము తెప్పింతువేని దానివలనం జావగుదనని చెప్పెను. వీడు దుర్యోధనునకు స్నేహితుడయ్యెను".

యుద్ధము చేసిన పిదప రాజ్యముచేయు నొల్లనని యుండిన ధర్మరాజునకు మునులు, కృష్ణుడు ఎన్నియో బోధలు చేయగా నాతడు వల్లెయని పురమునకు వచ్చెను. విప్రజనులాదిగ వీని యెదురేగిరి. చార్వాకుడు దుర్యోధనునిచే పంపబడి బ్రాహ్మణ సన్యాసి వేషమున బ్రాహ్మణుల వద్ద నిలుచుండునట్లు బ్రాహ్మణ జనులిట్లు వచించుచున్నను; బంధువులను, మిత్రులను, గురుని జంపిన ఇతడే పాటి రాజు ? వీనిని గొలువ నొల్లయు అని అతడట్లు వచింప వచ్చుటనున్న బ్రాహ్మ

* "కులం పునాదులు", "దళితుల చరిత్ర"లలో వివరణ ఇవ్వబడింది.

ణులు తెల్లవోయి మేమెఱుగము. అట్లనలేదు- నీవు ధర్మము చేసితివని యాశ్వాసించి, వాడు రాక్షసుడగుట తెలిసికొని దుర్యోధనుని పంపున వచ్చెనని యెఱింగి కోపముతో చూచిరి. వీరి తేజస్సుతో వాడు చచ్చెను. *

భారతంలో చార్వాకుణ్ణి చంపిన ఘట్టం ఇలా ఉంది. (సంస్కృత భారతం, శాంతిపర్వం- 38, 39 అధ్యాయములు)

.... .... .... ....

నిశ్శబ్దే చస్థితే తత్ర తతో విప్రజనేతనః
రాజానాం బ్రాహ్మణచ్ఛద్మా చార్వాకోరాక్షసోఽబ్రవీత్॥
తత్ర దుర్యోధనసఖా భిక్షురూపేణ సంవృతః
సాక్షఃశిఖీ త్రిదండిచ ధృష్టో విగత సాధ్వసః॥
వృతః సర్వై స్తథా విప్రై రాశీర్వాద వివక్షు భిః
పరః సహస్రై రాజేంద్ర తపోనియమ సంవృతైః॥
సదుష్టః పాపమాశంసుః పాండవానామ్ మహాత్మనామ్
అనామంత్ర్యైవ తాన్ విప్రాం స్త మువాచ మహీపతిమ్॥

## చార్వాక ఉవాచ

ఇమే ప్రాహుర్ద్విజాః సర్వేసమారోప్య వచోమయి
ధిగ్ భవన్తం కునృపతి జ్ఞాతి ఘాతి నమస్తుతే॥
కింతేన స్యాద్ధి కౌంతేయ కృత్వేయం జాతి సంక్షయమ్
ఘాతయిత్వా గురూంశ్చైవమృతం శ్రేయోన జీవితమ్॥
ఇతితే వై ద్విజాః శ్రుత్వాతస్య దుష్టస్యరక్షసః
వివ్యథుశ్చుక్రుశుశ్చైవతస్య వాక్య ప్రధర్షితాః॥
తతస్తే బ్రాహ్మణాః సర్వేసచరాజా యుధిష్ఠిరః
వ్రీడితాః పరమోద్విగ్నాస్తూష్ణీమాసన్ విశాంపతే॥

## యుధిష్ఠిర ఉవాచ

ప్రసీదంతు భవన్తో మే ప్రణతస్యాభి యాచతః
ప్రత్యాసన్న వ్యసనినం నమాం ధిక్కర్తు మర్హథ॥

---

* పూర్వగాథాలహరి, పేజి- 156, కృతికర్త శ్రీ వేమూరి శ్రీనివాసరావు, వెంకట్రామ అండ్ కో, 1975.

## వైశంపాయన ఉవాచ

తతోరాజన్ బ్రాహ్మణాస్తే సర్వఏవ విశాంపతే
ఊచుర్రైన్నే తథ్ వచోఽస్మాకం శ్రీరస్తు తవపార్థివ॥
జజ్ఞుశ్చైవ మహాత్మావస్త తస్తం జ్ఞాన చక్షుషా
బ్రాహ్మణావేద విద్యాంస స్తపోభిర్వి మలీకృతా॥

## బ్రాహ్మణా ఊచుః

ఏష దుర్యోధనా సఖా చార్వాకో నామ రాక్షసః
పరివ్రాజక రూపేణ హితం తస్య చికీర్షితి॥
వయం బ్రూమేవ ధర్మాత్మన్ వ్యేతుతే భయమీదృశమ్
ఉపతిష్ఠతు కళ్యాణం భవన్తం భ్రాతృ భిస్సహ॥

## వైశంపాయన ఉవాచ

తత స్తే బ్రాహ్మణాః సర్వేహుంకారైః క్రోధమూర్ఛితాః
నిర్భర్త్సయంతః శుచయోని జఘ్నుః పాపరాక్షసమ్॥
సపపాత వినిర్దగ్ధస్తే జసా బ్రాహ్మవాదినామ్
మహేంద్రాశని నిర్ధగ్ధః పాదపోలన కురువానివ॥
పూజతాశ్చయ యుర్విప్రారాజా నభినంద్య తమ్
రాజాచహర్షమా పేదే పాండవః ససుహృజ్జనః॥

39 వ అధ్యాయం

## వైశంపాయన ఉవాచ

తతస్తు తత్రతు రాజానం తిష్ఠన్తం భ్రాతృభిః సవా
ఉవాచ దేవకీ పుత్రః సర్వదర్శీ జనార్ధనః॥

## వాసుదేవ ఉవాచ

బ్రాహ్మణాస్తాత లోకేఽస్మిన్ అర్చనీయాః సదామమ
ఏతే భూమి చరాదేవా వాగ్విషాః సుప్రసాదకాః॥
పురాకృతయుగే రాజం శ్చార్వాకో నామ రాక్షసః
తప స్తే పే మహా బాహో బదర్యాం బహు వార్షికమ్॥

పరేణ చ్ఛంద్యమానశ్చ బ్రహ్మణాచ పునః పునః
అభయం సర్వభూతేభ్యో దదౌతస్మై జగత్పతిః ॥
సతులబ్ధవరః పాపోదేవానా మమిత విక్రమః
రాక్షస్తాప యామాస తీవ్రకర్మా మహాబలః ॥
తతోదేవాః సమేతాశ్చ బ్రహ్మాణమిద మబ్రువన్
వధాయ రక్షస స్తస్య బలవిప్రకృతా స్తదా ॥
తాను వాచతతో దేవో విహిత స్తత్రవై మయా
యథాస్యభవితా మృత్యు రచిరేణేతి భారత
రాజా దుర్యోధనోనామ సఖాస్య భవితా నృప
తస్యస్నేహావబద్ధోఽసౌ బ్రాహ్మణాన వమంస్యతే॥
తత్రైనం రుషితా విప్రా విప్రాకార ప్రధర్షితాః
ధక్ష్య న్తి వాగ్బలాః పాపం తతోనాశం గమిష్యతి॥
సఏశానితః శేతే బ్రహ్మదండేన రాక్షసః
చార్వాకో నృపతిశ్రేష్ఠ మాశుచో భరతర్ష భ॥
హతా స్తే క్షత్రధర్మేణ జ్ఞాతయ స్తవ పార్థివ
స్వర్గతాశ్చ మహాత్మానో వీరాః క్షత్రియ పుంగవాః
సత్వమాతష కార్యాణి మాతేఽభూద్గ్లా నిరచ్యుత
శత్రూన్ జహి ప్రజారక్ష ద్విజాంశ్చ పరిపూజయ॥
(తెలుగు భారతం, శాంతిపర్వం, ప్రథమాశ్వాసం 60-70 వ)

.............. అట్టియెడ దుర్యోధన సఖుండైన చార్వాకుండును నొక్క రక్కసుండు విప్రాకారంబు గైకొని త్రిదండి వేషంబలవడనయ్యవసి దేవతా కోటిలో నిల్చియున్న రాధమున కిట్లనియె.

36

చం॥ వినుము నరేంద్ర సర్వమగు విప్రజనంబును గూడి నన్నుఁ బం
పిన విధమీతఁ డేటి పతి, సేసిన పాపము పెద్ద చంపుచో
జనకుడు భ్రాతపుత్త్రుడను శంకయొకింతుకలేదు నద్గురుం
డని యెడికొంకు బుద్ధిని సుమంతయుఁ బుట్టదుపీనిఁ గాల్చనే.

వ॥ అనుమనిరని పలికి వెండియు.

ఆ॥ ఇట్లు శిష్టజనము లేవగింపఁగఁజేయు
రాజ్యమేల బంధురాజినెల్లఁ
బొలియఁజేసి యెట్టి భోగంబు లనుభవిం
చెదవు కల్మషంబు చిక్కెనీకు.

వ॥ అనినవిని యవ్విప్రులత్యంత వ్యథితాంతఃకరణులగుచు నొండొరుల మొగంబులు సూచి యిట్లు వుట్టంబని యేమి యను వచనంబులతోఁ దిరుగుడు పడిరి. ధర్మనందనుడు లజ్జా వనతవదనుండై యూరకుండి వారలవలను గనుంగొని కేలు మొగిచి ఫాలభాగంబునఁ గదియించి యిట్లనియె.

తే॥ మ్రొక్కి వేఁడెదనను మీరు ధిక్కరింప
కానరింపుడు మునిసమూహమ్ముమతుఁడ
నై వినిశ్చయ పరికలితాంతరంగ
వర్తనముతోడ నిచటికి వచ్చినాఁడ.

వ॥ అనవుడు భయసంభ్రమ భరితములగుచు నాభూసురులు దేవా యీ వాక్యంబులు మావలనం బుట్టినవి గావిది యేమియోగాని నీవుత్తమ క్షత్రి ధర్మంబున సముపార్జించిన యుజ్జ్వలశ్రీ సుస్థిరతం బొందెదుమని యతనికి నాశ్వాసంబొనర్చి యమ్మాయాభిక్షుపు నాలోకించి పరమ బోధంబున నప్పురుషాధము నెఱింగి యమ్మహిపతితో వీఁడు దుర్యోధన సఖుండగు రాక్షసుండు. సన్యాసి వేషంబున నేతెంచి యాతనికి హితంబాచరించువాడై యీ దుర్వచనంబులాడె నీ కుక్క నెఱింగిన యంతన పాల మున్నీరుం బోని నీకుం గలంగ నేల ధర్మాత్ములగు తమ్ములు వనుష సేయం బూజ్యంబగు సామ్రాజ్యంబు వహింపుమని యాదరించి.

కం॥ ఆ రాక్షసుఁ గనుఁగొని కో
పారంజిత నేత్రులగుచు నవ్విప్రులు హూం
కార ముఖరులగుటయు నతి
ఘోరాకృతితోడ వాఁడు గూలెంబడమిన్.

తే॥ బ్రహ్మతేజో నిహతినిట్లుపడి మహాశ
నిప్రహతి పాతితోర్వీజ నిభతనొంది
యున్న యద్దానవునిఁ జూచి యన్నరేంద్రుఁ
డెలిమి సొంపువహించెఁ దమ్ములును దాను.

వ॥ ఇట్లు ప్రీతుండై యజాతశత్రుం డవ్విప్రసమూహంబునకు సవిశేషార్చనం బొనర్చి వీడుకొలిపె నప్పు డచ్యుతుండు బ్రాహ్మణస్తుతి సేసి యజ్ఞపతితో నిట్లనుఁ గృతయుగంబునం జార్వాకుండను దైత్యుండు తపం బొనరించి పద్మభవుండు ప్రత్యక్షంబైన నిఖిల భూతంబుల వలనను నభయంబు వేఁడిన నద్దేవుండు భూదేవతల కనిష్టంబులైన పనులు సేయకుండు వాఁడవు చేసితేని యవియ నీకుఁ దుదియని పలికి యవ్వరం బొసంగె నట్లు లబ్ధవరుండై వాఁడు గర్వించి గీర్వాణుల బాధింపం దొడంగిన వారు విరించిం గాంచి యా రక్కసుండు సేయు బాధలు చెప్పిన నమ్మహాత్ముండు దేను మున్న యెఱింగి యొనర్చినవాఁడ దుర్యోధనుండును రాజునకు నెచ్చెలియై యచ్చపలుండు తత్కార్యం బాచరింప వొచ్చి మహీసురులకు మనోవ్యథాకరంబగు కర్మంబు సేయునప్పుని కారణంబుగా వారల కోపంబునం గూలంగలవాఁడని పలికె నద్దానవుండు నేఁడిట వచ్చి తన దుర్వినయంబున బ్రహ్మదండ నిహతుండై పడియున్నవాఁడని చెప్పి యప్పీనుంగు వెడలపైపించి యాభూపాలు నుద్దేశించి వెండియు.

ఆ॥ మాఱుకొన్నవారి నీఱుసేయుము ప్రజ
నరసిమనుపు ధరిణీ సురులఁ బ్రోపు
మఖిల బంధుజనుల నాశ్రితులను సుఖ
వృత్తి మనపు పెంపు వెలయ నధిప. *

ఈ విధంగా ఆర్యరాజులు చార్వాకులను తమ ప్రథమశత్రువులుగా భావించి పురోహితవర్గాన్ని తృప్తిపరచటం కోసం వీరిని వధించారు, హింసించారు, బాధించారు, నిందించారు, అపహాస్యం చేశారు, అవహేళన గావించారు. వారి ఆధ్యాత్మిక వాదంతో, మాయావాదంతో మహోజ్జ్వలమైన వీరి తాత్త్విక దృక్పథం మీద బూడిదజల్లారు. వీరి హేతుదృక్పథాన్ని, మానవతావాదాన్ని వారి కుతర్కంతో వారి అసమ్మతసిద్ధాంతాలతో ఖండించ ప్రయత్నించి ఆ సిద్ధాంతాలలోని భౌతికతత్త్వం మీద భావవాదజాలాన్ని కుమ్మరించడానికి ప్రయత్నించారు. భౌతికవాదం ఎక్కడ జనిస్తే అక్కడ వీరు అగ్నిని జ్వలింపచేశారు. దీనంతటికీ కారణం కేవలం తాత్త్వికమైన వైరుధ్యమే కాదు, జాతి వైరుధ్యం కూడా. వైదిక భావవాదులు ఆర్యులు. లోకాయతులు అనార్యులు. భారతదేశపు గడ్డమీద పుట్టిన లోకాయతుల్ని

* చార్వాకుడు (నాటకం) రచయిత శ్రీ బి. రామకృష్ణ, పీఠికభాగం పేజీ 83 నుండి 89 వరకు.

వలన పాలకులైన ఆర్యులు కర్కశంగా తునుమాడటంతో పాటు, వారి భౌతిక వాదాన్ని కూడా బుగ్గి చేయడానికి ప్రయత్నించారు.

ఒక జాతిని ఆధీనం చేసుకోవాలనుకున్నప్పుడు, వారి శక్తిని నిర్వీర్యం చేయాలనుకున్నప్పుడు వారిలో అంతఃశక్తిగా వుండి వారిని నడిపిస్తున్న తాత్త్విక భూమికను భగ్నం చేయడం ఒక పథకంగా వారు పెట్టుకున్నారు. అందుకే భౌతిక దృక్పథాన్ని ముందుకు తీసుకువెళ్ళడానికి ప్రయత్నించిన చార్వాకుల్ని, బృహస్పతిని, వేనరాజుని అందర్నీ వధించారు.

వేనరాజు కథ పద్మపురాణంలోనూ, భాగవతంలోనూ వివరించబడింది. పద్మపురాణంలో వేనుణ్ణి మొదటినుంచీ ఉదాత్తుడిగా చిత్రీకరించారు. భాగవతంలో వేనుణ్ణి మొదటినుంచీ దుష్టుడిగా చిత్రీకరించారు. అంగుడు పద్మఖండానికి రాజు. బ్రహ్మ మనుమడైన అంగుడు అత్రి ప్రజాపతి కొడుకు. విష్ణు తపస్సుచేసి సుపుత్రుడు కలిగే వరాన్ని పొందాడు.

అంగుడి భార్య సునీథాదేవి యమధర్మరాజు కుమార్తె. ఆమె వివాహానికి పూర్వం అడవికిపోయి సుశంఖుడు అనే మునిని వేధించింది. సుశంఖుడు ఆమెను "దుష్టపుత్రుడు కలుగుగాక" అని శపించాడు. అత్రి ప్రజాపతి పుత్రుడైన అంగుడికీ, యమధర్మరాజు పుత్రికయైన సునీథాదేవికి వివాహం జరిగింది. వారికి వేనుడు జన్మించాడు. వేనుడు చిన్నప్పటి నుండే దుష్టుడుగా పెరిగాడని భాగవతం ఇలా వర్ణిస్తోంది.

చ॥ కమలదళాక్షి పాయసము కౌతుకమొప్ప భుజించి భర్తృ సం
గమునఁ జేసి తత్క్షణము గర్భము దాల్చి కుమారుఁ గాంచె న
క్కొమరుఁడు నంత మాతృజనకుండగు మృత్యువు బోలితా నధ
ర్మమునఁ జరింపుచుండె గుణమండన వేనుఁడనంగ నిచ్చటన్. 402

చ॥ ఎనయఁగ బాల్యమందుఁ దన యీడు కుమారులెఁ గ్రీడవోలె నె
మ్మనమున భీతిలేక కృపమాని పశుప్రకరంబు నొంచు వో
ల్కిన నరికట్టి చంపుచును గిల్బిష లుబ్ధక వృత్తియై శరా
సన శరముల్ ధరించి మృగజాతి నసాధుగతిన్ వధింపుచున్. 403

వ॥ ఇట్లు పాపవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుండు వివిధ శాసనంబుల దండించియు నతని దుశ్చేష్టితంబులు మానుపం జాలక దుఃఖితాత్ముండై మనంబున. 404

క॥ అనయము నిట్టి కుపుత్రునిఁ, గని పరితాపమున బొందుకంటెను ధరలో
ననపత్యుండగు టొప్పును, వనజాక్షు భజించునట్టివాఁడగు వాఁడున్. 405

వ॥ అని పెండియు నిట్లనియె. 406

సీ॥ జనులకు దుష్టత్రీకుని చేత నపకీర్తియు నధర్మమును సర్వజన విరోధ
మును మనోవ్యథయును మునుకొని ప్రాపించునట్టి కుపుత్రు మోహంబు
విడువఁ

జాలక బహుమాన సంగతిఁ గనునెవ్వఁడతని గేహంబు దుఃఖాలయంబు
నగునని మఱియు నిట్లను మనుజుడు శోకస్థానమగు పుత్రుకతనఁ జేసి

తే॥ యనుపమ క్లేశ భాజనం బైన గృహము
విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ
డగు కుపుత్రు సుపుత్రుఁగా నాత్మఁదలఁతు
ననుచు నా రాజు బహు దుఃఖితాత్ముఁడగుచు. 407

క॥ తగు మహదైశ్వర్యోదయ, మగుగృహమును బ్రజల నిద్రనందిన భార్యన్
దిగవిడచి యెక్కడేనియు, జగతీశుఁడుచనె నిశీథ సమయమునందున్. 408

వ॥ అంతఁ దద్వృత్తాంతం బంతయు సుహృద్బాంధవ పురోహి
తామాత్య ప్రభృతులైన ప్రజలెఱింగి దుఃఖింపుచున్న తదనంతరంబ. *
409

చిన్నప్పటినుండే ఈ విధంగా దుష్టుడుగా పెరిగిన వేనుడు రాజ్య పట్టాభి
షేకం పొందాడు. అతడు రాజుగా భూ, గగన మార్గాల్లో రథం మీద చరిస్తూ
'సత్పురుష దూషిత వర్తనుడై' 'నిరంతర సుజనాపరాధ కృతితత్పర మానసుడై'
చరించెనని సంస్కృత భాగవతాన్ననుసరించి పోతన వర్ణించాడు. ఆ తరువా
వేనుడు "మానవులందరూ సమానులు. బ్రాహ్మణుడు అధికుడు కాదు" అ
ప్రకటించాడు. దీనికి బ్రాహ్మణులందరూ మమేకమై చతుర్వర్ణాలను కాపాడుతు
రాజ్యం పరిపాలించమని బ్రాహ్మణులని, విష్ణువుని ద్వేషించవద్దని వేనుడి
చెప్పారు. దానికి దేవుడు, బ్రాహ్మణుడు అనేవాడు లేడు. నాకు నేనే అధికు
అని వేనుడు ప్రకటించగా బ్రాహ్మణులు, వారి మద్దతుదారులు కూడి—

* శ్రీ మహాభాగవతం- బమ్మెర పోతనామాత్యుడు, చతుర్థ స్కంధం (402-409)
(మొదటి సంపుటము) పేజీ- 376, 377. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ
ప్రచురణ, 1977.

"(దుర్వృత్తుండగు) వీఁడు మహారాజ సింహాసనంబున కర్హుండుఁ గాఁడు. ఇతండు నే సర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టి విభూతియుక్తుం డయ్యెనట్టి యజ్ఞపతి యైన శ్రీ విష్ణుని నిందింపుచున్నవాఁడు గావున నిర్లజ్జుండైన హరిదూషకుని హన నంబు సేయవలయు. అని మును లుద్యోగించి, యాత్మ ప్రకాశితంబైన క్రోధంబు నం జేసి హుంకార మాత్రంబున నా యీశ్వర నిందాహతుండగు వేనునిం బొలియఁ జేసిరంత" * 429

ఈ విధంగా వేనుణ్ణి తునుమాడినట్లు భాగవతం పేర్కొంటుంది. బ్రాహ్మణాధిక్యతను, ఆర్యదేవతలను ఎదిరించిన వారిని నిర్దాక్షిణ్యంగా తును మాడారనడానికి వేనుని కథ మనకి ప్రబల సాక్ష్యం.

చార్వాక దర్శనం, చార్వాకుల చరిత్ర భారతదేశంలో ఈనాడు కొనసాగు తున్న తాత్త్విక, రాజకీయోద్యమానికి జీవం. భారతీయ సామాజిక వాస్తవికతను శాస్త్రీయంగా అధ్యయనం చేయాలంటే భారతీయ తాత్త్విక, రాజకీయోద్యమాన్ని సమర్థవంతంగా ముందుకు తీసుకువెళ్ళాలంటే చార్వాకుల తాత్త్విక, రాజకీయ పోరాటాలని అవగాహన చేసుకొని భారతీయ పరిస్థితులకు 'గతితార్కిక చారిత్రక భౌతికవాద' దృక్పథంతో అన్వయించుకొని ముందుకు తీసుకువెళ్ళాలి. ఒక్కొక్కడు ఒక్కొక్క చార్వాకుడిగా, ఒక భౌతికవాదిగా, పోరాటశక్తిగా ముందుకు నడవాల్సిన చారిత్రిక అవసరం ఈనాడు బలీయంగా ఉంది. మరీ ముఖ్యంగా దళిత, బలహీన, మైనార్టీ వర్గాలు భౌతికవాద పోరాటశక్తితోనే అగ్ర వర్ణ రాజ్యాధికారాన్ని కూల్చి పేదప్రజల రాజ్యాన్ని నిర్మించగలుగుతారు. ఆ నిర్మాణ కృషిలో భాగంగా "చార్వాక దర్శనం" భారత ఉపఖండంలోని వివిధ జాతుల పోరాటాలకు "తాత్త్విక భూమికను" రూపొందిస్తుంది. త్యాగంతో, సమర్పణతో, అవగాహనతో, అన్వేషణతో అద్వితీయ పోరాటశక్తులుగా దళిత, బలహీన మైనార్టీవర్గాలు చార్వాకుల వారసులై భావవాద, కర్మవాద, మూఢాచార, వర్ణవ్యవస్థ పునాదులను సమూలంగా పెకలించి 'గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథం'తో కూడిన సమరాజ్యాన్ని నిర్మించడానికి సమరయోధులుగా సముజ్జ్వల శక్తితో ముందుకు నడవండి- "చార్వాక దర్శనం" మీకు ఆయుధమౌతుంది. ●

—/o/—

* ibid- చతుర్థ స్కంధము (429), పేజీ- 380.

## ఈ గ్రంధరచనకు ఉపకరించిన గ్రంధములు


1. HISTORY OF INDIAN PHILOSOPHY
Dr.S.N. Dasgupta M.A. Phd; D.Litt
Kitab Mahal, Allahabad, 1969
2. STUDIES IN THE HISTORY OF INDIAN PHILOSOPHY
Debiprasad Chattopadhyaya, vol I, II, III.
K.P. Bagchi & Company Calcutta,
3. THE CULTURAL HERITAGE OF INDIA vol - I
Dr. Sarvepalli Radhakrishnan
Formerly president of India
The Ramakrishna Mission Institute of culture, Calcutta
4. INDIAN PHILOSOPHY
Debiprasad Chattopadhyaya
Peoples publishing house- Delhi
5. THE PLEASURES OF PHILOSOPHY
A Survey of Humanlife and Destiny
Will Durant
Published by Simon and Schuster Rockefellter centre,630 fifth Avenue Newyork
6. HINDU ETHOS AND THE CHALLENGE OF CHANGE
Subhaya Dasgupta
Published by the Minerva Associates 7,blake place, Calcutta -29 first published July 1972
7. WHAT IS LIVING AND WHAT IS DEAD IN INDIAN PHILOSOPHY
Debiprasad Chattopadhyaya Published by peoples publishing house- New Delhi first print-1976
8. OLD TESTAMENT OF INDIAN ATHEISM
Prof. Surendra Ajnat
Published by Bheem Patrika publications Nakodra Road, Jallundur- Punjab-1978
9. INDIA OF THE UEDIL AGE
J. Talboys Wheeler
Cosmo Publications Delhi-6, India-1973
10. MARX ENGELS LENIN
On Dealectical Materialism
Progress Publishers, Moscow-1977

11. MATERIALISM
M.N. Roy
Renaissance Publications-1940
12. KARL MARX AND OUR TIME
The Struggle for peace and social progress International Scientific conference, Berlin-April-11-(6) 1983
Published, Novosti press Agency publishing home Moscow –1984
13. THE TRUTH
In Gersoll
Indian Atheist Publishers, New Delhi-5, 1984
14. Dr. B. R. AMBEDKAR WRITINGS AND SPEECHES
vol-4 Complied by Vasant Moon
Education Department Govt. of Maharastra-1984
15. LOKAYATHA
Debiprasad Chattopadhya
16. ANCIENT INDIA
R. C. Majumdar
Published by Motilal Banarsidass, Bungalow Road, Jawahar Nagar, Delhi-7, 8th edition, 1977
17. COMMUNACISM AND THE WRITING OF INDIAN HISTORY- Peoples publishing house New Delhi 3rd print-1977
18. KARAL MARX, FEDRIC ENGELS Vol-I LENIN ON HISTORICAL MATERIALI M
Progress publishers-Moscow, 3rd print-1976
19. DELECTICES OF NATURE
Ferlerck Engels, rogress publishers Moscow
20. AN INTORDUCTION TO THE STUDY OF INDIAN HISTORY
D. D. Kosambi, popular prakashan, Bombay
21. CAPITAL vol-I
Progress publishers, Moscow
22. KARL MARX FEDRICK ENGELS
Collected works vol 1,5,14
23. LENIN COLLECTED WORKS
Vol-1,19,24,27
1. భారతీయ దర్శనం.
రచన రాహుల్ సాంకృత్యాయన్

అనువాదం : ఆలూరి భుజంగరావు
పబ్లిషర్స్ : రాహుల్ సాహిత్యసదనం-గుడివాడ.
2. భారతీయ తత్వశాస్త్రము(1,2,3,4 భాగాలు)
రచన : డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ
అనువాదం : విద్వాన్ బలుసు వెంకటేశ్వర్లు యం.ఎ
ప్రచురణ : తిరుమల తిరుపతి దేవస్థానం.
3. ప్రాక్పశ్చిమ తత్వశాస్త్ర చరిత్ర(vol-1)
అనువాదం : సరిపెల్ల విశ్వనాథశాస్త్రి M.A. P.O.L.
ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్తు
4. ఋగ్వేద ఆర్యులు
మూలం : రాహుల్ సాంకృత్యాయన్
అనువాదం : మిక్కిలినేని సుబ్బారావు.
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ -విజయవాడ.
5. మార్క్సిజం భగవద్గీత
యస్.జి. సర్దేశాయ్, దిలీప్‌బోస్, ఏటుకూరు బలరామమూర్తి
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.-1988,
6. వివేచన, ఉద్వేగవాదం, విప్లవం. -ప్రథమ భాగం.
తెలుగు అకాడమి, హైద్రాబాద్-1988.
7. కుటుంబం, వ్యక్తిగతఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుక
ఫ్రెడరిక్ ఎంగిల్స్! ప్రజాశక్తి బుక్‌హౌస్. -విజయవాడ-1969
8. మార్క్సిజం తత్వశాస్త్రం-టి.రవిచంద్.-1983,
9. తత్వశాస్త్రం మాయాజాలం కాదు
ఇంగ్లీషుమూలం: విదేశీ ప్రచురణలు, పీకింగ్-1972.
అనువాదం : చలసాని ప్రసాద్.
క్రాంతి ప్రచురణలు-హైద్రాబాద్.
10. మార్క్సిజం అంటే ఏమిటి ?
ఎమిలీ బరన్స్ ప్రజాశక్తిబుక్‌హౌస్ - విజయవాడ
ప్రథమముద్రణ.1980
11. కులం పునాదులు.
కత్తి పద్మారావు లోకాయత్ ప్రచురణలు,-1980

12. రిజర్వేషన్లు హిందూ మతోన్మాదం
కత్తి పద్మారావు లోకాయత్ ప్రచురణలు -1991.

13. తత్వశాస్త్రం అంటే ఏమిటి?
గలినాకిలిలెంకో లిదియాకోర్చునోవా
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్-హైద్రాబాద్-1986.

14. భారతీయ తత్వశాస్త్రము
(అవైదిక దర్శనములు) ద్వితీయభాగము
పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, సాధన గ్రంధమండలి - తెనాలి

15. బుద్ధుడు - బౌద్ధధర్మము
బి. ఆర్. అంబేడ్కర్. అనువాదం, యెండ్లూరి
ప్రచురణ : బుద్దిస్ట్ సొసైటీ ఆఫ్ ఇండియా
ఆంధ్రశాఖ - హైద్రాబాద్ - 1988

16. వేదతత్త్వ ప్రకాశము
ఋగ్వేదాది భాష్యభూమిక
శ్రీ మహర్షిస్వామిదయానంద సరస్వతి
అనువాదం : శ్రీ గోపదేవ్
తిరుమల తిరుపతి దేవస్థానం - తిరుపతి - 1967

17. కౌటిల్యుని అర్థశాస్త్రము
అనువాదం : శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య
ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్ - విశాఖపట్టణం - 1981

18. మనుస్మృతి
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్-చెన్నపురం-1942

19. శ్రీమద్భగవద్గీత
వ్యాఖ్యానము : స్వామిదయానంద సరస్వత
చిన్మయమిషన్ ట్రస్ట్ - ప్రొద్దుటూరు - 1980

20. విజ్ఞాన సర్వస్వము
ఏడవ సంపుటము, దర్శనములు - మతములు
సంపాదకులు : డా॥ కొత్త సచ్చిదానందమూర్తి
సంగ్రహకులు : శ్రీ మేడేపల్లి వరాహ నరసింహస్వామి

21. ప్రబోధ చంద్రోదయ విమర్శ
డాక్టర్ మల్లెల గురవయ్య - 1983

22. శ్రీ శంకరభాష్యోపేతా
శ్రీమద్భగవద్గీత,
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ - 1953

23. శంకర గ్రంథ రత్నావళి, ప్రథమ సంపుటము
అనువాదం : శ్రీ నిర్వికల్పానందస్వామి
సాధన గ్రంథ మండలి, తెనాలి - 1977

24. శ్రీ మహాభాగవతము (మొదటి సంపుటము)
బమ్మెర పోతనామాత్యులు
(ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠస్కంధములు)
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - 1977

25. ఆంధ్ర వేదములు, కృష్ణయజుర్వేదము
ప్రథమ సంపుటము
అనువాదం : రామవరపు కృష్ణమూర్తిశాస్త్రి

26. ఛాందోగ్యోపనిషత్తు
పండిత గోపదేవ్
ఆర్యసమాజం - కూచిపూడి, గుంటూరు జిల్లా - 1975

27. ప్రశ్నోపనిషత్తు
పండిత గోపదేవ్
ఆర్యసమాజము - కూచిపూడి, గుంటూరు జిల్లా - 1968

28. మృతకశ్రాద్ధము - వేదవిరుద్ధము
పాలడుగు శేషాచలవర్మ

29. ఈశావాస్యోపనిషత్తు
పండిత గోపదేవ్
ఆర్యసమాజం - కూచిపూడి - 1968

30. కఠోపనిషత్తు
పండిత గోపదేవ్ - 1970

31. శ్రీ మచ్ఛంకర భగవత్పాద చరిత్ర
డా॥ పోతుకూచి సుబ్రమణ్యశాస్త్రి
సాధన గ్రంథ మండలి - తెనాలి
32. ప్రాచీన భారతీయ తత్వశాస్త్రం
కె. యస్. ఆర్. ప్రసాద్
ప్రజాపిలుపు ప్రచురణలు
33. మార్క్సిస్ట్-లెనినిస్ట్ తత్వశాస్త్రం
మౌలికసూత్రాలు (1వ భాగము, 2వ భాగము)
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ - 1977
34. సర్వదర్శనసంగ్రహం,
మాధవాచార్య చౌకాంభా విధ్యాభవన్ - వారణాసి
35. చార్వాక దర్శనము
ఆచార్య ఆనంద
ఉత్తరప్రదేశ్ హిందీ సంస్థాన ప్రభాగ్ - లఖన్

ఇందులో ముఖ్యమైన గ్రంథాలను పేర్కొన్నాను. ఫుట్‌నోట్సువల్ల బట్టి మిగిలిన గ్రంథాలను గుర్తించగలరని ఆశిస్తాను.